# ఆత్మసాక్షాత్కార సూత్రాలు

(భగవాన్ శ్రీ రమణమహర్షి సంభాషణముల నుండి సంకలనము)





# సంతోషానికి మూలం ఆత్మే

## కొన్ని సంభాషణలు

ఈభాగములో 'సంతోషానికి మూలం ఆత్మే' అను అంశము 'శ్రీరమణమహర్షితో సంభాషణములు' నుండి గ్రహించిన సంభాషణలతో విశదీకరించబడింది.

### 1.01 సంపూర్ణశాంతి ఆత్మలో ఉంది; ఆత్మ ఒక్కటే ఉన్నది; అది చైతన్యము. (స.28)

**భక్తుడు:** ఆనందం అంటే ఏమిటి? అది ఆత్మలో స్వాభావికముగా ఉన్నదా లేక విషయములలో ఉన్నదా? లేక ద్రష్టకు, దృశ్యమునకు నడుమగల సంపర్కములో ఉన్నదా? మన వ్యవహారములలో మనకు ఆనందం కనుపించటం లేదు. అది అసలు ఎప్పుడు వస్తోంది?

**మహర్షి:** ఇష్టవస్తు సంసర్గము, స్మరణము కలిగినప్పుడు, అలాగే అనిష్ట వస్తు సంసర్గము, స్మరణము లేనప్పుడు, సుఖంగా ఉన్నదని మనం చెబుతాము. అట్టి ఆనందం సాపేక్షము. దానిని విషయసుఖము అని చెప్పవచ్చు. కాని **మనిషి శాశ్వతమయిన పరమానందమును కోరుకుంటాడు**. అది విషయములలో లేదు, పరతత్త్వములో ఉంది. అది సుఖ దుఃఖ రహితమయిన శాంతి, తటస్థస్థితి, ఉదాసీన స్థితి.

**భ:** ఏ రకంగా ఆనందము మన యథార్థ స్వరూపము?

**మ:** పరమానందరూపము బ్రహ్మమే. **పరమశాంతి ఆత్మలో ఉంది. అది మాత్రమే ఉన్నది; అది చైతన్యము.** 1) వేదాంతపరముగా విచారణ చేసి చూసినా, 2) భక్తి మార్గపరముగా భావించి తెలిసికొన్నా ఇదే నిర్ణయమునకు వస్తాము.

మనము ఆనందముకొరకు భగవంతుని ప్రార్థిస్తాము. ఆ ఆనందాన్ని అనుగ్రహ ద్వారా పొందుతాము. ఆనందప్రదాత స్వయముగా ఆనందమే అయి ఉండా ఆయన అనంతుడై కూడా ఉండాలి. కనుక ఇష్టదైవమైన ఈశ్వరుడు సర్వశక్తిమంతు ఆనందస్వరూపుడు. బ్రహ్మము ఆనందము, నిరాకారము, పరము పరిచ్ఛిన్నులయిన జీవులకు బ్రహ్మము పిదప ఈశ్వరుడు మూలము. ఆ మూల నుండి వచ్చిన జీవుల పారమార్థిక తత్త్వము ఆనందమే.

జీవశాస్త్ర రీత్యా కూడా ఒక జీవిలో శరీరావయములు పనిచేయుచున్నవం అందుకు కారణము, అట్టి వ్యాపారములు ఆనందకరముగా ఉన్నవి కనుక మన పెరుగుదల, ఆహారము, వ్యాయామము, విశ్రాంతి, సాంఘికాచారములు వీని అన్నింటికీ సుఖము ఒక్కటే దోహదకారిగా ఉన్నది. సుఖమునకు గ మనోవైజ్ఞానిక (మరియు తాత్త్విక) భూమిక ఇదే అని చెప్పవచ్చు. **మన స్వరూపమ మౌలికముగా ఏకము, అఖండము, ఆనందమయము.** దీనిని నమ్మదగిన ఒక ప్రమేయముగా స్వీకరించు. ఆ భగవంతుడు ఈశ్వరునిగా, ప్రకృతిగా (మాయగా విభక్తమై ఈ సృష్టి చేశాడు. మాయలో రెండు భాగాలున్నాయి. పరా: ఆధార తత్త్వము; అపరా: పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము (అష్టవిధమైనది).

**అహంత యొక్క సంపూర్ణత్వము అకస్మాత్తుగా ఒకానొక బిందువు దగ్గర భగ్నమైంది.** ఏదో కొఱత ఉన్నట్లు తోచింది. ఒకానొక వస్తువును పొందాలనో, ఒకానొక పని చేయాలి అనో కోరిక తలెత్తింది. ఆ కోరిక నెరవేరి, ఆ కొఱత తీరగానే, అహంతకు ఆనందము కలుగుతుంది. స్వతస్సిద్ధముగా ఉన్న సంపూర్ణత్వము మరల సిద్ధిస్తుంది. అందుచేత **ఆనందము మన సహజస్థితి, మన స్వరూపము అని చెప్పవచ్చు** సాపేక్ష మాత్రములయిన సుఖదుఃఖములు మన పరిచ్ఛిన్న దశకు సంబంధించినట్టివి. కొఱత తీరినప్పుడెల్ల మన పరిచ్ఛిన్నదశ ప్రగతి చెందుచున్నట్లు గోచరిస్తుంది. ఈ సాపేక్ష ప్రగతిని అరికట్టి, జీవాత్మ బ్రహ్మములో విలీనమైపోతే, ఆ జీవాత్మ సాపేక్షము, ... అయిన విషయ సుఖమును త్యజించి, సంపూర్ణ శాంతి, ఆనందమును

అనుభవిస్తుంది. **కనుక ఆత్మానుభవమంటే ఆనందమే. అంటే అనంతజ్ఞాన నేత్రముగా ఆత్మను సాక్షాత్కరింపజేసుకోవటం.** అంతేకాని అది యోగదృష్టికాదు, అత్యుత్తమమయిన ఆత్మ సమర్పణము. ఈ సంసారము దుఃఖమయము.

## 1.02 సంతోషమే తన నైజం కాబట్టి మనిషి సంతోషాన్ని కోరుకుంటాడు (స.619)

వివేకచూడామణి మొదలైన గ్రంథాలలో వాడబడిన 'ఆత్మ' అన్న మాటకి అర్థమేమిటని ఒక సందర్శకుడు ప్రశ్నించాడు.

***మ:*** నేను.

***భ:*** దేనిపైనన్నాగల ప్రేమకాదా?

***మ:*** సుఖప్రేమ అన్న కోరికే, మన ఆత్మలో నిరంతరముండే సంతోషానికి నిదర్శనం. లేకపోతే, ఆ కోరిక మాత్రమెట్లా ఉదయించగలదు? మనిషికి తలనొప్పి ఉండటమే సహజమైతే, దానిని వదిలించుకోవడానికి ఎవ్వరూ ప్రయత్నించరు కదా! కాని, తలనొప్పి ఉన్న ప్రతి మనిషీ తలనొప్పిలేని స్థితి గురించి తెలుసు కాబట్టి, దానిని వదిలించుకోవడానికి ప్రయత్నిస్తూనే ఉంటాడు. తనకి సహజమైనదేదో, దానినే పొందుదామనుకుంటాడు మనిషి. అదే విధంగా సంతోషమే తనకి సహజం కాబట్టి సంతోషాన్ని పొందాలనే కోరుకుంటాడు. సహజంగా ఉండేది కాబట్టి అది సంపాదించుకునేది కాదు. **దుఃఖం నుండి బయటపడటానికే మనిషి ప్రయత్నమంతా.** అది జరిగితే, నిత్యమయిన ఆనందం అనుభవసిద్ధమవుతుంది. ప్రాథమికమైన ఆనందాన్ని అనాత్మ (అంటే ఆనందలేమి లేక దుఃఖం) కప్పేస్తుంది. దుఃఖ నాశనమంటేనే సుఖప్రాప్తి అన్నమాట. సంతోషానికి దుఃఖం తోడైతే మిగిలేది దుఃఖమే. ఆ దుఃఖాన్ని తొలగిస్తే ఎప్పుడూ ఉండే ఆనందమే ప్రాప్తిస్తుంది. దుఃఖంతో అంతమయ్యే సుఖం కూడ దుఃఖమే. అటువంటి సుఖాన్ని మనిషి వదులుకుంటాడు. సుఖమంటే ప్రియమూ, మోదమూ, ప్రమోదమూను. వాంఛించినది దగ్గరగా ఉంటే ప్రియముద్భవిస్తుంది.

దానిని వశపరచుకుంటే మోదం కలుగుతుంది. దానిని అనుభవిస్తే ప్రమోదం కలుగుతుంది. ఈ విధమైన సుఖమయ స్థితులు కలగటానికి కారణం- ఏదో ఒక భావం మిగిలిన వాటిని ప్రక్కకు పెట్టేయడం. ఆ ఒక్క భావం కూడా ఆత్మలో విలీనమైపోతుంది.

## 1.03 అందరూ ఆత్మజ్ఞానమునకు అర్హులే (స.192)

**మ:** సంభాషణ క్రమములో ఇలా వివరించారు : మోక్షము ఎవరికి కావాలి? ప్రతి వానికీ ఆనందం కావాలి. ఆ ఆనందం కూడా ఇంద్రియ విషయ భోగఫలముగా లభించాలి.

ఈ ప్రశ్నను అడిగితే, ఒక గురువు ఇలా సమాధానము చెప్పాడు. "అది నిజమే. ఇంద్రియ విషయభోగఫలముగా లభించే ఆనందము, మోక్షానందముతో సమానమైనదే. పరమార్థప్రాప్తికి కావలసిన సాధన చతుష్టయములో మోక్షకాంక్ష అనగా ముముక్షుత్వము ఒకటి.ఇది అందరకు సమానమే. కాబట్టి **ఈ జ్ఞానమునకు – ఆత్మజ్ఞానమునకు అందరికీ అర్హత ఉంది."**

సాధకునకు ఏయే అర్హతలు ఉండవలయునని యోగసూత్రములు ఇత్యాదులలో చెప్పారో అట్టి అర్హతలన్నీ సంపూర్ణముగా కలిగియున్న వ్యక్తి ప్రపంచములో ఒక్కడు కూడా కన్పించకపోవచ్చు. అయినా, ఆత్మజ్ఞానసాధనను వదలి పెట్టకూడదు. **ప్రతివాడూ, స్వానుభవమును బట్టి, ఆత్మయే. అది యెఱుగక, దేహమే ఆత్మ అని తాదాత్మ్యము చెంది, అతడు దుఃఖిస్తున్నాడు.** ఇది ఆశ్చర్యములలో కెల్ల ఆశ్చర్యము. తాను ఆత్మయే. ఆత్మనిష్ఠుడై ఉండి, దుఃఖాలన్నింటినీ అంతం చేసుకోవచ్చును కదా?

అతడు తన్ను తాను దేహమే అనుకుంటున్నాడు కనుక, మొట్టమొదట అతనికి, 'నీవు దేహము కాదు' అని చెప్పవలసి ఉంటుంది. కాని అతడు దేహమూ, తదితరములన్నీ కూడా అయి ఉన్నాడు. దేహము ఒక భాగము మాత్రమే. **అతడు మొదట చైతన్యమును జడమునుండి విడదీసి చూడాలి;** తాను చైతన్య మాత్రునిగా

ఉండాలి. తరువాత జడము చైతన్యభిన్నముగా లేదని అనుభవగోచరము కావించుకోవాలి. ఇదే వివేకము అంటే. ఈ వివేకము మొదట్లో ఉండటమే కాదు; చివరి వరకు కొనసాగాలి. దీని ఫలితమే మోక్షము.

## 1.04 ఆనందము మనిషిలో సహజసిద్ధముగా ఉంది; అది బాహ్య కారణముల వలన వచ్చేది కాదు (స.3)

ఆనందస్వరూపమును గూర్చి ఎవరో అడిగారు.

**మ:** మనిషి, బాహ్య కారణముల వలన అనగా తనకున్న ఆస్తిపాస్తుల వలన ఆనందం కలుగుతున్నదని భావిస్తే, ఆ ఆనందం ఆస్తి పెరిగితే పెరగాలి, తరిగితే తరగాలి అనే నిర్ణయమునకు రావలసి ఉంటుంది. అప్పుడు, అతనికి ఆస్తి ఏమీ లేకపోతే, అతని ఆనందం శూన్యమైపోవాలి. కాని మనిషి యొక్క యథార్థమయిన అనుభవము ఎలా ఉంది? అది ఈ దృక్పథానికి అనుగుణముగా ఉన్నదా? గాఢనిద్రలో మనిషికి ఏ ఆస్తులూ లేవు; దేహము కూడా లేదు. దుఃఖముతో ఉండటానికి బదులు, అతడు చాలా ఆనందంగా ఉంటున్నాడు. ప్రతివాడూ తనకు గాఢంగా నిద్ర పట్టాలని కోరుకొంటాడు. దీనినిబట్టి ఏ నిర్ణయమునకు రావాలి? **ఆనందము మనిషిలో స్వతస్సిద్ధముగా ఉంది. ఆ ఆనందమునకు బాహ్య కారణములు ఏవీ లేవు. అందుచేత, మనిషి తన ఆత్మను సాక్షాత్కరింప జేసుకొని, తనలోని అఖండానంద నిధి ద్వారములు తెఱవాలి.**

## 1.05 ఆనందముగా ఉండటం సహజము; తక్కినదంతా అసహజము (స.633)

దిండిగల్ నుండి వచ్చిన ఒక ఆగంతకుడు ఇలా అడిగాడు : నా మనశ్శరీరముల కారణముగా నేను దుఃఖమును అనుభవిస్తున్నాను. పుట్టిననాటి నుండీ నాకు ఆనంద మనునది లేనే లేదు. నేను తన గర్భములో నున్నప్పటి నుండీ, నా తల్లి కూడా

దుఃఖమునే అనుభవించింది. ఇట్లని నేను విన్నాను. నేను ఇలా దుఃఖముల పా కావటానికి కారణము ఏమిటి? ఈ జన్మలో నేనే పాపమూ చేయలేదు. ఇది గత జన్మలో నేను చేసిన పాపాలకు ఫలితమా?

**మ:** ఎల్లప్పుడు ఉపశమనము (relief) అన్నదే లేని దుఃఖమే ఉన్నట్లయితే, ఆనందం కావాలని ఎవరు కోరుకుంటారు? అంటే, **దుఃఖమే సహజస్థితి అయి ఉంటే ఆనందంగా ఉండాలనే కోరిక అసలు ఎలా ఉత్పన్నమవుతుంది?** అయినా ఆనందేచ్ఛ కలుగుతూనే ఉన్నది కదా.

కాబట్టి ఆనందంగా ఉండుట సహజము; తదన్యమైనది అంతా అసహజము. దుఃఖమును ఎవ్వరూ కోరుకోనరు. ఎందువల్లనంటే, అది వస్తుంది, పోతుంది.

ఆ పృచ్ఛకుడు తన బాధలను మరల విన్నవించుకున్నాడు.

**మః మనస్సు, శరీరము దుఃఖిస్తున్నాయి అని కదా చెబుతున్నావు. కాని అవి ఈ ప్రశ్నలు వేస్తున్నాయా? ప్రశ్నించే వాడు ఎవడు? మనస్సుకు, శరీరమునకు అతీతముగా ఉన్నవాడే కదా ప్రశ్నిస్తున్నవాడు!** ఈ జన్మలో శరీరము దుఃఖిస్తున్నదని చెబుతున్నావు. ఇందుకు గతజన్మ కారణము. దానికి కారణము అంతకుముందున్న జన్మ. ఇలా అనంతంగా చెప్పాలి, విత్తు ముందా, చెట్టు ముందా అని అడిగితే ఏది ముందో చెప్పలేనట్లు, ఈ కార్యకారణపరంపరకు అంతమనునది లేదు. మరి ఏమి చెప్పాలి? ఈ జన్మ పరంపర కంతటికీ మొట్టమొదటి కారణం ఒకటి ఉన్నది. అది అజ్ఞానము. ఆ అజ్ఞానమే ఇప్పుడూ ఉంది, ఇక్కడే ఉంది, ప్రశ్నలను సంధిస్తూ ఉంది. ఆ అజ్ఞానమును జ్ఞానముతో తొలగించాలి, నిర్మూలించాలి.

**'ఈ దుఃఖము ఎందుకు వచ్చింది, ఎవరికి వచ్చింది?'** ఇలా నీవు **ప్రశ్నించుకుంటే, 'నేను' అనేది మనశ్శరీరములకంటె భిన్నమైన తత్త్వమనీ, ఆత్మయే శాశ్వతమైన తత్త్వమనీ, అదే శాశ్వతానందమనీ తెలుసుకుంటావు.** జ్ఞానమంటే ఇదే.

**భ:** కాని ఇప్పుడు దుఃఖము ఎందుకు కలగాలి?

మ: దుఃఖమనునదే లేకపోతే, ఆనందంగా ఉండాలన్న కోరిక ఎలా కలిగి ఉండేది? అట్టి కోరిక– కలుగకపోతే, ఆత్మాన్వేషణము విజయవంతము ఎలా అవుతుంది?

భ: అయితే దుఃఖము అంతా మంచిదేనా?

మ: నిజముగా మంచిదే. ఆనందం అంటే ఏమిటి? **ఆరోగ్యవంతమైన, అందమైనశరీరము,** సమయానికి ఆహారము ఇత్యాదిగా చెప్పబడేదా ఆనందమంటే? **చక్రవర్తి అయిన వాడికి కూడా కష్టాలు, అతడు ఆరోగ్యవంతుడై ఉన్నప్పటికీ, అంతులేకుండా ఉంటాయి.** "దేహమే నేను" అన్న మిథ్యా భావనయే సకల దుఃఖములకూ కారణము. ఆ మిథ్యాభావనను పరిత్యజించటమే జ్ఞానము.

## 1.06 ఆనందంగా ఉండాలనీ, సుఖాలను అనుభవించాలనీ గల కోరికయే సకల మనోవికారములకు కారణము (స.523)

బెంగాలు నుండి యాత్రికుల ప్రత్యేక రైలుబండిలో చాలామంది దర్శనార్థులు వచ్చారు. వారిలో ఒకడు, తాను పాల్ బ్రంటన్ పుస్తకమును చదివాననీ, అప్పటి నుండి శ్రీ భగవాన్‌ను దర్శించుటకు ఉత్కంఠతో ఉన్నాననీ చెప్పాడు. అతడు అడిగాడు: "నా మనస్సులోని కామములను నిగ్రహించుట ఎలా?"

మ: వాని మూలమును కనుగొంటే, ఆ పని సులభమౌతుంది. (తరువాత) కామములు అంటే ఏమిటి? కామము, క్రోధము ఇత్యాదులు. అవి ఎందుకు కలుగుతున్నాయి? మనము చూచే విషయముల యెడల గల ఇష్టానిష్టాల కారణముగా కలుగుతున్నాయి. ఆ విషయములు నీ దృష్టిలోనికి ఎలా వచ్చాయి? నీ అవిద్య వలన, అనగా అజ్ఞానము వలన వచ్చాయి. ఆ అజ్ఞానము దేనిని గురించి? అది ఆత్మను గురించిన అజ్ఞానము. ఇలా, నీ ఆత్మను కనుగొని, ఆ ఆత్మయందు నీవు నెలకొనియుంటే కామముల (passions) వలన నీకే బాధ ఉండదు. (తరువాత) ఇంకా, **మనోవికారములకు కారణము ఏమిటి? ఆనందముగా**

ఉండాలన్న కోరిక, లేక, విషయ సుఖములను అనుభవించాలన్న కోరికయే. ఆనందము కొరకు కోరిక ఎందుకు కలుగుతోంది? ఎందుకంటే, నీ స్వరూపమే ఆనందము; నీ స్వస్వరూపములోనికి నీవు రావటం సహజమైన విషయమే. ఈ ఆనందము ఆత్మలో తప్ప మరియెక్కడా లభించదు. కనుక ఆనందము కొరకు ఎక్కడో వెదకవద్దు. ఆత్మను వెదకు : ఆత్మ నిష్ఠుడవై ఉండు.

ఇంకా ఏమిటంటే, సహజసిద్ధమై ఉన్న ఆ ఆనందమును నీవు మరల కనుగొంటావు. అది అంతకు ముందు ఉన్నదే కనుక దానిని పోగొట్టుకోవటము అనేది ఉండదు. బాహ్య విషయముల నుండి లభించే ఆనందము, అది బయటనుండి కొత్తగా వచ్చినట్టిది కాబట్టి నష్టము కాక తప్పదు. అందుచేత అది శాశ్వతమైనది కాదు, కోరదగినది కాదు.

అంతేకాక, విషయ సుఖ తృష్ణను పోత్సహించరాదు. నిప్పును చల్లార్చవలయునంటే, దాని మీద పెట్రోలు పోస్తారా? పెట్రోలు పోస్తే అది చల్లారుతుందా? ప్రస్తుతానికి నీ కోరిక తీర్చుకుంటే, నీలోని కామము తరువాత అణగిపోతుందనుకొని చేసే ప్రయత్నము మూర్ఖత్వము అనిపించు కుంటుంది. నిజమే, మనోవికారములను నిగ్రహించేందుకు ఇతర మార్గములు ఉన్నాయి. అవి : 1. నియమబద్ధమయిన ఆహారము 2. ఉపవాసము 3. యోగాభ్యాసము 4. ఔషధసేవనము. కాని వాని వలన కలిగే ప్రయోజనము తాత్కాలికము. వానిని త్రొక్కిపట్టి ఉంచినంతకాలము అవి అణగివుండి, ఆ ప్రతిబంధము తొలగిపోగానే రెట్టింపు శక్తిని పుంజుకొని పైకి ఉబికి వస్తాయి. అందుచేత వానిని నిర్మూలించటము ఒక్కటే మార్గము. వానిని జయించటానికి వేరే మార్గము ఏదీ లేదు. నిర్మూలించవలయునంటే, పైన చెప్పిన రీతిగా వాని మూలమును కనుగొనాలి.

**1.07 శాంతియే నిజమైన ఆనందము. విషయ సుఖాలు ఆనందము కాదు (స.27)**

కామములతో శ్వాసగతి క్రమము తప్పిపోతుంది, కాని శాంతి, ఆనందములతో శ్వాసగతి క్రమపద్ధతిలో మందముగా సాగుతుంది. ఆనందాతిరేకము కూడ దుఃఖము వలెనే బాధాకరముగా ఉంటుంది. అందుకే ఈ రెండు దశలలోను శ్వాసగతి క్రమము తప్పి ఉంటుంది. శాంతి నిజమయిన ఆనందము. విషయ సుఖములు ఆనందము కావు.

**1.08 ఇప్పటి దుఃఖమునకు కారణము ఆత్మను గురించిన అజ్ఞానమే (స.63)**

వాస్తవము ఏమిటంటే – మనిషి తన్నుతాను పరిమితమయిన వాడనని భావిస్తాడు. అదే కష్టాలను తెచ్చిపెడుతోంది. కాబట్టి అట్టి పరిమిత భావన తప్పు. ఆ సంగతి అతడు స్వానుభవపూర్వకముగా తెలుసుకోవచ్చు. నిద్రలో జగత్తులేదు, అహంకారము లేదు (అనాత్మ లేదు). అందుచేత ఏ కష్టములూ లేవు. ఆ ఆనందస్థితి నుండి ఒకానొకటి ఏదో మేల్కొని, 'నేను' అంటుంది. అదే అహంకారము. ఆ అహంకారమునకు జగత్తు గోచరిస్తుంది. అతడు జగత్తులో ఒక అణుమాత్రునిగా ఉండుట వలన, తనకు ఇంకా ఏదో అధికంగా కావలెనని కోరుకుంటాడు; దానితో కష్టములపాలు అవుతాడు.

అహంత ఆవిర్భవించక ముందు అతడు ఎంత ఆనందముగా ఉన్నాడు! ప్రస్తుతం ఉన్న కష్టాలన్నింటికి అహంతయే కారణము. అతడు అహంత యొక్క మూలమును వెదకి, కనుగొంటే, అఖండానంద స్థితిని చేరుకుంటాడు. అది నిద్ర కాని నిద్ర. ఆత్మ ఎప్పుడూ, ఒకే రీతిగా ఉంది; ఇప్పుడే, ఇక్కడే ఉంది. దానికంటె పొందవలసినట్టిది మరి ఇంకేమీ లేదు. పొరపాటున పరిమితులను ఊహించుకోవటం జరిగింది కనుక, వానిని అధిగమించవలసిన అగత్యము

ఏర్పడింది. ఇది పదిమంది మూర్ఖుల కథ వంటిది. ఆ కథలో పదిమంది మూర్ఖులు ఒక నదిని దాటి, అవతలి ఒడ్డుకు చేరి, తమను తొమ్మిది మందిగా లెక్కించుకొని, ఆందోళనకు గురి అయినారు. తెలియని పదియవ వ్యక్తి మరణించాడని భావించి, వారు విలపించటం మొదలుపెట్టారు. ఒక బాటసారి, అటుపోతూ, వీరిని చూచాడు. వారి దుఃఖానికి కారణము ఏమిటని అడిగి తెలుసుకొన్నాడు. అతడు అందరినీ లెక్కపెట్టి చూస్తే, పదిమందీ నిక్షేపంగా ఉన్నారు. ప్రతివాడూ, తన్ను మినహాయించుకొని, మిగతా వారిని లెక్కించటం వల్ల ఈ తికమక యేర్పడింది. ఆ బాటసారి ప్రతివాడిపైన ఒక దెబ్బ వేసి, ఆ దెబ్బలను లెక్కించవలసిందని వారికి చెప్పాడు. వారు పది దెబ్బలను లెక్క పెట్టారు. పదిమంది బతికే ఉన్నారని తెలిసికొని తృప్తి పడ్డారు. ఈ కథలోని నీతి ఒకటే. దశముడు (పదోవాడు) కొత్తగా ఎక్కడి నుండో వచ్చిపడలేదు. అంతసేపూ అతడు అక్కడే ఉన్నాడు. కాని అజ్ఞానం వలన వారందరికీ దుఃఖము కలిగింది.

అలాగే మనిషి, అతని ఆత్మ – వీని విషయములో కూడా తెలుసుకోవాల్సి ఉంది – కొత్తగా పొందవలసినదంటూ ఏదీ లేదు. **ఆత్మను గురించి ఏర్పడి ఉన్న అజ్ఞానమే ఇప్పటి దుఃఖాలన్నింటికీ కారణము.** ఆత్మజ్ఞానము సిద్ధిస్తే ఆనందము అనుభూతమవుతుంది. పైగా దేనిని అయినా కొత్తగా పొందవలసి ఉన్నదంటే, అది ఇంతకు ముందు లేదని అర్థము వస్తుంది. ఇంతకు ముందు లేనిదే కనుక అయితే, అది ఇక ముందు లేకుండ పోవచ్చు కూడ. అలాంటప్పుడు మోక్షమునందు నిత్యత్వము లేకుండా పోతుంది. కాని మోక్షము శాశ్వతమైనట్టిది. ఆత్మ ఇప్పుడే, ఇక్కడే ఉంది; శాశ్వతముగా ఉంది. ఆ విధముగా, మనిషి యొక్క ప్రయత్నములు అజ్ఞాన నివారణకు మాత్రమే నిర్దేశింపబడ్డాయి. జ్ఞానము స్వతస్సిద్ధముగా నిత్యసిద్ధముగా ఉన్నప్పటికీ, కొత్తగా ఉదయించినట్లు భాసిస్తుంది.

## 1.09 మనలోని వెలితి వల్లనే ఆనందంగా ఉండాలనే కోర్కె కలుగుతుంది (స.106)

**భ:** ఆనందాన్ని పొందడమెట్లా?

**మ:** ఆనందం బయట నుండి పొందేది కాదు. అంతేకాదు, ఆనందమే నువ్వు. ఎల్లప్పుడూ, **ఏదో వెలితి ఉన్నదనిపించడం వల్లనే ఆ వాంఛ కలుగుతుంది. అసలు ఈ వెలితి ఉన్నట్లనిపించేది ఎవరికి?** విచారించు. గాఢ నిద్రలో నీవు ఆనందమయుడవే. ఇప్పుడు మాత్రం కాదు. ఆనందమయ స్థితికీ, ఆనందలేమికీ మధ్య వచ్చిందేమిటి? అదే అహంభావం. దాని మూలం కనుక్కో నీవు ఆనందమేనని తెలుసుకో. కొత్తగా పొందాల్సిందేమీ లేదు. **నేను 'ఆనందమయుడను కాను' అనే అవిద్యనే తొలగించుకోవాలి.** చేయాల్సిందల్లా ఇదే. ఈ అజ్ఞానమెవరికి? అహంభావానికే. ఆ అహంభావపు మూలం అన్వేషించు. అది మాయమౌతుంది, మిగిలేదల్లా ఆనందమే. అది నిత్యం. నీవు అదే, ఇప్పుడే, ఇక్కడేను. అన్ని సందేహాలనూ నివృత్తి చేసుకోవడానికి అదే కీలకం. అహంభావం నుండే మనస్సు ఉదయిస్తుంది. అహంభావం, ఆత్మ నుండి ఉదయిస్తుంది. అహంభావపు మూలం కోసం వెతుకు, ఆత్మ వెల్లడి అవుతుంది. ఉండేదల్లా అదొక్కటే. విశ్వమంటే వ్యాపించిన ఆత్మే. ఆత్మకి భిన్నం కాదది.

**భ:** జీవించడానికి ఉత్తమమైన మార్గమేమిటి?

**మ:** మనిషి జ్ఞానా, అజ్ఞానా అన్నదానిపై మారుతుందది. తన ఆత్మకి భిన్నంగాగాని వేరుగా గాని దేనినీ చూడడు జ్ఞాని. అన్నీ ఆత్మలోనివే. **జగత్తు అంటూ ఒకటుందనీ, దేహమంటూ ఒకటుందనీ, నీవు ఆ దేహంలో ఉన్నావనీ, ఊహించుకోవడమే తప్పు.** సత్యం తెలిస్తే– జగత్తూ, దానికి ఆవలనున్నదీ కూడా అంతా ఆత్మే అని తెలుస్తుంది. దృక్పథం మనిషి యొక్క దృష్టిని బట్టి మారుతుంది. దృష్టి, కంటిమీద ఆధారపడింది. ఆ కన్ను ఎక్కడో ఉండాలి కదా. స్థూలమైన కంటితో చూస్తే మిగిలిన వాళ్ళు కూడా

స్థూలంగానే కనబడుతారు. సూక్ష్మ నేత్రంతో (అంటే మనస్సుతో) మిగిలిన వాళ్ళు కూడా సూక్ష్మంగానే కనబడుతారు. అపరిమితమైన ఆత్మతోనే చూస్తే నేత్రం కూడా అపరిమితమే అవుతుంది. ఆత్మకి భిన్నంగా చూడటానికి ఏదీ లేనేలేదు. భక్తుడు మహర్షికి కృతజ్ఞత తెల్పుకున్నప్పుడు, మహర్షి- ఎప్పుడూ ఆత్మగా ఉండటమే కృతజ్ఞత కలిగి ఉండటమన్నారు.

## 1.10 ద్వయీభావం వల్లనే వస్తుజాలాన్ని సంపాదించుకోవాలనే కోరిక కలుగుతుంది (స.502)

**భ:** ఒక శ్లోక భావమిది, "నేనే రాజ్యాన్నీ కోరను. ఎప్పుడూ నిన్నే సేవించనీ, అందులో నాకుంది పరమానందం" ఈ భావం సరియైనదేనా?

**మ:** సరియైనదే. ద్వయీభావమున్నంతకాలమూ కామం కలగటానికి అవకాశముంది. వేరే విషయమంటూ ఏమీ లేకపోతే కోరికే ఉండే అవకాశమే లేదు. వాంఛారహిత స్థితే మోక్షమంటే- గాఢ నిద్రలో ద్వయీభావం లేదు, అందువల్లే వాంఛ కూడా లేదు. మేల్కొని ఉన్నప్పుడు ద్వయీభావముంటుంది, అందువల్లే కామం కూడా ఉంటుంది. ఈ ద్వయీభావం వల్లనే దేనినైనా పొందుదామనే కోరిక కలుగుతుంది. అది బహిర్ముఖమైన మనస్సు. అదే ద్వయీభావానికీ, కామానికీ మూలం. ఆత్మే పరమానందమని ఎరిగి ఉంటే మనస్సు అంతర్ముఖమవుతుంది. ఆత్మానుభూతి కలిగితే అన్ని కోర్కెలూ తీరినట్లే. బృహదారణ్యక ఉపనిషత్తు చెప్పిన "ఆప్తకామః ఆత్మకామః అకామశ్చ" అన్న మాటకిదే అర్థం. అదే మోక్షమంటే.

## 1.11 బాధకి కారణం దేహంతో తప్పుడు తాదాత్మ్యం (స.272)

**భ:** ప్రపంచమంతా, క్షామం, తెగులు వ్యాపించి ఉన్నాయి. వీటి వల్ల ఎంతో ధ్వంసం జరుగుతుంది- ఈ పరిస్థితికి కారణమేమిటి?

**మ:** ఇవన్నీ ఎవరికి కనబడుతున్నాయి?

**భ:** అట్లా అంటే కుదరదు. నా చుట్టూ బాధని చూస్తూనే ఉన్నాను.

**మ:** గాఢ నిద్రలో ఉండగా లోకంగాని, అందులోని బాధగాని నీకు తెలియలేదు. మేల్కొన్నప్పుడే వాటి ఎరుక కలిగింది. ఈ బాధల వల్ల ప్రభావితం కాని స్థితిలోనే ఉండు. అంటే, లోకపు ఎరుక లేకపోతే, అందులోని బాధలు కూడా నిన్ను ప్రభావితం చెయ్యవు. **గాఢ నిద్రలో వలే నువ్వు ఆత్మగానే ఉన్నప్పుడు, లోకమూ, అందులోని బాధలూ నిన్నేమీ ప్రభావితం చేయవు.** అందువల్ల లోపలికి చూచుకో, ఆత్మని గ్రహించు. లోకమూ, అందులోని దుఃఖమూ అంతమవుతాయి.

**భ:** కాని అది స్వార్థపరత్వం కాదా?

**మ:** ప్రపంచం బయటెక్కడో లేదు. **తప్పుగా దేహంతో తాదాత్మ్యం చెందుతున్నావు కాబట్టి నీకు వెలుపల, ప్రపంచాన్నీ, అందులోని బాధనీ చూస్తావు.** కాని అవేవీ సత్యం కావు. ఆ సత్యం కోసం అన్వేషించి, అసత్యమైన ఈ అనుభూతిని వదిలించుకో.

**భ:** ఈ ప్రపంచపు బాధని మహనీయులుగాని, ప్రజాసేవకులుగాని పరిష్కరింపలేకపోతున్నారు.

**మ:** వాళ్లంతా అహంభావసహితులు. వారి వైఫల్యానికి కారణమిదే. వారు ఆత్మనిష్ఠులైతే ఇంకో విధంగా ఉంటారు.

**భ:** అయితే, మహాత్ములు ఎందుకు సాయం చేయరు?

**మ:** వాళ్లు సహాయం చేయడం లేదని నీకెట్లా తెలుసు? నోటితో, చేతులతో వస్తువులతో చేసే సహాయం కన్నా గొప్పది మహాత్ముల మౌనం. మిగిలిన వారి కంటె వాళ్లే ఎక్కువ సాధిస్తారు.

**భ:** ప్రపంచపు దుస్థితిని తగ్గించడానికి మేమేమి చేయాలి?

**మ:** నువ్వు బాధ లేకుండా ఉంటే ఇంకెక్కడా బాధ ఉండదు. ఉన్న చిక్కంతా ఏమిటంటే

ప్రపంచం నీ బయట ఉందని చూడటంలోనూ, అందులో బాధ ఉందనుకోవడంలో
ఉంది. ప్రపంచమూ, బాధా నీలోనే ఉన్నాయి. నీవు లోపలే చూసుకుంటే బా
అంటూ ఏమీ ఉండదు.

## 1.12 ఆనందంగా ఉన్న వ్యక్తియే ఇతరులకు ఆనందమును పం ఇవ్వగలడు (స.597)

**భ:** జ్ఞాని సిద్ధులను ఉపయోగించి ఇతరులకు ఆత్మజ్ఞానమును కలుగజేస్తాడా, లేక అతడు ఆత్మసాక్షాత్కారము పొంది ఉండటమొక్కటే అందుకు సరిపోతుందా?

**మ:** జ్ఞాని యొక్క ఆత్మసాక్షాత్కార సిద్ధికున్న శక్తి ఇతరమయిన అన్ని సిద్ధుల ఉపయోగముకంటె ఎక్కువ శక్తిమంతమయినట్టిది. జ్ఞానిలో అహంభావము లేదు కనుక, అతనికి అన్యులు అంటూ ఎవరూ లేరు. ఇతరులకు సమకూర్చ దగిన పరమ ప్రయోజనము ఏమిటి? అది ఆనందమే. **ఆనందము శాంతి వలన కలుగుతుంది.** విక్షేపము లేనప్పుడే శాంతి రాజ్యమేలుతుంది. విక్షేపము తలపుల వలన ఏర్పడుతుంది. తలపులు మనస్సులో ఆవిర్భవిస్తాయి. ఆ మనస్సే లేకపోతే అఖండశాంతి సిద్ధిస్తుంది. తన మనస్సును నిర్మూలించకపోయినట్లయితే, మనిషికి శాంతి లభించదు,అతడు ఆనందముగా ఉండలేడు. ఆనందము కలిగి ఉండకపోతే, ఇక ఇతరులకు ఆనందాన్ని ప్రసాదించగలడా? అతడు మనస్సు లేకుండా ఉంటే, అతనికి ఇతరులను గురించి ఎఱుక ఉండదు. కాబట్టి అతడు **ఆత్మ సాక్షాత్కారము కలిగియున్నాడన్న వాస్తవము ఒక్కటే చాలును; దాని ద్వారా అతడు ఇతరులందరికీ ఆనందాన్ని పంచియివ్వగలడు.**

## 1.13 శాంతి ప్రదాయకమైనదే అత్యుత్తమసిద్ధి (స.20)

**భ:** ఏసుక్రీస్తు జనుల వ్యాధులను నయం చేశాడు. అది ఒక సిద్ధి మాత్రమేనా?

**మ:** తాను జనుల వ్యాధులను నివారిస్తున్నట్లు ఏసుక్రీస్తుకు ఆ సమయములో

తెలుసా? తనకు ఆ శక్తులున్నవన్న స్ఫురణము ఆయనకు ఉండి ఉండకపోవచ్చు, దానికి సంబంధించిన కథ ఒకటి ఉంది. ఏసుక్రీస్తు ఒకసారి ఒకని గ్రుడ్డితనాన్ని నివారించాడు. ఆ వ్యక్తి కాలక్రమంలో దుష్టునిగా మారిపోయాడు. కొన్నేళ్ల తరువాత అతనిని కలుసుకొని ఏసుక్రీస్తు, "నీవు ఇలా ఎందుకు అయ్యావు", అని అడిగాడు. అతడు అప్పుడు ఇలా జవాబు చెప్పాడు. "నేను అంధునిగా ఉన్నప్పుడు ఏ పాపమూ చేయలేనిస్థితిలో ఉన్నాను. మీరు నా అంధత్వాన్ని నివారించారు. నేను దుష్టుడిగా మారాను. కనుక మీరే నా దుష్టత్వానికి కారణము."

**భ:** ఏసుక్రీస్తు సిద్ధులున్న పూర్ణ పురుషుడు కూడా!

**మ:** తనకు సిద్ధులున్నవని ఆయనకు తెలిసి ఉండకపోవచ్చును.

**భ:** దూరశ్రవణము మొదలయిన సిద్ధులను సంపాదించుకొనటం మంచిది కాదా?

**మ:** టెలీపతీగాని, రేడియోగాని దూరమున ఉండే విషయాలను చూచేందుకూ, వినేందుకూ శక్తినిస్తాయి. అవన్నీ ఒకటే, వినుట అయినా చూచుట అయినా. దగ్గర నుండి విన్నా దూరమున ఉండి విన్నా, వినుటలో ఎట్టి భేదము లేదు. మౌలికమయిన అంశము శ్రోత, ద్రష్ట . శ్రోత కాని, ద్రష్టకాని లేకపోతే, వినుట ఉండదు, చూచుట ఉండదు. వినుట, చూచుట అనేవి మనోవ్యాపారములు. కనుక సిద్ధులు మనస్సులోనే ఉన్నాయి. అవి ఆత్మకు సహజ సిద్ధమయినవి కావు. సహజమైనది కాక, కొత్తగా సంపాదించుకొన్నట్టిది శాశ్వతమైనది కాదు. దానికై ప్రయాసపడుట దండగ. సిద్ధులంటే విస్తరించిన శక్తులు. మనిషి పరిమితమయిన శక్తులు కలిగియుంటేనే ఇంతగా దుఃఖముల పాలు అవుతున్నాడే! ఇక తన శక్తులను విస్తరింపజేసుకొని, ఆ విధముగా సుఖముగా ఉండాలని కోరుకుంటే, సుఖముగా ఉండగలడా? **పరిమితమయిన ఇంద్రియ శక్తులతోనే మనిషి దుఃఖాన్ని పొందుతుంటే, అపరిమితమైన ఇంద్రియశక్తులతో అతని దుఃఖము కూడా అపరిమితముగా వృద్ధి చెందాలి కదా? అందుచేత సిద్ధులు ఎవ్వరికీ సుఖాన్ని తెచ్చిపెట్టవు సరికదా, మరింత దుఃఖాన్ని పెంచుతాయి.**

పైగా ఈ సిద్ధులన్నీ ఎందుకు? సిద్ధుడు కాగోరెడివాడు తన సిద్ధులను ప్రదర్శించా కోరుకుంటాడు, ఆ సిద్ధులను చూచి తనను ఇతరులు మెచ్చుకోవాలని అభిలషిస్తా అతనికి ఇతరుల నుండి ప్రశంస లభించాలి. అది లభించకపోతే, అతడు సుఖంగా ఉండడు. అతనిని ప్రశంసించేందుకు ఇతరులంటూ ఉండాలి కూడా. అంతే కా అతనికంటె ఎక్కువ సిద్ధులు కలిగి ఉన్న వాడు మరి యొకడు అతని తటస్థపడవచ్చు. దానితో అతనిలో ఈర్ష్య చోటు చేసుకుంటుంది. అతని దుఃఖం ఇనుమడిస్తుంది. ఆ ఎక్కువ సిద్ధులు కలవాడు తనకంటె కూడా ఎక్కువ సిద్ధులు కల మరియొకనిని కలుసుకోవచ్చు. అలా ఆ క్రమము సాగుతుంది. చివరకు ఎవడో ఒకడు వచ్చి ఈ సమస్తాన్నీ చిటికలో బ్రద్దలు చేయవచ్చు. అట్టివాడు పరమసిద్ధుడు, భగవంతుడు, ఆత్మ. కనుక నిజమైన శక్తి ఏది? సంపద పెంపొందింపజేయునట్టిదా? లేక శాంతిని సంపాదించి పెట్ట గలిగినట్టిదా? శాంతి ప్రదాయకమైనదే అత్యుత్తమ సిద్ధి.

## 1.14 జ్ఞాని సిద్ధులను గూర్చి తలపను కూడ తలపడు (స.57)

అయితే జ్ఞానికీ, సిద్ధునికీ నడుమ గల భేదము ఏమిటి? సిద్ధునికి వరములను ప్రసాదించే శక్తి ఉన్నదని చెబితే, జ్ఞానికి ఆ శక్తి లేదనే అర్థము వస్తున్నది కదా! ఇదీ సంశయము.

మహర్షి ఇట్లు వివరించారు : 'రమణగీతలోని ప్రశ్నలు ఒకానొక దృష్టితో అడిగారు. సమాధానాలు కూడా ఆ దృష్టిని అనుసరించే చెప్పాను. జనులు దేహాన్ని మాత్రమే చూస్తారు. వారికి సిద్ధులు కూడా కావాలి. ఆత్మసాక్షాత్కారము కలిగిన తరువాత ఏ సిద్ధులూ దానిలోనికి విస్తరించుటకు సమర్థతను కలిగియుండవు, ఇక దానికి అతీతముగా ఎట్లు విస్తరించగలవు?

సిద్ధులు కావాలని ఆతురత చెందేవారు జ్ఞానమును గురించి తమకు గల [illegible]తో తృప్తి జెందరు. కాబట్టి ఆ జ్ఞానమునకు [illegible]

జోడింపవలయునని కోరుకుంటారు. జ్ఞానము వలన కలుగు పరమానందమును ఉపేక్షించి, సిద్ధులను అభిలషిస్తారు. దీని కొరకు వారు రాజమార్గాన్ని వదలి, ఇరుకు సందుల గుండా పోతూ పథభ్రష్టులవుతారు. వారిని సరియైన మార్గములోనికి తీసికొని వచ్చేందుకు మాత్రమే సిద్ధులు జ్ఞానమును వెంటనంటి ఉంటాయని చెప్పటం జరిగింది. నిజానికి జ్ఞానములోనే అన్నీ ఉన్నాయి. జ్ఞాని అయిన వాడు సిద్ధులను గురించి ఆలోచించనే ఆలోచించడు. జనులు జ్ఞానమును ముందుగా పొందాలి. అటు తరువాత అంతగా కావాలనుకుంటే సిద్ధుల కొరకు ప్రయత్నించవచ్చు.

## 1.15 జ్ఞానికి మానసిక ముద్రలు (లేక అభిప్రాయాలు) ఉండవు (స.9)

**భ:** జ్ఞానీ, పసిపిల్లా ఒకలాగానే ఉంటారని శాస్త్రాలెందుకంటాయి?

**మ:** ఒక విధంగా జ్ఞానీ, పసిపిల్లా ఒకలాగానే ఉంటారు. ఏదైనా జరుగుతున్నంతసేపే పసిపిల్లకి దానిమీద ఆసక్తి ఉంటుంది. అది అయిపోయిన తరువాత పసిపిల్ల దాని గురించి ఆలోచించదు. అంటే ఆ సంగతి పిల్లమీద ఏ ముద్రా వేయదు. ఆ పిల్ల మానసికంగా ఏ విధంగానూ ప్రభావితం కాదు. జ్ఞాని విషయంలోనూ ఇంతే.

## 1.16 సంస్కారాలన్నీ తుడిచిపెట్టుకుపోతే ఎదిగినవాడు కూడ పసివాడే అవుతాడు (స.414)

శ్రీ జి.వి సుబ్బరామయ్య అనే భక్తుడు ఆసక్తిదాయకమైన ఖండకావ్యాలని వ్రాశాడు. వాటిల్లో కొన్ని ఒక పసివాని గురించి కూడా ఉన్నాయి. భగవంతుడే పసివాడు అవుతాడు. అట్లాగే పసివాడు భగవంతుడవుతాడన్నారు శ్రీభగవాన్. అంటే, పసివానిలో అతని సంస్కారాలు అణగి ఉండటం వల్ల, అమాయకంగా ఉంటాడన్నమాట. ఆ సంస్కారాలన్ని తుడిచిపెట్టేస్తే ఎదిగినవాడు మళ్లీ పసివాడవుతాడు. అంటే భగవంతుడే అవుతాడు!

# రెండవ భాగము

## ఆత్మ, సాక్షాత్కారము

భగవాన్ ఇట్లా సెలవిచ్చారు: "నేను' అనేది దేహం కాదనీ, లోపలే ఉండే మరేదోననీ ఒప్పుకుంటున్నావు కదా. దేహంలో ఎక్కడ్నుంచి ఈ 'నేను' అనేది పుడుతోందో గమనించు. అది లేస్తూ, అదృశ్యమైపోతూ ఉంటుందా లేక ఎప్పుడూ ఉంటుందా అని గమనించు. **నీవు నిద్ర నుండి మేల్కొంటున్నపుడే ఒకానొక 'నేను' లేచి దేహాన్ని, ప్రపంచాన్నీ, ఇతరమైన వాటినీ చూస్తుందనీ, మళ్లీ నిద్ర పోయినప్పుడు అది ఉండదనీ అంగీకరిస్తావు. అంతేకాక, దేహంతో నిమిత్తం లేకుండా, దేహానికి అతీతంగా ఇంకొక 'నేను' ఉంది. నీకు దేహమూ, ప్రపంచమూ లేనప్పుడు కూడా అంటే, నిద్రలో కూడా అది ఉంది.**

**"నిద్రలోనూ, ఇతర అవస్థలలోనూ ఉన్నది ఒకే 'నేను' కాదా? అని ప్రశ్నించుకో.** లేక రెండు "నేను'లున్నాయా? ఎప్పుడూ ఒకే మనిషివి కదా నీవు. వస్తూ, పోతూ ఉండే 'నేను' లేక, ఎల్లప్పుడూ నిలచి ఉండే "నేను", వీటిలో ఏ 'నేను' నిజమైవుంటుంది?

**"నీవు అప్పుడు నేను ఆత్మనే అని గ్రహిస్తావు. ఇదే 'ఆత్మ సాక్షాత్కారమంటే'.** ఆత్మ సాక్షాత్కారమనే స్థితి నీకు అన్యమైనది కాదు. నీకు దూరమైనది కాదు. నువ్వు చేరుకోవలసినది కాదు. నీవెప్పుడూ ఆ స్థితిలోనే ఉంటావు. దానిని మరచి మనస్సుతోనూ, అది సృష్టించే దానితోనూ తాదాత్మ్యం చెందుతావు. మనస్సుతో ఈ తాదాత్మ్యాన్నే విడవాలి. చేయవలసిందల్లా ఇంతే. మనమింతకాలమూ అనాత్మతో తాదాత్మ్యం చెందడం వల్ల, మనం ఆత్మే అని గ్రహించడం కష్టమవుతోంది. **అనాత్మతో తాదాత్మ్యాన్ని విడనాడటమే, ఆత్మసాక్షాత్కారమంటే". *(అ.ర.17.8.46)**

---

* [illegible] రమణులతో, 17.8.46న జరిగిన సంభాషణ)

# ప్రవేశిక

ఆత్మకి సంబంధించిన 'సత్', 'చిత్' లక్షణాల గురించి ఈ విభాగంలో చూద్దాం. ఆత్మ స్వయంవిదితమే. తానున్నట్టు వేరే ఎవరి సాక్ష్యమూ అక్కర్లేదు. అయినా, తనకి ఆత్మ గురించి ఎరుక లేదంటాడు ప్రతివాడూ. శ్రీభగవాన్ ఆత్మ ఎప్పుడూ ప్రత్యక్షమయ్యే ఉందంటారు. ఆత్మానుభవాన్ని అజ్ఞానమనే తెర కప్పేస్తుంది. ఆ తెరని తీసేస్తే, నిరంతరమూ ఉన్న ఆత్మని కొత్తగా కనుగొన్నట్టు మనిషి సంతోషిస్తాడు. ఇట్లా ఎందుకంటారనేది చూద్దాం.

## స్వయం విదితమైన ఎఱుకయే ప్రత్యక్షము (2.15)

మనం మేల్కొని ఉన్న అవస్థలో ఒకదానితో మరొకదానికి నిమిత్తం లేని రెండు ఆవరణలలో ఉంటామంటారు శ్రీభగవాన్. మొదటిది, మనకి కేవల ఉనికి అయిన ఆత్మ యొక్క ఎరుక. రెండవ అనుభవం- బాహ్య జగత్తు యొక్క ఎరుక. ఇది సామాన్యం. అధిష్టానం ఆత్మచైతన్యమే- దాని కాంతిలో మనస్సూ, ఇంద్రియాలూ (సచేతనమై) పనిచేసి బాహ్యవస్తుజాలపు ఎరుక కలిగిస్తాయి. కానీ, ఈ బాహ్య వస్తుజ్ఞానం మనకి గల చైతన్యపు అనుభవాన్ని మరుగుపరుస్తుంది. బాహ్య జగత్తుకి సంబంధించిన ఎరుక ఉన్నంత కాలమూ, అధిష్టానమైన చైతన్యపు ఎరుక ఉండజాలదు. మనస్సు, ఇంద్రియాలు, నిశ్చలమైతే ఉండేది చైతన్యపు ఎరుకే.

సామాన్యుని దృష్టిలో జ్ఞానమన్నా, అజ్ఞానమన్నా ఏమిటి? నిత్య జీవితంలో మనకి ఇంద్రియాల ద్వారా అనుభవసిద్ధమయ్యే వాటిని జ్ఞానమంటాం. అట్లా కాని వాటిని అజ్ఞానమంటాం. ఉదాహరణకి: 'నాకు పంచదార ఏమిటో తెలుసు' అన్నప్పుడు దానిని చూచామని, రుచి చూచామనీ మన భావం. ఇదే ప్రత్యక్ష జ్ఞానమనుకుంటాం. 'పంచదార ఏమిటో తెలియదు' అన్నప్పుడు ఆ పంచదారని జ్ఞానేంద్రియాల ద్వారా (అంటే రంగు, రుచి, వాసన, వగైరా) అనుభవించలేదని మన ఉద్దేశం. ఇటువంటి జ్ఞానాన్ని సాపేక్షజ్ఞానమనో, సాపేక్ష చైతన్యమనో అంటారు భగవాన్. "ఆత్మకన్నా

ప్రత్యక్షమైనదేదైనా ఉండగలదా- ఇంద్రియ జ్ఞానంతో నిమిత్తం లేకుండా ప్రత్యక్ష అనుభవమవుతూంటుంది కదా. జ్ఞానేంద్రియాల ద్వారా గ్రహించినది పరోక్ష జ్ఞానం ప్రత్యక్ష జ్ఞానం కాలేదు. తనకి స్వయంగా ఉన్న ఎరుకే ప్రత్యక్ష జ్ఞానం. ఇది అందరి అనుభవమే. ఆత్మని తెలుసుకోవడానికి వేరే ఏ సహాయమూ అక్కర్లేదు. అంటే ఎరుక కలిగి ఉండటానికన్నమాట" (స. 92). సాపేక్ష జ్ఞానం అజ్ఞానమే, అంటే ఆత్మవిస్మృతేనంటారు శ్రీభగవాన్.

'నేను ఉన్నాను' అన్నదొక్కటే ప్రతివానికీ శాశ్వతము, ప్రత్యక్షము, అయిన అనుభవంగా ఉన్నది. 'నేను ఉన్నాను' అన్న దానివలె ప్రత్యక్షమైన విషయం మరొకటి లేదు. జనులు 'ప్రత్యక్షము'గా అనగా, ఇంద్రియముల ద్వారా వారు పొందే అనుభవముగా పేర్కొనేది, ప్రత్యక్షము కానేకాదు. ప్రత్యక్షము ఆత్మయే. ప్రత్యక్షము అన్నది ఆత్మకు మరొక పేరు అని అంటారు భగవాన్ (2.15).

ఒక వస్తువుని చూచినప్పుడు మనం దానిని తప్పుగా ప్రత్యక్షమంటాం. ప్రత్యక్షమనబడే దానికి- చూడటానికి కళ్లుండాలి. కళ్లున్నా, కంటి చూపు ఉంటేనే గాని ఆ వస్తువు స్పష్టంగా తెలియదు. కంటి చూపు సరిగ్గా ఉన్నా, ఆ వస్తువేమిటో, దాని నైజమేమిటో గ్రహించడానికి బుద్ధి ఉండాలి. బుద్ధి వెనుక ఆ వస్తువేమిటో తెలుసుకునే ద్రష్ట యొక్క అవధానముండాలి. ద్రష్ట వెనుక చైతన్యముంటుంది, అది లేకపోతే ద్రష్టే ఉండడు. అంటే ఒక వస్తువును చూడటంలో చైతన్యపు వివిధ దశలున్నాయన్నమాట. కాబట్టి, మనమనుకునేట్లు, అది ప్రత్యక్షం కాదు. వీటన్నిటిలోనూ మార్పు చెందనిది చైతన్యమొక్కటే. **ఆత్మగా చైతన్యముండని క్షణం లేదు. దానికి భిన్నంగా ద్రష్ట ఉండలేదు** (2.01). మన దృష్టి వస్తువు మీదకు మరల్చటంతో, ఆత్మ గురించి ఎరుకని పోగొట్టుకుంటాం.

చైతన్యం నిత్యమూ ఉండే అధిష్ఠానం. అది మనస్సులో, దేహంలో వ్యాపించివున్న స్థితిని మెలకువ అంటాం- దాని వల్లే ప్రపంచాన్నీ, వస్తు జాలాన్నీ చూడగలుగుతాం. మనసూ- దేహమూ అనే వాటి నుండి అది ఉపసంహరింపబడిన స్థితిని నిద్ర అంటాం. చైతన్యం, మనస్సులో మాత్రమే వ్యాపించి ఉంటే, స్వప్నావస్థ అంటాం. ఈ మూడు అవస్థలూ ఉండటానికి కారణం, ఆ అధిష్ఠానమే. ఈ మూడు అవస్థలూ

మారుతూండటం వల్ల ప్రపంచం కనబడుతూంటుంది. లేక కనబడకుండా కూడా పోతుంది. కాని ఏ మార్పు చెందని చైతన్యం అధిష్టానంగానే ఉంటుంది. ఉండేదెప్పుడూ చైతన్యమే. అది అజము, నిత్యము. అదొక్కటే ఉనికి (సత్).

## గాఢనిద్రలో ఆత్మ శుద్ధచైతన్యంగా ఉంటుంది, దాని నైజం సంతోషం

మన నిజస్థితిని గురించి చెప్పడానికి, మూడు అవస్థలలోనూ మన నిత్యానుభవాన్ని వాడుతారు శ్రీ భగవాన్. గాఢనిద్రలో మన ఉనికి గురించి రెండు కోణాల నుండి చెప్తారు. మొదటిది, మేల్కొని ఉన్న మనిషి నిద్రానుభవాన్ని జ్ఞప్తికి తెచ్చుకున్న దృక్పథం, రెండవది నిద్రలో ఉన్న వాని దృక్పథం. ఇందులో మేల్కొని ఉన్న వానికి గాఢనిద్ర గురించి ఉన్న దృక్పథం గురించి చూద్దాం. నిద్ర నుండి లేవగానే ప్రతివాడూ ఇట్లా అంటాడు–

(1) నేను హాయిగా నిద్రపోయాను

(2) నిద్రలో ఉండగా నాకేమీ తెలియనే లేదు

మనం నిద్రలో ఉండగా ఈ మాటలని అనం. మేల్కొన్నప్పుడే అంటాం. మేల్కొని ఉన్న అవస్థలోని "నేను", నిద్రించి ఉన్నవాడూ తానూ ఒకటేనని భావించి, నిద్రానుభవాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఈ మాటలు అంటాడు (2.08). నిద్రలోని సంతోషాన్ని (లేక శాంతిని) కాదనలేము. గాఢ నిద్రలో కూడా 'నేను' ఉండి, ఆ ఆనందాన్ని అనుభవించింది, ఆ అవస్థలో దానికి దేహంగాని, మనస్సుగాని లేవు. దానికి మేల్కొని ఉండగా మనస్సు ద్వారా, ఇంద్రియాల ద్వారా బాహ్య జగత్తు యొక్క అనుభవం ఉన్నట్లు, గాఢనిద్రలో లేదు. అందువల్లే 'నాకు నిద్రలో ఏమీ తెలియలేదు' అంటాడు. కానీ, నిద్రలో ఈ రెండు అనుభవాలు ఉన్నాయీ అంటే చైతన్యముందని అర్థం, ఎందు కంటే, చైతన్యం లేనిదే ఏ అనుభవము సాధ్యంకాదు. అందువల్ల "గాఢ నిద్రలో నాకేమీ తెలియలేదు" అన్నప్పుడు మనస్సూ, ఇంద్రియాలూ, తద్వారా లభించిన అనుభవాలూ ఆ అవస్థలో లేనట్టు తెలుస్తుందేగానీ, చైతన్యం లేనట్టు మాత్రం కాదు (2.02, 2.03, 2.14, 3.51). గాఢ నిద్రలోని 'నేను' కేవల చైతన్యమేనంటారు శ్రీభగవాన్. ఇంద్రియాలూ, మనస్సూ లేకపోవడం వల్ల బాహ్య

వస్తుజాలాన్ని గమనించలేని స్థితి, మబ్బుపట్టిన నిశిలో కళ్లు తెరచుకొని ఉన్నా కేవలం చీకటే తెలుస్తుండగా అందులోని వివిధ వస్తువుల జాడ తెలిసికోలేని స్థితి వంటిదంటారు శ్రీభగవాన్. సుషుప్తిలో అజ్ఞానముయొక్క ఎరుకలో ఉంటాడు మనిషి (2.11).

ఇక నిద్రించేవాని దృక్పథం నుంచి ఆ అవస్థ ఏమిటో చూద్దాం. నిద్రిస్తుండగా 'ఎంతో హాయిగా పడుకున్నాను, నిద్రలో నాకేమీ తెలియలేదు' అనే మాటలని నిద్రలో ఎవ్వరూ అనరు. మేల్కొన్న తరువాతనే అంటారు. **నిద్రలో ఉండేదల్లా అఖండమైన కేవల చైతన్యమే (3.18), ఆ అవస్థలో ఇంకేమీ ఉండవు. అంటే మేల్కొని ఉన్నప్పుడు ఉండే 'నేను'గాని, ఇంద్రియాలుగాని, ఉండవు. కనుక లోకమే ఉండదు. అందువల్లే నిద్రలో ఏమీ అనలేము (3.51). గాఢ నిద్రలోని "నేను" ఆత్మే.** ఈ దృక్పథాన్ని జ్ఞాని ఒక్కరే చెప్పగలరు, జ్ఞానికి ఎల్లవేళలా ఎరుక ఉంటుంది కాబట్టి. ఆ ఎరుక గురించి శ్రీభగవాన్ ఇట్లా అంటారు: ఆత్మ నిష్ఠలో ఉన్నవాడు, అవిచ్ఛిన్నమైన కేవల ఎరుకలో ఉంటాడు, ఇక మిగిలిన అవస్థలు, అంటే, మేల్కొని వుండటం, కలగాంచటం, నిద్రించడం, చైతన్యపు తెరమీద వస్తూపోతూ వుండే అవస్థలు.

మామూలు మనిషి దేహంతో తాదాత్మ్యం చెందుతాడు. అతనికి మనస్సూ, ఇంద్రియాలూ ఉండటం వల్లే మేల్కొని ఉన్న స్థితిలో చైతన్యముందని గ్రహిస్తాడు. ఆ కారణంగా, మనస్సూ ఇంద్రియాలూ పని చేయని గాఢనిద్ర– అపస్మారకంతో సమానం. చైతన్యం గాఢనిద్రలో కూడా ఉంటుందని పైన చెప్పుకున్నాం కదా. జగత్తుకే స్వతంత్రమైన అస్తిత్వముంటే గాఢ నిద్రలో కూడా ఉండాలి కదా అని శ్రీభగవాన్ ప్రశ్నిస్తారు.

శ్రీభగవాన్ ఎద్దుబండిలో బాగా నిద్రపోయిన ప్రయాణీకుని ఉపమానం కూడా చెప్తారు. ప్రయాణంలో ఎద్దులు కదులుతుండవచ్చు, నిలిచిపోవచ్చు. వాటిని కాడి నుండి విడిచి పెట్టవచ్చు కూడా. వీటి గురించి అందులో నిద్రిస్తున్న ప్రయాణీకునికి ఏమీ తెలియదు. కాని మేల్కొనేప్పటికి తాను వేరే ప్రదేశంలో ఉన్నట్టు చూస్తాడు. దారిలో జరిగినవేవీ అతనికి తెలియకపోయినా, గమ్యం చేరుకుంటాడు. మనిషి ఆత్మ కూడా అంతే. బండిలోనిద్రపోతున్న మనిషివలే ఆత్మ దేహంలో నిద్రిసుంది.

ఎద్దుల కదలిక దానికి మేల్కొన్న స్థితి. ఎద్దులు ఆగిన స్థితి దానికి సమాధి (సమాధి అంటే జాగృత్ సుషుప్తి). జరిగే పనులతో నిమిత్తం లేకపోయినా ఎరుకగా ఉంటుంది. అంటే, ఎద్దులు కాడెకు బంధింపబడినా నిలచిఉన్న స్థితి. ఎద్దులను కాడి నుండి విడిపించడం దానికి నిద్రావస్థ. అంటే, శరీరవ్యాపారాలు ఏవీ వుండవన్న మాట. ఈ ఉపమానాన్నే క్రింద ఇచ్చిన పట్టిక ద్వారా కూడా చూపవచ్చు.

| | |
|---|---|
| 1) ప్రయాణీకుడు ఎద్దు బండిలో నిద్రించడం. | 1) మనిషి ఆత్మ, దేహంలో నిద్రించటం |
| 2) ప్రయాణీకుడికి బండి కదలిక తెలియదు, కాని గమ్యం చేరుతాడు | 2) ఆత్మకు దేహపు చేష్టల గురించి ఎరుక ఉండదు. ఆత్మకి తన గురించే ఎరుక ఉంటుంది. |
| 3) బండి | 3) మనిషి దేహం |
| 4) ఎద్దులు | 4) మనస్సూ, ఇంద్రియాలూ |
| 5) బండి కాడెకు కట్టబడిన ఎద్దులు కదులుతున్నా, నిద్రిస్తున్న ప్రయాణీకునికి తెలియదు. | 5) మేల్కొన్న స్థితి. మనస్సూ, ఇంద్రియాలూ, దేహమూ ఏవో చేస్తుంటాయి కాని వీటి గురించిన ఎరుక ఆత్మకి ఉండదు. |
| 6) కాడికి కట్టబడిన ఎద్దులు కదలకుండా నిలబడుతాయి | 6) మనస్సూ, ఇంద్రియాలూ నిశ్చలమవుతాయి. ఆత్మ మెలకువగా, సమాధ్యవస్థలో ఉంటుంది, కాని ప్రపంచానికి సంబంధించినంత వరకూ నిద్రిస్తుంది |
| 7) ఎద్దులను కాడె నుండి విప్పుతారు, బండి కదలదు కాని ప్రయాణీకునికి వీటి ఎరుక ఉండదు. | 7) సుషుప్తి అవస్థ. ఏశరీరవ్యాపారాలు వుండవు. ఆత్మకి ఆ సుషుప్తి అవస్థ యొక్క ఎరుక ఉండదు. |

గాఢ నిద్రలో ఏ కోరికలూ ఉండవు. ప్రపంచపు అనుభవమూ ఉండదు. అ
అద్వైత స్థితి. మనలోని విభేదాలన్నిటినీ మరుగుపరచేస్తుంది, ఆనందాన్ని కలిగిస్తుంది.
ఆ నిద్రలోని సంతోషప్రాప్తి కోసం మనుష్యులు పడుకొనే పక్కని చక్కగా
అమర్చుకుంటారు. మెత్తని దిళ్లూ వగైరా, మంచి నిద్రని కలిగించటానికే. అంటే
మేల్కొన్న స్థితిని అంతమొందించడానికే. కాని ఈ సౌకర్యాలు గాఢ నిద్రలో ఎందుకు
పనికిరావు. దీని అంతరార్థమిది. అన్ని సాధనాలూ అజ్ఞానాన్ని అంతమొందించడానికే,
ఆత్మజ్ఞానం కలిగిన తరువాత అవి నిష్ప్రయోజనం.

జాగ్రదవస్థలో మనస్సూ ఇంద్రియాలు పని చేయనప్పుడు మనకి ఎరుక ఉంటుంది.
అప్పుడు గాఢ నిద్రలోగల శాంతిని అనుభవిస్తాం. దీనినే జాగ్రత్-సుషుప్తి అంటారు.
ఇదే ఆత్మ. మేల్కొని ఉండగా ఆ స్థితిని సంపాదించమంటారు శ్రీభగవాన్. "నిశ్చలగా
ఉండు- దానిని (ఆత్మని) గ్రహించు" అంటారు.

నిద్రపోతున్నవాడు తన స్థితిని గురించి మాట్లాడలేడు. నిద్ర, మెలకువలో వున్న
మనిషి యొక్క గమనిక. అంటే గాఢ నిద్రలో మనస్సూ, ఇంద్రియాలు పనిచేయక
పోవడం వలన దేహం గురించి గానీ, ప్రపంచంగురించి, గానీ ఎరుక లేదని
అనటం. ఈ గమనిక ఆత్మది కాదు. మేల్కొని ఉన్నా, నిద్రిస్తూన్నా ఆత్మకేమీ పట్టదు.
ఎద్దుబండిలోని ప్రయాణీకుని వలె. ఆత్మకి తన గురించే ఎరుక. నిద్రలో ప్రపంచం
కనబడకపోయినా, మేల్కొని ఉన్నప్పుడు కనబడినా దానికి పట్టదు. మేల్కొన్న స్థితీ,
దాని అంతమూ గురించి ముందు ముందు చూద్దాం.

**అన్ని అవస్థలలోని అనుభూతులకు మూలము 'నేను'- అది దేహంగాని, మనస్సుగాని కాదు.**

అన్ని అనుభూతులూ, అనుభవించేవాడొకడుండబట్టే కలుగుతాయి. అది నిద్రలోనైనా
సరే, మేల్కొని ఉన్నప్పుడైనా సరే. మేల్కొని ఉన్నవాడు తనకి నిద్రలో, కలలో కలిగిన
అనుభవాలని గుర్తు చేసుకుంటాడు. నిద్రపోయే ముందు కలిగిన అనుభవాలను

కూడా జ్ఞాపకం తెచ్చుకుంటాడు. అంటే, అనుభవించే వాడొక్కడే అన్నమాట. మేల్కొని ఉన్నవానికి దేహమూ, మనస్సూ ఉంటాయి. అతని అనుభవాలు వాటి వల్లనేనా? లేకపోతే ఈ అనుభవాలకి కారణంగా వెనుక ఎవరైనా, ఏదైనా ఉందా? మేల్కొని ఉన్న వానికి కాలికి దెబ్బ తగిలినప్పుడు' "దెబ్బతగిలింది అంటున్నది మీ కాలా?" అని అడిగితే, కాదు 'ఆ మాట అనేది నేనే' అంటాడు. అయితే, ఈ 'నేను' ఎవరు? మూడు అవస్థలలోనూ ఒకటే 'నేను' ఉంది. ఈ అనుభవించేవాడెవడో తెలుసుకోవడానికి సుషుప్తి అవస్థ మనకి తోడ్పడుతుంది. సుషుప్తిలోని 'నేను'కి దేహం లేదు, మనస్సు లేదు కాని ఆనందం యొక్క అనుభవముంటుంది. గాఢ నిద్రలోని అనుభవం మనస్సూ ఇంద్రియాల వల్ల కలుగదు అని చూసాము. అందువల్ల ఆ అవస్థలో కలిగింది విషయ జ్ఞానం, సాపేక్షం కాదు. దేహమూ, మనస్సూ లేని ఉనికి యొక్క ఎరుక అది- అంటే కేవల ఉనికి. గాఢ నిద్రలోని చైతన్యం, శుద్ధ చైతన్యం. అంటే గాఢ నిద్రలోని ఉనికి- ఎరుక, కేవల ఆత్మే అన్నమాట. రూపరహితమైన 'తానే' మూడు అవస్థలలోని అనుభవాలకూ అధిష్ఠానం- అది దేహంగాని, మనస్సుగాని కాదు (2.08)

తన అనుభవాలన్నిటికీ దేహమూ, మనస్సూ కారణం అని తప్పుగా భావిస్తాడు మనిషి. తమకంటూ ఈ రెండింటికీ ఏ చైతన్యమూ లేదు. చైతన్యపు కాంతి వల్లనే అవి పనిచేయగలుగుతాయి- కానీ, తామే చైతన్యవంతమైనట్లు వ్యవహరిస్తాయి. బాహ్య వస్తుజాలాన్ని తెలుసుకునే ప్రయత్నంలో, శుద్ధమైన 'నేను'ని మరుగు పరచి గందరగోళం చేస్తాయి. గాఢ నిద్రలోని* 'తాను' 'నేను ఈ దేహాన్ని' అనే భావం వల్ల కలుషితం కాదు.

## మన అసలు నైజం చైతన్యమే

గాఢ నిద్రలో కూడ చైతన్యముంటుందని చూచాం కాబట్టి మనమెప్పుడూ అచేతనంగా ఉండము. అంతేకాకుండా, మేల్కొని ఉన్న 'నేను' నిద్రపోవడానికి పూర్వం కలిగిన

* గాఢ నిద్రలోని 'నేను'ని, దేహంతో తాదాత్మ్యం చెందని అసలైన 'నేను' ని 'తాను' అని అంటున్నాం

అనుభవాలని జ్ఞాపకం చేసుకుంటుంది. కాబట్టి, చైతన్యం నిద్రావస్థలో కూడా కొనసాగుతూనే ఉందని తెలుస్తోంది.

మేల్కొని ఉన్నప్పుడు మనం పనులు చేసుకోవడానికి మనకి గల బుద్ధి (ఆలోచించే శక్తి) మీద ఆధారపడతాం. ఈ బుద్ధి వల్లనే పని చేసుకోగలుగుతున్నామనుకుంటాం. గాఢ నిద్రలో ఈ బుద్ధి ఉండదు. మన నిజ స్థితేమిటో గాఢ నిద్రలో తేటతెల్లమవుతుంది. అది సత్-చిత్. ఆలోచించటంగాని, ఏదో అవడమోగాని మన అసలు నైజం కాదు. మేల్కొన్నప్పుడు ఆలోచనలను ఆపలేనందువల్ల నిశ్చలస్థితిని అనుభవింపలేకపోతాం. ఆ నిశ్చలస్థితే సత్-చిత్. ఇదే మన సమస్య. ఆలోచనారహిత స్థితిలోగల ఎరుకలో, మన ప్రమేయమే లేకుండా పనులు కొనసాగిపోతాయి. శ్రీభగవాన్ ఇట్లా సెలవిచ్చారు: **"కేవల ఉనికే ఆత్మ. ఆ ఉనికి గురించి నీకు ఎరుక కూడా ఉంది. ఆ ఉనికే చిత్ కూడా (సత్-చిత్). అదే నీ నిజ తత్త్వం. తన ఉనికిని కాదనే వారెవరైనా ఉన్నారా? కేవల ఉనికి ఉన్నట్టు అంగీకరిస్తారు. ఆ అంగీకారంలోనే చైతన్యం కూడా ఉన్నట్టే" (2.02).**

### ఉనికియే చైతన్యం (కేవల ఉనికియే ఎరుక)

ఉనికియే చైతన్యమని అర్థం చేసుకోవడానికి శ్రీభగవాన్ ఈ వివరణనిచ్చేవారు. ఉనికి చైతన్యం కాదనుకుందాం. అటువంటి ఉనికి అచేతనం కాబట్టి తన గురించి తనకి తెలియదు. అంటే జడమన్నమాట. ఉనికిని తెలుసుకునే మరో చైతన్యమే ఉంటే అది కూడా జడమే అవుతుంది.

అంటే ఉనికి కన్నా భిన్నమైన చైతన్యమంటూ ఉంటే అది కూడా జడమే అని తెలుస్తోంది. చైతన్యాన్ని జడమనడం అసంబద్ధం కదా! కాబట్టి ఉనికి (సత్) చైతన్యం (చిత్) ఒకటే (స.506). ఉపదేశసారం 23వ ద్విపదలో శ్రీభగవాన్ చెప్పేది ఇదే: "వేరొక చిత్తులేదు ఉన్నది, ఉన్నదే జ్ఞానమౌ ఉన్న చిత్తేను."

బైబిల్ అన్నట్టు* "నేను ఆ నేను-వున్నాను" అన్నదే యథార్థం. "ఉన్నా"ననటానికి రుజువు చైతన్యమే. "నేనున్నాను" అనేది ఉనికీ, చైతన్యమూ కూడా.

## తాను (నేను) ఎప్పుడూ దేహంతో ఏకం కాదు

సుషుప్తిలో మనమున్నాం- దేహంతోగాని, మనస్సుతోగాని ప్రమేయం లేకుండా. మిగిలిన రెండు అవస్థలలోనూ వాటితో సంబంధముంటుంది. స్వాభావికంగానే మనం దేహంతో ఏకమైతే సుషుప్తిలో దేహం లేకుండా ఎట్లా ఉండగలం?- మనకి బాహ్యమైన దాని నుండి మనం వేరు కావచ్చు కాని మనలోనే ఉన్నదాని నుండి ఎట్లా వేరుపడగలం? అందువల్ల 'తాను' దేహంతో ఏకం కాదు. దేహంగాని మనస్సుగాని లేని సుషుప్తిలో ఉండే 'తానే' మనం జాగ్రదావస్థలో కూడా. శ్రీభగవాన్ చెప్పిన ఈ సూచన చాలా ముఖ్యమైనది. తాను చైతన్యమేగాని దేహం కాదన్నది మనకి అర్థమయితే మన అస్థిత్వం గురించి మనకున్న దృక్పథం మారుతుంది. అందువల్ల మన సాధన తేలిక అవుతుంది, ఫలవంతమవుతుంది. దేహరహితమైన తాను (అంటే ఆత్మ) వైపే మన ప్రయత్నమంతా ఉంటుంది. వాస్తవానికి మనము ఆత్మే కదా!

## భావరహిత స్థితిలోనే చైతన్యపు నైజం తెలుసుకోవడానికి సాధ్యమవుతుంది.

మనం మామూలుగా ఊహించుకున్నట్లు ఆలోచనలు నిరంతరాలు కావు. ఒక ఆలోచన వస్తుంది, అంతమవుతుంది. అట్లాగే ఇంకోటి వస్తుంది, అంతమవుతుంది. రెండు ఆలోచనలకి మధ్య కొంత వ్యవధి ఉంటుంది. ఎంత కొంచెమైనా సరే. ఒక భావముదయించగానే దానిపైన అవధానం కలుగుతుంది మనకి. ఆ అవధానమే చైతన్యం. ఆ ఆలోచనలమీద మన అవధానమున్నంత సేపూ అవి వర్ధిల్లుతాయి. మనం ఆ అవధానాన్ని ఉపసంహరించి, 'నేను'గా ఉంటే అవి ఆగిపోతాయి. రెండు భావాలనడుమ వ్యవధిలో తాను (నేను) నిలచి, కేవల స్థితిలో ఉంటుంది. అట్టి ఈ

* బైబిల్‌లో చెప్పినమాట I Am that I-Am. దీనిని ఎన్నోవిధాలుగా వ్యక్తపరచవచ్చు. ఈ మాటలకు 'నేను అనగా నేను – ఉన్నాను' అని అర్థం.

వ్యవధి ఎరుకగా, ప్రశాంతిగా అనుభవసిద్ధమవుతుంది. రెండు భావాల మ... అంతరమెక్కువైన కొద్దీ, ప్రశాంతత ఇంకా ఎక్కువగా, లోతుగా ఉంటుంది. దీ... భిన్నంగా, ఒక భావముదయించినప్పుడు అది నిజమేననుకొంటే మనకి దేహంలో మార్పులూ, ఉద్రేకాలూ వచ్చి మనతో ఏదో ఒకటి చేయిస్తాయి. ఆలోచనల మధ్య అవధానాన్ని ఆత్మవిచారణ ద్వారా ఉపసంహరించడమే వైరాగ్యం.

"రెండు అవస్థల మధ్యా, రెండు భావాల మధ్య కేవల అహం (తాను) అనుభవమవుతుంది. అహం ఒక గొంగళీ పురుగు వంటిది. రెండవ ఆకు దొరికితే, మొదటి దాన్ని విడిచిపెడ్తుంది. అహం యొక్క అసలు స్వరూపం అది ఏ వస్తువునీ ఏ భావాన్నీ పట్టుకోకుండా ఉన్నప్పుడు తెలుస్తుంది (2.11). అవస్థాత్రయాన్ని సరిగ్గా అర్థం చేసుకున్న తరువాత కలిగే జ్ఞానాన్నుపయోగించి, ఈ వ్యవధిని అనుభవసిద్ధం చేసుకో అంటారు శ్రీభగవాన్. నిద్ర నుండి మేల్కొంటున్నప్పుడు అహం చాలా కొద్దిసేపు శుద్ధచైతన్యంగా ఉంటుంది దేనితోనూ సంబంధం లేకుండా. కాని వెనువెంటనే దేహాన్ని గుర్తించగానే దానితో సంబంధం పెట్టుకొని, తాను దేహానికి పరిమితమవుతుంది. అట్లా సంబంధం పెట్టుకున్న దానినే అహంభావమంటారు. అంటే గాఢ నిద్రలోని అహం అసలైనది. మేల్కొని ఉన్న స్థితిలో "నేను ఈ దేహాన్ని" అనే భావం కలిగి ఉండటం వల్ల అది కలుషితమైన 'నేను' అవుతుంది. ఏ వస్తువుతోనూ, ఏ భావంతోనూ దానికి సంబంధం లేనప్పుడే చైతన్యమంటే ఏమిటో తెలుస్తుంది. దేనితోనూ సంబంధం లేనిదే శుద్ధ చైతన్యం. అదే గాఢనిద్రలో సంతోషంగా, ప్రశాంతంగా ఉండేది. అందువల్ల సాధనకి లక్ష్యం, దేనితోనూ సంపర్కం పెట్టుకోని అహాన్ని అనుభవ సిద్ధం చేసుకోవడమే. నిద్ర నుండి పూర్తిగా మేల్కొనని స్థితిలో ఆ చైతన్యపు అనుభవం అవుతుంది.

**శ్రీభగవాన్ ఇట్లా సెలవిచ్చారు: "శుద్ధమైన ఆత్మ, అమిశ్రమైన ఉనికి–చైతన్యము. అది జాగ్రదావస్థలో విషయాల ఎరుక కలిగివున్నట్లుగా వుండక, ఏ వస్తువులతోనూ సంబంధం పెట్టుకోదు. మనమిపుడు చైతన్యముగా పరిగణిస్తున్నది మేల్కొని ఉండగా**

మనస్సు, మెదడు, దేహముపై ఆధారపడి ఉన్న చైతన్యము. కాని గాఢనిద్రలో ఇవేవీ లేకుండా ఎరుక ఉంటుంది" (2.03)

## ఆత్మ సాక్షాత్కారాన్ని స్వచ్ఛమైన అహం ద్వారా పొందు

శ్రీభగవాన్ ఇట్లా అన్నారు: "నిద్రలో ఆత్మ కేవల చైతన్యం. నిద్రకి, మేల్కొన్న స్థితికి మధ్య దశలో ఇదం (ఇది) లేని అహంగా ఉదయిస్తుంది. కాని అదే, 'నేను'గా మరియు 'ఇది'గా ప్రకటమౌతుంది జాగ్రదావస్థలో. వ్యక్తికి కలిగే అనుభవాలన్నీ 'నేను' వలన కలిగేవే. ఒక అవస్థ నుండి మరొక అవస్థలోకి మారే సమయంలోని అహాన్ని అనుభవసిద్ధం చేసుకోవాలి. లేకపోతే, నిద్రానుభవం ప్రయోజనం లేదు. ఆ స్థితిలోని అహాన్ని అనుభవసిద్ధం చేసుకొంటే, అధిష్ఠానం తెలిసినట్టే. అదే గమ్యానికి చేరుస్తుంది. నిద్రని అజ్ఞానమంటారు. మేల్కొని ఉన్న స్థితిలోని తప్పుడు జ్ఞానంవల్లే అట్లా అంటారు. అసలు మేల్కొని ఉన్న స్థితే అజ్ఞానమంటే . నిద్రలో ఉండేది ప్రజ్ఞానం. రెండు సంకల్పాలకిగాని, రెండు భావాలకిగాని నడుమనున్న వ్యవధే శుద్ధ అహం". కాబట్టి, ఆ శుద్ధ అహాన్ని అంటిపెట్టుకొని ఉండటమే సాధన యొక్క లక్ష్యం.

"ఆ శుద్ధమైన అహం మనకిప్పుడు ఎందుకు తెలియదు, ఎందుకు జ్ఞాపకం రాదు? దానితో 'పరిచయం' లేకపోవడమే కారణం. ప్రయత్న పూర్వకంగా దానిని సంపాదిస్తేనే, దానిని గుర్తించగలం. అందువల్ల అట్లా సంపాదించే ప్రయత్నం చేయి" (2.10) అంటారు శ్రీభగవాన్.

గాఢనిద్రలో ఆత్మ కేవల స్థితిలో ఉన్నా అది జ్ఞాని ఉండే ఆనందమయ స్థితి కాదు. జ్ఞాని ఎప్పుడూ ఎరుకలో, ఆనందంలో ఉంటాడు. అవస్థాత్రయం వారికి ఉండదు. మామూలుగా గాఢ నిద్రలో అజ్ఞానముండటం వల్ల దానిని ఎరుకగా గుర్తించరు, కాని జ్ఞానికి ఎప్పుడూ ఎరుక ఉంటుంది. ఈ కారణంగా, గాఢ నిద్ర వేరు, జ్ఞాని ఉండే స్థితి వేరు. గాఢ నిద్ర మనిషికి ఆలోచనలు వాటి ప్రభావము లేని స్థితి.

దానిని ప్రయత్నపూర్వకంగా మార్చలేం- ఆ స్థితిలో ప్రయత్నమే అసంభవం క
అది శుద్ధ చైతన్యానికి చేరువే అయినా, అది ఆత్మానుభవానికి పనికి రాదు. ఆత్మజ్ఞా
మేల్కొన్న స్థితిలోనే సాధ్యం, దానికి అవసరమైన ప్రయత్నం కూడ అప్పుడే చేయగల

## గాఢ నిద్రలోని ప్రశాంతికీ జాగ్రదవస్థలోని అలజడికీ వ్యత్యాసమం ఆలోచన వల్లే

చైతన్యమే అధిష్టానమైనా నిద్రలో అనుభవమయ్యే ప్రశాంతికీ, జాగ్రదవస్థలో దా లేమికీ కారణం, నిద్రలో మనస్సు లేకపోవడమూ, మేల్కొని ఉన్నప్పుడు అ ఉండటమూను. మనస్సొక ఆలోచనల మూట, దానికి 'నేను-ఆలోచన' అంటే 'నే దేహాన్ని' అనే ఆలోచన మూలం. అందువల్ల మేల్కొని ఉన్నప్పుడు కూడా ఆలోచనారహితంగా ఉండగలిగితే నిద్రలోని ప్రశాంతినే అనుభవిస్తాం. అప్పుడు మనకి ఎరుకా ఉంటుంది, నిద్రావస్థలోని ప్రశాంతీ ఉంటుంది (2.14).

## పరిపూర్ణమైన ఎరుకా, పరిపూర్ణమైన మౌనమూ కలిసి ఉంటాయి జ్ఞానిలో

ఆలోచనారహితంగా ఎరుకలో ఉండటానికి ప్రయత్నమవసరం. ప్రస్తుతం మన చైతన్యం అజ్ఞానంలో, ఆలోచనలతో, వస్తుజాలంతో కలిసిపోయి ఉంది. నిత్యం వీటి నుండి దానిని వేరు పరచాలి. అప్పుడు 'తాను'గా నిలచి ఇతరమైన వాటిలో కలిసిపోయే అలవాటుని ఛేదించగలుగుతాం. ఇది జాగ్రదావస్థలోనే సాధ్యమవుతుంది. ఆత్మ విచారణ వల్ల ఆలోచనా రహిత నిశ్చల స్థితికి చేరితే పరిపూర్ణమైన ఎరుక, గాఢ నిద్రలోని నిశ్చలతతో కలిసి అనుభవసిద్ధమవుతుంది. అదే జ్ఞాని స్థితి. అది నిద్రాకాదు, మెలకువా కాదు, రెంటికీ మధ్యది. రెండు ఆలోచనల నడుమ గల వ్యవధి కూడా అదే. దానిని జాగ్రత్ - సుషుప్తి అంటారు. అది నిద్రకి అతీతం. మెలకువకీ అతీతం. ఆలోచనలుదయించే మూలం అదే. నిద్ర నుండి మేల్కొంటున్నప్పుడు మనం దానినే అనుభవిస్తాం. అంటే, నిద్రలోని నిశ్చలత నుండే ఆలోచనలు లేస్తాయన్నమాట. ఆ

ఆలోచన మూలానికి వెళ్తే నిద్రలోని ప్రశాంతిని చేరుకుంటాం. దానిని తీవ్రమైన అన్వేషణ ద్వారా చేరుతాం, అంటే పరిపూర్ణమైన ఎరుకతో, అదే జాగ్రత్-సుషుప్తి. అది బుద్ధిమాంద్యం కాదు. అది ఆనందం. అది క్షణికం కాదు. నిత్యం. అక్కడ్నుండే ఆలోచనలు ఉద్భవిస్తాయి. మన అనుభవాలన్నీ కేవలం ఆలోచనలే (2.14).

## ఆత్మాన్వేషణని బుద్ధి ఆటంకపరచగలదు

'నేను' అని మనమన్నప్పుడు సాధారణంగా మనం పరిమితమైన 'నేను' నే ఉద్దేశిస్తాం- ఇది దేహసంబంధి, దేహమే నేననుకుంటుంది. గాఢ నిద్రలో సంతోషభరితమైన 'తాను' ని కూడా నేనేనంటుంది. మెలకువలోని 'నేను' ఎట్లా వచ్చింది? నిద్రలోని "తాను" కి మేల్కొని ఉన్న 'నేను'కీ వ్యత్యాసమెట్లా వచ్చింది? వీటిని కనుగొనమంటారు శ్రీభగవాన్. ఈ అన్వేషణకి బుద్ధి ఎందుకూ పనికి రాదు. అసలు ఈ బుద్ధే దుః ఖానికీ, సందేహాలకీ, ప్రశ్నలకీ మూలకారణం. అది అణగిపోవాలి. ఆత్మ విచారణలో ఎగసే ప్రతి ఆలోచన పట్ల అవధానాన్ని ఉపసంహరిస్తూండాలి. దృష్టి 'నేను' అనే ఎరుకపైకి మళ్లించాలి.

శ్రీభగవాన్ ఇట్లా సెలవిచ్చారు: "తెలియని వాటిని తెలిసికోవడానికి బుద్ధి ఒక సాధనం. కాని, ఆత్మే జ్ఞానం. అది నీ వెరిగినదే, అందువల్ల 'నీవు' తెలిసికోవలసిన వస్తువువి కావు. బయటివాటిని చూచేట్టు చేస్తుందేగాని బుద్ధి, తన మూలం గురించి తెలుసుకోవడానికి పనికిరాదు. ఆ మేరకే బుద్ధి ఉపయోగిస్తుంది. నిన్ను నీవు విశ్లేషించుకోవడానికి పనికి వస్తుంది. అంతకుమించి ఏమీ కాదు" (2.17)

## ఆలోచనారహిత స్థితి ఎక్కువౌతూండటమే పురోగతికి నిదర్శనం

ఆత్మ సాక్షాత్కారానికే చేసే ప్రయత్నంలో, ఆలోచనలు లేని స్థితి ఎక్కువౌతున్న కొద్దీ పురోగమిస్తున్నట్లే అంటారు శ్రీభగవాన్ (2.17). ఆత్మసాక్షాత్కారం ఎప్పుడూ ఒకటే కాబట్టి, అందులో పురోగతి అంటూ ఏమీ లేదు. ఆత్మ ఎప్పుడూ సాక్షాత్కారమయ్యే

ఉంది. దానికి అడ్డంకులు ఆలోచనలే. ఆత్మ ఎప్పుడూ సాక్షాత్కారమయే ఉంద తెలుసుకోవడానికి గల అవరోధాలని తొలగించుకోవడంలోనే పురోభివృద్ధి అంతా ఉంది. అందువల్ల ఆలోచనలు ఎవరికి వస్తున్నాయని ప్రశ్నిస్తూ వాటిని నిరోధించాలి అల్లా వాటి మూలానికి వెళ్లాలి– వెళ్తే అక్కడ అవి ఉండవు. 'నేనున్నాను' అని అందరూ ఒప్పుకునేదే, అదే ఆత్మ, అదే సాక్షాత్కారం (2.16). సాక్షాత్కారమయ్యే వరకూ దీని పట్టుకొని ఉండటమే విచారణ. అంటే, విచారణ, ఆత్మ సాక్షాత్కారమూ ఒకటే. విచారణే పద్ధతీ, గమ్యమూ కూడా. 'నేనున్నాను' అనేదే గమ్యం. అదే సద్వస్తువు. దాని ప్రయత్నపూర్వకంగా పట్టుకొని ఉండటమే విచారణ. ఆ స్థితి సహజమై స్వాభావికమైనప్పుడు అది సాక్షాత్కారం (మూడవ విభాగంలో ప్రపత్తి, విచారణ గురించి చూడండి).

## సాక్షాత్కారమైన స్థితి

శ్రీభగవాన్ ఇట్లా అంటారు : శుద్ధమైన "నేనుని పట్టుకొని, గాఢ నిద్రలోని 'తాను' ను అందుకోవాలన్న లక్ష్యముండాలి. ఈ ప్రయత్నంలో వృత్తి ఉంటుంది.

ఏ ప్రయత్నమూ లేకుండా 'తాను' అనుభవసిద్ధమయ్యే వరకూ ఆ కృషి అవసరమే. వృత్తి అనేది మనస్సుకి సంబంధించినది. ఇతర ఆలోచనల నుండి 'వృత్తుల' నుండి, ఉపసంహరించి, 'అహం'మీద నిలకడ చెందాలి. ప్రస్తుత స్థితిలో ఇది కూడా ఒక వృత్తే– అంటే, ఏ ప్రయత్నమూ అవసరం లేని స్థితిని చేరుకునే దాకా. ఏ ప్రయత్నమూ లేకుండా కలిగే ఆత్మానుభూతినే ఆత్మసాక్షాత్కారమంటారు. ఆత్మ సాక్షాత్కారానికి బుద్ధి అవరోధమని ముందు అనుకొన్నా, ఆ స్థితిని చేరుకోవడానికి సాధనం కూడా అదే.

శుద్ధమైన 'నేను'ని పట్టుకొని ఉండటమే సాధన. అంతవరకే మన ప్రయత్నం వెళ్లగలదు. ఆత్మ విచారణ లక్ష్యమిది. 'నేను'ని బాహ్య వస్తుజాలం నుండి విడదీసి, దానిని పట్టుకొని ఉండటమే. సంస్కారాలు పోనంత కాలమూ 'నేను' అనేది బాహ్య వస్తుజాలం

వైపు వెళ్తూనే ఉంటుంది. అట్లా మిగిలిన వాటివైపు వెళ్లేంతకాలమూ ఆత్మ విచారణ చేస్తూండాల్సిందే. చిత్–జడములకి మధ్యగల ముడి పూర్తిగా విచ్ఛిన్నమయ్యే వరకూ ఆత్మ విచారణ కొనసాగాలి. సంస్కారాలు నశిస్తే 'నేను' తన మూలంలో ఇంకిపోతుంది. అదే పరమాత్మ. మనస్సు నశించడం వల్ల 'నేను' అనేది బాహ్య వస్తుజాలంతో సంబంధం పెట్టుకోదు. ఇది అంతిమ విముక్తి- ఇదే సాక్షాత్కారం.

పైన చెప్పబడిన విషయాలకి సంబంధించిన శ్రీభగవాన్ భాషణలు తరువాతి భాగంలో ఉన్నాయి.

# ఆత్మ, సాక్షాత్కారము

## కొన్ని సంభాషణలు

ఈ భాగములో 'ఆత్మ, సాక్షాత్కారము' అను అంశము 'శ్రీరమణమహర్షి సంభాషణములు' నుండి గ్రహించిన సంభాషణలతో విశదీకరింపబడింది.

### 2.01 స్వయం విదితమైన ఎరుకయే ప్రత్యక్షమూ, శాశ్వతమూ (స.92)

**మ:** ఇంద్రియాల ప్రమేయము లేకుండా నిత్యమూ అనుభవంలో వుండే ఆత్మ కన్న అతి స్పష్టమైన అనుభవమేదైనా వున్నదా? ఇంద్రియ జ్ఞానాలు పరోక్షమేగాని ప్రత్యక్షము కావు. **ప్రతివానికీ తన ఎరుకయే ప్రత్యక్షానుభవము.** ఇదే అందరి సామాన్యానుభవం గూడా. **తన ఆత్మగా వుండటానికి, అంటే ఎరుకతో వుండటానికి ఏ సహాయము అవసరం లేదు.** (2.15 గూడ చూడ వలెను)

కుమారి ఉమాదేవి ఒక పోలిష్ వనిత. ఆమె హిందూమతాన్ని స్వీకరించింది. ఆమె భగవాన్‌ను ఇలా అడిగింది : ఇంచుమించు నేను హిందూమతంలో చేరిన సమయంలో నాకు శివదర్శనం ఎలా అయిందో లోగడ భగవాన్ సన్నిధిలో చెప్పియున్నాను. అట్టి అనుభవమే నాకు మరల ఒకసారి కుర్తాళంలో కలిగింది. ఈ దృశ్యములు తాత్కాలికమైనవే. కాని అవి ఆనందప్రదములుగా ఉన్నాయి. వానిని శాశ్వతమయినవిగా నిరంతరం ఉండేవిగా ఎలా చేసుకోవచ్చునో తెలుసుకోగోరుతున్నాను. శివుడు లేకుండా, నా చుట్టూ నేను చూచే దానిలో జీవము లేదు. ఆ శివుణ్ణి స్మరించటంలో నాకెంతో ఆనందం లభిస్తోంది. ఆయన దర్శనం నాకు శాశ్వతంగా ఉండేలాగా ఏం చేయాలో దయజేసి చెప్పండి. (స.450)

మ: నీవు శివదర్శనాన్ని గురించి మాట్లాడుతున్నావు. దర్శనము అనేది ఎప్పుడూ
ఒక విషయమునకు సంబంధించినదై ఉంటుంది. దానికి ఒక ద్రష్ట ఉండాలి.
కంటికి శివుడు ప్రత్యక్షము కావాలంటే, చూచే కన్ను ఉండాలి. ఆ చూపుకు వెనుక
బుద్ధి ఉండాలి. బుద్ధికి, దృష్టికి వెనుక ద్రష్ట ఉండాలి. **చివరకు ఆ ద్రష్టకు**
**ఆధారముగా చైతన్యము ఉండాలి.** ఈ ప్రత్యక్షము మనిషి ఊహించుకున్నంత
సత్యము ఏమీ కాదు. ఎందుకంటే అది సన్నిహితము, అంతర్గతము అయినట్టిదికాదు.
అది సాక్షాద్దర్శనము కాదు. అది క్రమానుగత చైతన్యదశా పరిణామము. **వీనిలో**
**మారకుండా ఉండేది చైతన్యమొక్కటే. అది శాశ్వతము, అదే శివుడు,** అదే ఆత్మ.
ప్రత్యక్షము అయినదని చెప్పిన దృశ్యము తనకు ఒక ద్రష్ట ఉండాలని తెలుపుతూనే
ఉంది. ద్రష్టగా ఉన్నవాడు ఆత్మయొక్క ఉనికిని నిరాకరించలేదు. **ఆత్మ, చైతన్యముగా**
**ఉండని క్షణమే లేదు. ద్రష్ట కూడ చైతన్యభిన్నముగా ఉండజాలదు. ఈ చైతన్యము**
**శాశ్వతమయిన సత్త్వము, కేవలమైన సత్‌స్థితి.** ద్రష్ట తనను తాను చూడలేదు.
తన్నుతాను తన కళ్లతో ప్రత్యక్షముగా చూడలేడు కనుక తన ఉనికిని తాను
నిరాకరిస్తాడా? నిరాకరించలేడు. కాబట్టి ప్రత్యక్షము **అంటే చూచుట కాదు,**
**ఉండుట. ఉండుట అంటే సాక్షాత్కారము పొందటమే. కనుక "నేను ఆ**
**నేనుఉన్నాను". "నేనున్నాను" అన్నదే శివుడు.** శివుడు లేకుండా మరేదియు
ఉండజాలదు. ప్రతి వస్తువు యొక్క ఉనికి శివునిలో ఉన్నది, శివుని వలన ఉన్నది.
**అందుచేత "నేనెవడను?" అని విచారించు, లోతుగా లోన మునిగి, ఆత్మగా**
**నిలిచి ఉండు.** అదే సద్రూపమయిన శివుడు. శివదర్శనములు మరల మరల
కలగాలని ఎదురు చూడవద్దు. నీవు చూచే విషయములకూ, శివునికీ మధ్య
ఉండే వ్యత్యాసము ఏమిటి? విషయి, విషయము - రెండూ శివుడే. శివుడు
లేకుండా నీకు ఉనికి లేదు. శివుడు ఇప్పుడే ఇక్కడే ఎప్పుడూ సాక్షాత్కారమయ్యే
ఉన్నాడు. నీకు ఆయన సాక్షాత్కారము కాలేదని నీవు భావిస్తే అది తప్పు.
శివసాక్షాత్కారానికి అదే పెద్ద ఆటంకము. అట్టి తలపును త్యజించు, అదిగో అక్కడే
సాక్షాత్కారము సిద్ధమై ఉన్నది.

శ్రీ భగవాన్ ఇంకా ఇలా అన్నారు : చైతన్యము లేని వ్యక్తి ఎవ్వడూ లేడు. అతడే శివుడు కాని వాడే లేడు. అంతేకాదు, అతడు శివుడు మాత్రమే కాదు, శి... ఎరిగినది, ఎరుగనిది - అంతా అతడే. కాని అతడు తాను జగత్తును నా... రూపములలో చూచుచున్నట్లు భావిస్తున్నాడు. ఇది వట్టి అజ్ఞానము. అతడు త... తాను చూస్తే (తన ఆత్మను చూస్తే) జగత్తు కంటె తాను వేఱు అనే తలపు అతని... రాదు. అతని వ్యష్టితత్త్వమూ, తదితర తత్త్వములూ, తమ సకల రూపములతో అట్లేనిలిచి ఉన్నప్పటికీ, అవి అన్నీ అదృశ్యమయి పోతాయి. శివుడు జగత్తుగా కన్పిస్తాడు. కాని ద్రష్టగా ఉన్నవాడు పూర్వరంగముగా ఉన్నదానిని చూడడు. గుడ్డను మాత్రమే చూస్తూ ఆ గుడ్డ దేనితో చేశారో ఆ ప్రత్తిని చూడనట్టి మనిషిని గూర్చి ఆలోచించు. లేదా సినిమా ప్రదర్శనలో తెరమీద ఆడే బొమ్మలే చూస్తూ, ఆ బొమ్మలకు ఆధారంగా ఉన్న తెరను చూడనట్టి మనిషిని గూర్చి ఆలోచించు. లేదా కాగితము మీద వ్రాసిన అక్షరములను చదువుతూ, ఆ అక్షరములను దేని మీద వ్రాశారో ఆ కాగితమును చూడని వ్యక్తిని గూర్చి ఆలోచించు. కాబట్టి విషయములన్నీ చైతన్యముగాను, రూపములుగాను ఉన్నవి. కాని సాధారణ వ్యక్తి జగద్విషయములను చూస్తాడు, కాని ఆ విషయములలో శివుణ్ణి చూడడు. **శివుడంటే ఈ రూపములన్నింటినీ ధరించిన సద్రూపము, మరియు వానిని చూచే చిద్రూపము.** అంటే, విషయి, విషయములు రెండింటికీ అధిష్ఠానముగా ఉన్నది శివుడే. అలాగే, స్వరూపముగా ఉన్న శివుడు, వర్తించే శివుడు, శక్తి లేక ఈశ్వరుడు, జగత్తు అన్నీ ఆ శివుడే. **ఉన్నది అని చెప్పబడేదంతా చైతన్యమే, అది స్వరూపముగా ఉన్నా, వ్యాపారముగా ఉన్నా. చైతన్యము లేని వాడు ఎవడైనా ఉన్నాడా? అలాగే సాక్షాత్కారము లేని వాడు ఎవడైనా ఉన్నాడా?** అట్టి యెడల, సాక్షాత్కారము ఉన్నదా లేదా అనే సందేహము లేక సాక్షాత్కారము కావాలి అనే కోరిక, వీనిని గురించిన ప్రశ్నలు ఎలా తలెత్తుతాయి? 'నేను' నాకు ప్రత్యక్షమై ఉండక పోతే, అప్పుడు శివుడు నాకు ప్రత్యక్షమై లేడు అని చెప్పగలను. **ఈ ప్రశ్నలన్నీ ఎందుకు పుదుతున్నాయి? ఒకటే కారణము. నీవు ఆతను నీ ...**

వేశావు. అప్పుడే ఇట్టి భావములు అన్నీ ఆవిర్భవిస్తుంటాయి. లోపల అనీ, బయట అనీ, విషయి అనీ, విషయము అనీ నానా రకములయిన తలపులు లేస్తున్నాయి.

విషయ రూపాలయిన దృశ్యాలకు సహజమైన విలువ ఏమీ లేదు. అవి శాశ్వతమైనవిగా వున్నా వ్యక్తిని తృప్తిపరచలేవు. ఉమ ఎల్లప్పుడూ శివుని కూడియే ఉన్నది. ఇద్దరూ కలసి అర్ధనారీశ్వరులుగా రూపొందారు. అయినా ఆమె శివుని నిజస్వభావాన్ని తెలుసుకోదలచింది. తపస్సు చేసింది. తన ధ్యానంలో ఒక ఉజ్వలమైన జ్యోతిని దర్శించింది. ఇది నా దృష్టి పరిధిలో వున్నది గనుక శివుడు కాజాలడు. నేను దీనికంటే అధికురాలను అని తలచింది. మళ్ళీ తపస్సు కొనసాగించింది. ఆలోచనలు అదృశ్యమయ్యాయి. నిశ్చలత వ్యాపించింది. అప్పుడు, ఆమె కేవల ఉనికియే శివుని నిజస్వభావమని అనుభవానికి తెచ్చుకుంది.

## 2.02 ఎఱుకయే నీ స్వరూపము

భ: ధ్యానము చెయ్యటానికి ఏదయినా స్థూలమయినది అవసరం. 'నేను' ని ధ్యానించడం ఎట్లా? (స. 306)

మ: మనం రూపాలలో పాతుకుపోయి వున్నాము గనక ధ్యానం చెయ్యటానికి ఒక స్థూలరూపం అవసరమవుతోంది. మనం ధ్యానించేదే చివరకు మిగులుతుంది. నువ్వు ధ్యానం చేసేటప్పుడు మిగిలిన ఆలోచనలు అదృశ్యమవుతాయి. ఇతర ఆలోచనలు వున్నంతవరకు ధ్యానం అవసరముంది. నువ్వు ఎక్కడ వున్నావు? **నువ్వు వున్నావు గనుకనే ధ్యానంచేస్తున్నావు**, ఎందుకంటే ధ్యాతయే ధ్యానం చెయ్యాలి కదా! అతడు వున్న చోటే ధ్యానం సాగుతుంది. ధ్యానము ఇతర ఆలోచనలనన్నిటినీ నిరోధిస్తుంది. నీవు స్వయంగా మూలంలో విలీనమవ్వాలి. నిద్ర, మరణము, మూర్ఛ వంటి స్థితులలో అప్పుడప్పుడు మనకు తెలియకుండానే మనం మూలంలో విలీనమవుతాము. **ధ్యానం అంటే ఏమిటి? ఎరుకతో మూలంలో విలీనమవటమే.** అప్పుడు మూర్ఛ, మరణము మొదలయిన వాని భయం అదృశ్యమవుతుంది; ఏలనంటే, ఎరుకతో మూలంలో

విలీన మవ్వగలిగావు గనుక.

మరణమంటే భయపడట మెందుకు? మరణమంటే వునికి లేకపోవడమని అర్థంకాదు. నీకు నిద్ర అంటే ప్రేమ వుండి, మరణమంటే ఎందుకులేదు? నీవు ఇప్పుడు ఆలోచించడము లేదా? ఇప్పుడు నీకు వునికి లేదా? నిద్రలో నీవు వుండలేదా? చిన్న బిడ్డకూడా బాగా, సుఖంగా నిద్రపోయినట్లు చెబుతుంది. తనకు తెలియక పోయినా, చిన్నబిడ్డ కూడా నిద్రలో తన వునికిని ఒప్పుకుంటుంది. **కాబట్టి ఎరుక మన నిజ స్వభావము, మనం ఎరుకలేకుండా వుండలేము. అయినప్పటికీ, మనము మెలకువలో పరిమిత చైతన్యానికి అలవాటుపడ్డాము గనుక నిద్రలో చైతన్యరహితంగా వున్నామని చెబుతాం. ఈ ప్రపంచమూ, శరీరమూ మొదలయినవి ఎంత గట్టిగా పాతుకునిపోయి వున్నాయంటే, మెలకువలోని సాపేక్ష చైతన్యమే ఆత్మ అని పొరపడతాం.** ఎవరైనా నిద్రలో తనకి ఎరుకలేదని అంటున్నాడా? ఇప్పుడు అట్లా అంటున్నాడు. ఇది ఇంద్రియ జ్ఞానం వల్ల కలుగుతున్న చైతన్యస్థితి. అందువలన అతడు సాపేక్ష చైతన్య స్థితి గురించే మాట్లాడుతాడేగానీ, శుద్ధ చైతన్యం గురించి మాట్లాడడు. చైతన్యము ఇంద్రియ జ్ఞానానికీ, అజ్ఞానానికీ అతీతమయినది.

శ్రీ లోమన్ అనే ఆస్ట్రేలియన్ సజ్జనుడు భగవాన్ దర్శనార్థమై వచ్చాడు. అతడు హిందూ తత్త్వశాస్త్రమును చదువుతున్నట్లు కన్పించాడు. 'నేను ఏకత్వమును నమ్ముతున్నాను, జీవుడు ఇంకా మాయలోనే ఉన్నాడు, ఇత్యాదిగా అతడు చెప్పసాగాడు. **(స.520)**

***మ:*** నీవు విశ్వసిస్తున్న ఆ ఏకత్వము ఏమిటి? దానిలో జీవుడికి చోటు ఎలా కల్పించబడుతుంది?

***భ:*** ఏకత్వము అంటే బ్రహ్మమే.

***మ:*** అట్టి ఏకత్వములో జీవునికి స్థానము ఉండదు.

భ: కాని జీవునికి బ్రహ్మానుభవము సిద్ధించలేదు. అతడు తాను వేరు అని ఊహించుకొంటున్నాడు.

మ: దేనిని అయినా ఊహించవలయునంటే, అది ఉండి తీరాలి. అనగా జీవుడు వేరుగా ఉన్నాడన్న మాట.

భ: కాని అతడు మిథ్య.

మ: మిథ్య అయినది ఏదీ ఎట్టి కార్యమును సాధించలేదు. ఉదాహరణకు కుందేటి కొమ్ముతో ఒక జంతువును చంపుట సాధ్యపడదు. ఎందుకంటే కుందేలుకు కొమ్ములు మొలవవు.

భ: నేను చెప్పింది అసంగతమే, కాని నేను భౌతిక స్థాయిలో మాట్లాడుతున్నాను.

మ: నీవు 'నేను' అంటున్నావు కదా! ఆ 'నేను' ఎవరు? దానిని కనుగొంటే, ఆ తరువాత మాయ అనేది ఎవరికో నీవు చెప్పవచ్చు.

కొంచెము సేపు అయిన తరువాత భగవాన్ మరల ఇట్లు అన్నారు :

ఇప్పుడు నీవు భౌతికస్థాయిలో ఉన్నానని చెప్పావు. సుషుప్తిలో నీవు ఏ స్థాయిలో ఉన్నావు?

భ: అదే భౌతికస్థాయిలో అని అనుకుంటున్నాను.

మ: అనుకుంటున్నాను' అని చెబుతున్నావు కదా! అంటే నీవు ఇప్పుడు, అనగా మేల్కొని ఉన్నప్పుడు, ఆ మాట చెబుతున్నావు. ఏమైనా, నీవు సుషుప్తిలో ఉన్నట్లు అంగీకరిస్తున్నావు కదా?

భ: అంగీకరిస్తున్నాను. కాని అప్పుడు నేను ఏ పనీ చేయకుండా ఉన్నాను.

మ: అయితే సుషుప్తిలో నీవు ఉన్నావు. సుషుప్తిలో ఉన్నట్టి వాడవే ఇప్పుడు కూడా ఉన్నావు. లేక అలా లేవా?

భ: అవును. నేను ఉన్నాను.

మ: నీవు ఉన్నావు. కాని ఒక భేదము ఉన్నది. నీ నిద్రలో నీవు ఏ [illegible] నీ జాగ్రదవస్థలో నీవు మనస్సుతో కూడి ఉన్నావు. సుషుప్తిలో మనస్సు [illegible] ఉన్నావు. అవును కదా!

భ: అవును

మ: **అయితే నీ నిజ స్వరూపము ఏమిటి? మనస్సుతో (తలపులతో) [illegible] ఉండటమా, మనస్సును వీడి ఉండటమా?**

భ: నాకు ఇప్పుడు అవగతమవుతున్నది. కాని సుషుప్తిలో నా ఉనికిని నేను ఎరుగ[illegible]

మ: ఆ విషయము నీవు ఇప్పుడు చెబుతున్నావు. నిద్రలో నీవు ఆ మాట చెప్ప[illegible] పోనీ నిద్రలో నీవు లేవని చెబుతావా? నీ ఉనికినే నిరాకరిస్తావా?

భ: అనను.

మ: అంటే దాని అర్థము ఇది : నీవు రెండు అవస్థలలోను ఉన్నావు. శుద్ధ **సత్‌స్థితియే, అనగా కేవలమైన ఉనికియే ఆత్మ. ఆ ఉనికి యొక్క ఎరుక కూడ నీకు ఉన్నది. అనగా, ఉనికి ఎరుకకూడా అయి ఉన్నది. సత్తే చిత్తు. అదే నీ స్వరూపము.**

భ: సాక్షాత్కారమునకు కూడ తలపు అవసరమే.

మ: ఆ తలపు ఇతరములయిన తలపులన్నింటినీ త్రోసి వేసేందుకు ఉద్దేశింపబడింది.

భ: నా అజ్ఞానము కారణముగా, నేను ఆ అఖండ సచ్చైతన్యమును సాక్షాత్కరించు కోలేక పోతున్నాను.

మ: ఆ "నేను" ఎవరు? అజ్ఞానము ఎవరికి? నీకు సాక్షాత్కారము అయ్యే ఉన్నదని ఋజువు పర్చేందుకు ఈ ప్రశ్నలకు చెప్పే జవాబులు చాలు. **తన యొక్క ఉనికిని**

నిరాకరించేవాడు ఎవడైనా ఉన్నాడా? పోనీ, తాను సుషుప్తిలో లేడని ఎవ్వడైనా చెప్పగలడా? **ఆ విధముగా శుద్ధసత్ స్థితి అంగీకరింపబడింది. ఆ అంగీకారమే చైతన్యము ఉన్నట్లు ఋజువుకూడా.** ఆ విధముగా మనుషులందరూ ఆత్మసాక్షాత్కారము పొందియున్నవారే. అజ్ఞాని అయిన మనిషి లేనేలేడు.

**భ:** అవును. నాకు అర్థమవుతున్నది. నాదొక చిన్న ప్రశ్న ఉన్నది. సాక్షాత్కారస్థితి అంటే ఏ కోరికలూ లేని స్థితి. ఒక మనిషికి కోరికలు అంటూ ఏవీ లేక పోతే, అతడు మనిషి కాదు.

**మ:** నిద్రలో నీ ఉనికిని నీవు అంగీకరిస్తున్నావు. అప్పుడు నీవు ఏ పనీ చేయకుండా ఉన్నావు. **ఆ దశలో ఏ స్థూలదేహమూ నీకు తెలియదు. ఈ శరీరముతో నిన్ను నీవు పరిమితము కావించుకోలేదు. అందుచేత నీ ఆత్మకు భిన్నముగా నీవు దేనినీ చూడలేక పోయినావు.** ఇప్పుడు నీ ఈ జాగ్రదవస్థలో కూడ నీవు ఆ ఉనికివే (సద్రూపుడవే) అయి ఉన్నావు; కాకపోతే శరీరము యొక్క పరిమితులు దానికి జత పడ్డాయి. ఈ పరిమితుల వలన నీకు ఇతర విషయములు గోచరిస్తున్నాయి. అందుచేత వీనికై కోరిక పుడుతున్నది. కాని **సుషుప్తిలోని వాంఛారహిత స్థితి ఇప్పటికన్నా నీ ఆనందాన్ని తక్కువ చేయలేదు. అక్కడ నీకు ఏ కోరిక (లేమి) లేదు. కోరికలను కలిగియుండక పోవటం వల్ల నీవేమీ దుఃఖితుడవు కాలేదు.** కాని ఇప్పుడు నీవు ఈ మానవ శరీరమునకు పరిమితుడవై ఉన్న కారణంగా, నీవు కోరికలకు చోటుయిస్తున్నావు. నీవు ఈ పరిమితులను నిలిపి ఉంచుకోవటం ఎందుకు, కోరికలకు చోటు యివ్వటం ఎందుకు?

శ్రీ భగవాన్ తమ బోధను కొనసాగించారు : శరీరము, 'ఇదిగో నేను ఇక్కడ ఉన్నాను' అని నీతో వచ్చి చెబుతున్నదా? శరీరము కంటె వేరు అయిన ఒకానొకటి ఏదో ఎరుకను కలిగి ఉన్నది. అది ఏమిటి? అది మనిషి నిద్ర నుండి మేల్కొనగానే, పైకెగసే 'నేను' అని, అనగా అహంత అని చెబుతావా? అది అలా ఉంచు. శరీరము చేతనము కాదు. బ్రహ్మము మాట్లాడదు. అహంతయే మాట్లాడుతుంది.

సుషుప్తిలో ఉన్న వ్యక్తికి మోక్షేచ్ఛ ఉండదు. అది జాగ్రదవస్థలోనే కలుగుతాయి. జాగ్రదవస్థలోని వ్యాపారములు అహంతవ్యాపారములే. ఆ అహంత 'నేను' కు అభిన్నము. ఈ 'నేను' ఎవరో కనుక్కో అలా చేసి, 'నేను'గా నిలిచియుంటే, ఈ సంశయములన్నీ తీరుతాయి.

## 2.03 కేవల సత్ స్థితియే శుద్ధాత్మ (స.280)

**భ:** మాయను వదలించుకొనేందుకు మీరు నాకు సాయపడగలరా?

**మ:** అసలు మాయ అంటే ఏమిటి?

**భ:** జగత్తు పట్ల ఉండే రక్తి.

**మ:** గాఢ నిద్రలో నీకు జగత్తు ఉన్నదా? అప్పుడు దాని పట్ల ఆసక్తి ఉన్నదా?

**భ:** లేదు.

**మ:** అక్కడ నీవు ఉంటివా లేదా?

**భ:** ఉండి ఉండవచ్చు.

**మ:** అయితే నిద్రలో నీ ఉనికిని నిరాకరిస్తావా?

**భ:** అనను.

**మ:** అయితే 'నిద్రలో ఉన్న అదే వ్యక్తి'వి నీవు అన్న మాట.

**భ:** అవును.

| నిద్ర | మెలకువ |
| --- | --- |
| జగత్తు లేదు | జగత్తు ఉన్నది |
| ఆసక్తి లేదు | ఆసక్తి ఉన్నది |
| ఆత్మ ఉన్నది | ఆత్మ ఉన్నది |

మ: మరి యిప్పుడు మాయను గూర్చి ప్రశ్నించింది ఎవరు?

భ: నిద్రలో మనస్సులేదు. జగత్తు, దాని పట్ల అనురక్తి మనస్సుకు సంబంధించినట్టివి.

మ: అదీ విషయము. జగత్తూ, ఆ జగత్తు పట్ల ఉన్న ఆసక్తీ మనస్సుకు సంబంధించినట్టివి.

భ: నిద్రలో నేను అజ్ఞానముతో ఉన్నాను.

మ: 'నేను అజ్ఞానిగా ఉన్నాను', అని చెప్పేది ఎవరు? అతడు ఇప్పుడు కూడా అజ్ఞానముతో లేడా? లేక అతడు జ్ఞానియా? కలుషితాత్మ ఇప్పుడు అజ్ఞానమును గూర్చి పేర్కొంటున్నది.

భ: అయితే ఆత్మ నిద్రలో శుద్ధమైనదిగా ఉన్నదా?

మ: అది ఎట్టి సందేహాలనూ లేవనెత్తలేదు. అది తన్ను గురించి తాను అసంపూర్ణమనిగాని అపరిశుద్ధమని గాని తలపలేదు.

భ: అట్టి ఆత్మ అందరికీ సమానమే; శవములో కూడా అదే ఉన్నది.

మ: కాని నిద్రించే వాడు గాని, శవములో ఉన్నవాడు గాని ఏ ప్రశ్నలూ వేయడు. ప్రశ్నించేది ఎవరో చూడు. నీవే. నీవు నిద్రలో లేవా? ఆస్థితిలో అసంపూర్ణత ఎందుకు లేదు? శుద్ధాత్మ సత్తా మాత్రము. అది, జాగ్రత్తులో వలె, విషయములతో సంసర్గమును, జ్ఞానమును కలిగియుండదు. ఇప్పుడు నీవు జ్ఞానము అని చెప్పేది విషయ జ్ఞానము. దానికి మెదడు, మనస్సు, దేహము ఇత్యాదులు ఆధారముగా ఉండాలి. కాని నిద్రలో ఇవి యేవీ లేకుండానే జ్ఞానము (చైతన్యము) నిలిచి ఉంది.

భ: కాని నిద్రలోని నా జ్ఞానమును నేను ఎరుగను.

**మ:** ఎరుగనిది ఎవరు? 'నేను ఉన్నాను', అని నీవు అంగీకరిస్తున్నావు. 'నిద్రలో నేను ఉన్నాను', అని కూడా అంగీకరిస్తున్నావు. **ఆ సత్‌స్థితియే ఉనికి, నీ ఆత్మ**

**భ:** సుషుప్తియే ఆత్మ సాక్షాత్కారము అని మీరు చెప్పదల్చుకున్నారా?

**మ:** **అది ఆత్మ. సాక్షాత్కారమును గూర్చి ఎందుకు మాట్లాడటం?** ఆత్మ సాక్షాత్కారించకుండా ఉన్నట్టి క్షణము ఉన్నదా? అట్టి క్షణము ఏదైనా ఉంటే, అప్పుడు మరియొక క్షణము సాక్షాత్కారముతో కూడినది అని చెప్పవచ్చు. ఆత్మ లేని క్షణము గాని, ఆత్మ సాక్షాత్కారమై లేని క్షణముగాని లేదు. దాని కొరకు సుషుప్తినే ఎంచుకొననక్కరలేదు. ఇప్పుడు కూడా నీకు సాక్షాత్కారము అయ్యే ఉంది.

**భ:** కాని నాకు అర్థము కావటం లేదు.

**మ:** ఎందుకంటే, నీవు ఆత్మవై ఉండి, దేహముతో తాదాత్మ్యం చెందుతున్నావు. ఈ మిథ్యా తాదాత్మ్యాన్ని త్యజించు. ఆత్మ నీకు ప్రత్యక్షమవుతుంది.

**భ:** కాని ఇది నా ప్రశ్నకు జవాబుగా లేదు. నేను మాయను వదలించుకొనేందుకు, అనగా (ప్రపంచముపై) అనురక్తిని వదలించుకొనేందుకు మీసాయమును అర్థించాను.

**మ:** **ఈ అనురక్తి నిద్రలో నీకు లేదు.** అది ఇప్పుడు తోచి, అనుభూతమవుతున్నది. అది నీ **యథార్థ తత్త్వము కాదు.** క్రొత్తగా వచ్చి కూడిన ఈ ఆసక్తి ఎవరికి? నీ నిజతత్త్వమును తెలుసుకొంటే, ఇట్టివి ఉండనే ఉండవు. నీ ఆత్మను సాక్షాత్కారింపజేసుకుంటే, ఈ భోగవస్తువు లేవీ ఉండవు. మాయను వదలించుకోవటం అంటే అది. **మాయ ఒక దృశ్య వస్తువు కాదు. అదే అయితే మరో రీతిగా దానిని వదలించుకోవచ్చును.**

## 2.04 ఆత్మ మార్పులేనిది (స.143)

**భ:** నేను వుంటిని, వున్నాను. కానీ, గాఢనిద్రలో వున్నదెవరో నాకు తెలియదు

మ: కచ్చితంగా. మేల్కొని వున్నవాడు గాఢ నిద్ర స్థితిలో తనకు ఏమీ తెలియలేదని అంటాడు. ఇప్పుడు విషయములని చూస్తూ తాను వున్నానని తెలుసుకొంటున్నాడు. కానీ గాఢనిద్రలో విషయాలూ, వాటిని చూసేవాడు ఇత్యాదులు లేవు. ఇప్పుడు మాట్లాడుతున్నవాడే గాఢ నిద్రలో కూడా వున్నాడు. ఈ రెండు స్థితులకీ మధ్య భేదమేమిటి? ఇప్పుడున్న విషయాలు, ఇంద్రియ వ్యాపారాలు నిద్రలో లేవు. ఈ మధ్య కాలంలో ఒక కొత్త తత్త్వము, అహంభావము ఆవిర్భవించి, శరీరంతో తాదాత్మ్యం చెంది, ఇంద్రియాలతో క్రీడిస్తూ, విషయాలను చూస్తూ, ఆత్మ అహంభావమేనని చెప్తోంది. నిజానికి గాఢనిద్రలో వున్నదే ఇప్పుడు కూడా కొనసాగుతోంది. ఆత్మ మార్పులేనిది. మధ్యలోవచ్చినది అహంభావమే. ఉదయించి, అస్తమించేది అహంభావము, మార్పులేకుండా వుండేది ఆత్మ.

## 2.05 నీ ఉనికి-ఎరుకయే ప్రతి దానికీ అస్తిత్వమును ప్రసాదిస్తున్నది (స.609)

భ: మనము ఈ జగత్తునూ, అందులోని జనులనూ ఎలా నిరాకరించగలము? నేను ఏదో సంగీతమును వింటాను. అది మధురముగా, గొప్పగా ఉంది. అది వేనర్ సంగీతము అని నేను గుర్తిస్తాను. అది నాది అని నేను చెప్పుకోలేను.

మ: వేనర్ గాని, అతని సంగీతముగాని నీకు భిన్నముగా ఉన్నాయా? అది వేనర్ సంగీతమని గుర్తించి, చెప్పే నీవు అక్కడ లేకపోతే, నీవు దానిని ఎరుగగలవా? దాని యొక్క ఎరుక నీకు లేకుండా, అది ఉన్నది అని చెప్పటానికి వీలుంటుందా? ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, వేనర్ సంగీతాన్ని, నీవు సుషుప్తిలో ఉండగా గుర్తిస్తావా? అయినప్పటికీ, నిద్రలో నీవు ఉన్నట్లుగా అంగీకరిస్తున్నావు. అందుచేత ఒక విషయం స్పష్టమవుతున్నది. వేనర్, అతని సంగీతము – ఇవి అన్నీ నీ తలపులు. అవి నీలో ఉన్నాయి, నీకు వెలుపల లేవు.

భ: ఎంత అందమైన వివరణ!

## 2.06 అహంత లేస్తేనే జగత్తు గోచరిస్తుంది. (స.53)

శ్రీ నోల్స్ అనే యువకుడు దర్శనం కొరకు వచ్చాడు. అతడు పాల్ బ్రంటన్ గ్రంథాలు రెండు చదివాడు. అతడు ఇలా అడిగాడు : బౌద్ధులు 'నేను' అసత్యమని చెబుతారు, కాని పాల్ బ్రంటన్, 'గుప్తమార్గము' అను తన గ్రంథములో 'నేను తలపును' అధిగమించి, 'నేను' యొక్క స్థితిని చేరుకోవాలని చెప్పాడు. ఏది సత్యము?

మ: రెండు 'నేను'లు ఉన్నట్లు భావిస్తారు; ఒకటి అధమము, అసత్యము. ఇది అందరకు తెలిసిందే. రెండవది ఉత్తమము, సత్యము. దీనిని సాక్షాత్కరింప జేసుకోవాలి.

నిద్రలో నిన్ను నీవు ఎరుగవు, మెలకువలోనే నీవు ఎరుగుదువు. మేల్కొన్న పిదప, నీవు నిద్రించినట్లు చెబుతావు. అందుచేత, నానాత్వభావము శరీర చైతన్యముతో బాటు ఆవిర్భవించింది. ఈ శరీరచైతన్యము ఒకానొక క్షణములో పైకి వచ్చింది. దానికి ఆది ఉన్నది, అంతమూ ఉన్నది. ఆరంభమైనట్టిది ఏదో ఒకటి అయి ఉండాలి. ఆ ఏదో ఒకటి ఏమిటి? అది 'నేను' చైతన్యము. నేనెవడు? నేను ఎక్కడి నుండి వచ్చాను? ఆ విధముగా దాని మూలమును కనుగొన్నప్పుడు, నీకు పరమచైతన్యసాక్షాత్కారమవుతుంది.

భ: ఈ 'నేను' ఎవడు? అది ఇంద్రియానుభవముయొక్క అనంతత్వముగా తోస్తున్నది. బౌద్ధులు చెప్పేది కూడా ఇదే అనిపిస్తున్నది.

మ: జగత్తు బాహ్యమున లేదు. ఇంద్రియానుభవములకు మూలము బాహ్యమున ఉండటానికి వీలులేదు. ఎందుకంటే, జగత్తును చైతన్యము మాత్రమే ఎరుగగలదు. జగత్తు తానున్నానని చెప్పటం లేదు. అది నీ అనుభవము. ఈ అనుభవము కూడా ఏకరీతిగా, అఖండముగా లేదు. సుషుప్తిలో ప్రపంచము గోచరించుట

**లేదు. కనుక అది నిద్రితునికి లేదు. అందుచేత, జగత్తు అహంతను అనుసరించి అంటే అహంత లేవటంవలనగోచరిస్తుంది. అహంత ఏమిటో కనుక్కో దాని మూలమును కనుక్కోవటమే అంతిమ లక్ష్యము.**

## 2.07 సూర్యుడు, చంద్రుడు నీవలన ప్రకాశిస్తున్నారు (స.420)

కడలూరు నుండి వచ్చిన ఒక న్యాయవాది ఈ క్రింది విషయం చెప్పారు : "అక్కడ సూర్యుడు వెలుగడు, చంద్రుడు వెలుగడు, నక్షత్రములు వెలుగవు, విద్యుత్తు వెలుగదు. ఇక అగ్ని ఎట్లు ప్రకాశిస్తుంది? ఈ తేజోమూర్తులన్నీ ఆయన వెలుగులోనే వెలుగును. ఆయన వెలుగుతో అవి అన్నియు ప్రకాశమానములగును?" **"ఆయన వెలుగుతో" అన్న దానికి ఇక్కడ అర్థమేమిటి? ఇతరమంతా ఆయన వలన వెలుగుతున్నదా? లేక ఆయన వెలుగులో ఇతరమంతా వెలుగుతున్నదా?**

మ: ఆయన ఒక్కడే ఉన్నాడు. ఆయన, ఆయన వెలుగు ఒక్కటే. **అన్య వస్తువులను చూచుటకు ఒక వ్యక్తి అక్కడ యెవ్వడును లేదు. ద్రష్ట, దృశ్యము - రెండూ ఆయనయే.** సూర్యుడు, చంద్రుడు ఇత్యాదులు ప్రకాశిస్తున్నారు. వారు వచ్చి తాము ప్రకాశిస్తున్నామని చెబుతున్నారా? లేక వారి కంటె అన్యమయిన వాడు వేరొకడు వారు ప్రకాశిస్తున్నట్లు చెబుతున్నాడా?

భ: వారు వెలుగుతున్నారని నేనే చెబుతున్నాను, నిజమే.

**మ: అందుచేత నీ వలన వారు వెలుగుతున్నారు. అంతేకాదు, వారు ప్రకాశిస్తున్నారని తెలియాలంటే, అది తెలిసికొనే చైతన్యము అవసరము. ఆ చైతన్యమే నీ ఆత్మ లేదా నీవు. అంటే నీవు, నీ చైతన్యము మరియు ఆయన, సమస్తమునూ ప్రకాశింపజేయు ఆయన వెలుగూ ఒకటే.**

భ: ఆ వెలుగు సూర్యకాంతి వంటిదా?

**మ:** కాదు. సూర్యకాంతి జడము. అది ఉన్నదని ఎరిగెడి వాడవు నీవు. ఆ కాం విషయములు కన్పించునట్లు చేస్తుంది, చీకటిని పోగొడుతుంది. కాని చైతన్యము (జ్ఞానము) అలా కాదు. అది వెలుగును గోచరింప జేస్తుంది; చీకటిని కూడా గోచరింపజేస్తుంది. చీకటి సూర్యకాంతి ముందు నిలిచి యుండలేదు. కాని, ఆ చీకటి చైతన్యపు కాంతిలో యుండగలదు. అదే విధంగా **ఈ చైతన్యము ఉన్న జ్ఞానము. దీనిలో జ్ఞానము, అజ్ఞానము - రెండూ భాసిస్తాయి.**

## 2.08 "నేను" శరీరము కాదు, మనస్సూ కాదు (స.487)

ఒక ఆంగ్లవనిత ముస్లిముల చీరకట్టుతో, ఇక్కడికి వచ్చింది. ఆమె ఉత్తర భారతదేశంలో ఉండి వచ్చినట్లు తెలుస్తోంది. అక్కడ డా॥.జి.హెచ్.మీస్‌ను కలుసుకున్నది. ఆమె ఇలా అడిగింది.

**భ:** ఆత్మసాక్షాత్కారము యొక్క ఉద్దేశ్యమేమి?

**మ:** ఆత్మసాక్షాత్కారము అంతిమ లక్ష్యము. అది స్వయం ఫలరూపము.

**భ:** నేను అడుగదలచుకొన్నది, ఆత్మసాక్షాత్కారానికి గల ప్రయోజనం ఏమిటి అని?

**మ:** ఆత్మ సాక్షాత్కారమును నీవు ఎందుకు కావాలని కోరుకోవటం? ఇప్పుడున్న స్థితితో తృప్తిపడి ఉండవచ్చును కదా? అంటే, ఇప్పుడున్న నీ స్థితి పట్ల అసంతృప్తితో నీవు ఉన్నట్లు స్పష్టమవుతున్నది. నీవు ఆత్మను తెలుసుకుంటే ఈ అసంతృప్తి అంతమవుతుంది.

**భ: అసంతృప్తిని అంతమొందించే ఆ ఆత్మ సాక్షాత్కారము ఏమిటి? నేను జగత్తులో ఉన్నాను. అందులో యుద్ధాలు ఉన్నాయి. ఆత్మసాక్షాత్కారము యుద్ధాలను అరికట్టకలదా?**

**మ:** నీవు జగత్తులో ఉన్నావా, లేక జగత్తు నీలో ఉన్నదా?

భ: నాకు అవగతం కాలేదు. ఈ జగత్తు అంతా నా చుట్టూ వ్యాపించి ఉన్నది, సందేహమేమున్నది.

మ: నీవు ప్రపంచాన్ని గురించి, దానిలో జరిగే సంఘటనలను గురించి చెబుతున్నావు. అవి అన్నీ నీలోని తలపులు. ఆ తలపులు మనస్సులో ఉన్నాయి. మనస్సు నీ లోపల ఉంది. అంటే ప్రపంచము నీలోనే ఉంది.

భ: మీరు చెబుతున్న దేమిటో నాకు తెలియుటలేదు. ప్రపంచాన్ని గురించి నేను ఆలోచింపకపోయినా, ప్రపంచము ఉండనే ఉంది.

మ: ప్రపంచము మనస్సు కంటె భిన్నముగా ఉన్నదనీ, మనస్సు లేకుండా అది ఉండగలదనీ చెప్పటం నీ ఉద్దేశ్యమా?

భ: అవును.

మ: ప్రపంచం నీ గాఢనిద్రలో ఉన్నదా?

భ: ఉన్నది.

మ: నిద్రలో నీవు దానిని చూస్తున్నావా?

భ: లేదు. నేను చూడటం లేదు. కాని ఇతరులు, మేల్కొని ఉన్నవారు, చూస్తున్నారు కదా.

మ: నిద్రించే సమయంలో నీకా విషయం తెలుసా? లేక వారికి తెలుసునన్న సంగతి నీకు మెలకువ వచ్చిన తరువాత, ఇప్పుడు తెలుస్తున్నదా?

భ: నాకు మెలకువ వచ్చినప్పుడే తెలుస్తున్నది.

మ: అయితే నీవు జాగ్రత్ జ్ఞానమును గురించి చెబుతున్నావు, నిద్రానుభవాన్ని గూర్చి కాదు. ప్రపంచము యొక్క ఉనికి జాగ్రత్ స్వప్న దశలలోనే అంగీకరింపబడుతున్నది; ఎందుకంటే అవి మనః కల్పితములు. సుషుప్తిలో మనస్సు

ఉపసంహరింపబడి ఉంటుంది. అప్పుడు జగత్తు బీజావస్థలో ఉంటుంది. నిద్ర మేల్కొనగానే అది మరల అభివ్యక్తమవుతుంది. అహంత పైకి ఉబికి వ్యష్టి దేహముతో తాదాత్మ్యము చెంది, జగత్తును చూస్తుంది. అందుచేత, జగత్తు మనః కల్పితము.

భ: అది ఎలా వీలు అవుతుంది?

మ: నీవు నీ స్వప్నములో స్వప్న జగత్తు నొకదానిని కల్పించుకోవటం లేదా? జాగ్రత్తు కూడా ఒక దీర్ఘ స్వప్నము. జాగ్రదనుభవానికీ, స్వప్నానుభవానికీ వెనుక ఒక ద్రష్ట ఉండాలి. ఆ ద్రష్ట ఎవరు? అది శరీరమా?

భ: శరీరము కాజాలదు.

మ: అయితే అది మనస్సా?

భ: మనస్సే అయి తీరాలి.

మ: కాని మనస్సు లేకపోయినా నీవు ఉన్నావు?

భ: ఎలా ?

మ: సుషుప్తిలో.

భ: నేను అప్పుడు ఉన్నానేమో నాకు తెలియదు.

మ: నీవు లేకపోయి ఉంటే, నిన్నటి అనుభవాలు నీకు ఎలా జ్ఞప్తికి వస్తున్నాయి? సుషుప్తిలో 'నేను' యొక్క అవిచ్ఛిన్నతకు గండి యేర్పడిందా? అలా ఏర్పడటానికి వీలు ఉందా?

భ: అలా ఏర్పడి ఉండవచ్చును.

మ: అలా అయితే నిద్రించినవాడు జాన్సన్ అయి, మేల్కొన్నవాడు బెన్సన్ కావచ్చు

అటువంటప్పుడు ఒక మనిషి యొక్క ఏకత్వమును నిరూపించుట ఎలా సాధ్యపడుతుంది?

భ: నాకు తెలియదు.

మ: ఈ తర్కము స్పష్టముగా లేకపోతే, మరొక విధముగా దీనిని గమనించు. "నేను హాయిగా నిద్రపోయాను", "గాఢనిద్రానంతరం నాకు ఎంతో సేద తీరినట్లుగా ఉంది" అనే నీ అనుభవాలను నీవు అంగీకరిస్తున్నావు కదా! అంటే, నిద్ర నీ యొక్క అనుభవము. ఆ నిద్రానుభవమును పొందిన వ్యక్తి, ఇప్పుడు ఈ మాట్లాడుతున్న 'నేను'తో తాదాత్మ్యము చెందుతున్నాడు. అంటే, ఈ 'నేను' నిద్రలో కూడా ఉండి ఉండాలి.

భ: అవును.

మ: కాబట్టి 'నేను' అన్న వాడు నిద్రలో ఉన్నాడు. అప్పుడు ప్రపంచమే కనుక ఉండి ఉంటే, అది తాను ఉన్నానని చెప్పిందా?

భ: చెప్పలేదు. కాని ప్రపంచం తన ఉనికిని గూర్చి ఇప్పుడు చెబుతున్నది. దాని ఉనికిని నేను నిరాకరించినప్పటికీ, నా కాలికి ఒక రాయి కొట్టుకొని, పాదానికి గాయము కావచ్చు. ఆ గాయము రాయి యొక్క ఉనికిని చాటి చెబుతున్నది. అదే విధముగా ప్రపంచము యొక్క ఉనికిని గూడ ఋజువు పరుస్తున్నది.

మ: నిజమే. రాయి తగిలితే పాదానికి గాయము అవుతుంది. కాని పాదము చెబుతున్నదా, అదిగో అక్కడ రాయి ఉన్నది అని?

భ: లేదు. నేను చెబుతున్నాను.

మ: ఈ 'నేను' అన్న వాడు ఎవడు? ఇంతకుముందు తెలిసికొన్నట్లు, ఈ 'నేను' దేహము కావటానికి వీలులేదు. ఇది మనస్సు కూడా కాజాలదు. ఈ 'నేను' జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థల యొక్క అనుభవమును పొందుతున్న 'నేను'. ఆ

**మూడు అవస్థలు మార్పు చెందే దశలు అయి ఉన్నప్పటికీ, అవి** నేను,
**బాధించవు.** ఆ అనుభవములు సినిమాలో తెరమీద కదలిపోతుండే చిత్రము,
వంటివి. చిత్రములు కన్పించవచ్చు, అదృశ్యమైపోవచ్చు, కాని ఈ మార్పులు తెర
ఏమాత్రము బాధించవు. అలాగే, మూడు అవస్థలు ఒకదాని తరువాత ఒకటి
వస్తుంటాయి, పోతుంటాయి. కాని ఆత్మను అవి ఏమాత్రము బాధించవు. జాగ్ర
స్వప్న దశలు మనః కల్పితములు. అలా, ఆత్మ అన్నింటిని తనలో
ఇముడ్చుకుంటుంది. **ఆత్మ పూర్ణానందరూపమున ఉంటుందని తెలుసుకోవటమే**
**ఆత్మసాక్షాత్కారము.** ఆత్మ సాక్షాత్కారము యొక్క ప్రయోజనము.
సంపూర్ణత్వానుభవము, తద్వారా ఆనందానుభవము.

**భ:** జగత్కల్యాణము కొరకు పాటుపడక, ఆత్మసాక్షాత్కార స్థితిలో నిలిచియుండుట – అది పూర్ణానందస్థితి అవుతుందా? ఒకవైపున స్పెయిన్‌లోను, మరో వైపున చైనాలోను యుద్ధం జరుగుతుంటే, ఎవరైనా అంతగా ఆనందముగా ఉండగలరా? ప్రపంచక్షేమమునకై పాటుపడకుండా కేవలం ఆత్మ సిద్ధిని పొందియుండటం స్వార్థపరత్వం అనిపించుకోదా?

**మ:** ఆత్మ ఆ జగత్తునంతటినీ తనలో ఇముడ్చుకొని, దానిని అధిగమించి కూడా ఉంటుందని నీకు తెలుపబడినది. జగత్తు ఆత్మకు భిన్నముగా ఉండజాలదు. అట్టి ఆత్మ యొక్క సాక్షాత్కారమును స్వార్థపరత్వము అని చెబితే, దానిని సకల ప్రపంచమును ఇముడ్చుకున్న సంగ్రాహకమయిన స్వార్థపరత్వముగా గ్రహించవలసి ఉంటుంది. అట్టి స్వార్థపరత్వము నీచమైనదేమీ కాదు.

**భ:** జ్ఞాని కూడా అజ్ఞాని వలెనే తన జీవితాన్ని కొనసాగిస్తాడా!

**మ:** కొనసాగిస్తాడు. అయితే ఇరువురినడుమ ఒక భేదము ఉన్నది. **జ్ఞాని జగత్తును ఆత్మకు భిన్నముగా చూడడు.** అతనికి యథార్థమయిన జ్ఞానము ఉంటుంది; పూర్ణత్వము వలన కలిగిన అంతరానందము ఉంటుంది. కాని అజ్ఞాని అలా కాదు.

అతడు ప్రపంచమును ఆత్మకు భిన్నమని భావించి, తన్నుతాను అపూర్ణునిగా భ్రమించి, దుఃఖితునిగా జీవిస్తాడు. అంతే తప్ప, వారిరువురి భౌతిక చర్యలు ఒకే రీతిగా ఉంటాయి.

భ: జ్ఞానికి కూడా అజ్ఞానికి వలెనే ప్రపంచంలో యుద్ధాలు జరుగుతున్నాయని తెలుస్తాయి.

మ: అవును.

భ: అటువంటప్పుడు, అతడు ఆనందముగా ఎలా ఉండగలడు?

మ: అగ్ని మండుతున్న దృశ్యము, సముద్రము ఉప్పొంగుతున్న దృశ్యము సినిమా తెరపై కన్పిస్తున్నప్పుడు, అవి తెరను బాధిస్తున్నాయా? ఆత్మ విషయములో కూడా అంతే. "నేను దేహమును", 'నేను మనస్సును', అనే భావన ఎంతో లోతుగా పాతుకొని ఉన్నది. అందుచేత, విషయము అవగాహన అయినను, అది సత్యమే అనెడి విశ్వాసము కలిగినను, బలీయముగా ఉన్న ఆ పూర్వపు వాసనల నుండి మనిషి విడివడలేకున్నాడు. ఒకనికి స్వప్నానుభవము కలుగుతుంది. అది మిథ్యా మాత్రమే అని మెలకువ రాగానే అతనికి తెలుస్తుంది. అలాగే జాగ్రదనుభవము కూడా ఇతర అవస్థలలో మిథ్య అవుతుంది. ఈ విధంగా, ప్రతి అవస్థ ఇతర అవస్థలను నిషేధిస్తుంది. **కనుక అవి అన్నీ ద్రష్టలో సంభవించే మార్పులు, లేదా ఆత్మలో గోచరించెడి దృశ్యములు. ఆత్మ అవిచ్ఛిన్నముగా ఉన్నది. ఆ అవస్థలలో జరిగే మార్పుల వలన బాధితము కాకుండా ఉంది.** జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అనునవి దృశ్యమాత్రములు. అట్లే జననము, వృద్ధి, మరణము అనునవి ఆత్మయందు తోచు దృశ్యమాత్రములు. ఆత్మ అవిచ్ఛిన్నముగా, అబాధితముగా నిలిచియున్నది. **జనన మరణములు కేవలము తలపులు. అవి శరీరమునకు మనస్సుకు సంబంధించినట్టివి. ఆత్మ ఈ శరీరము పుట్టకముందు ఉన్నది, శరీరము మరణించిన తరువాత కూడా ఉంటుంది.** వరుస క్రమంలో స్వీకరించిన శరీరపరంపర విషయము కూడా అంతే. ఆత్మ అమరమైనట్టిది. దృశ్యములు పరివర్తనశీలములుగా,

మరణ శీలములుగా ఉంటాయి. మృత్యుభయము దేహమునకు సంబంధించినట్టిది. అది ఆత్మకు లేదు, ఉండదు. మృత్యుభయము అజ్ఞానము వలన కలుగుతుంది. సాక్షాత్కారము అంటే సత్యజ్ఞానము; ఆత్మ యొక్క అమరత్వమును గూర్చి, పూర్ణత్వమును గురించి ఉన్న జ్ఞానము. మరణ శీలత్వము ఒక తలపు మాత్రమే. ఆత్మ యొక్క అమరత్వమును సాక్షాత్కారింపజేసుకుంటే నీవు ఆ దుఃఖమును దూరము చేసుకోగల్గుతావు.

ఆ ఆంగ్లవనితయే సంభాషణను కొనసాగించింది : ప్రపంచము స్వప్న మాత్రమే అయితే దానిని శాశ్వతమగు బ్రహ్మముతో సమన్వయపరచుట ఎలా?

**మ: జగత్తు ఆత్మ కంటె భిన్నము కాదు. ఈ జ్ఞానమే సమన్వయ సూత్రము.**

**భ:** కాని స్వప్నము అనిత్యము, అసత్యము. అది జాగ్రద్దశ చేత నిషేధించబడుతుంది.

**మ:** జాగ్రదనుభవములు కూడ అలాంటివే .

**భ:** ఒక వ్యక్తి ఏబదియేండ్లు జీవిస్తాడు. అతని జాగ్రద్దశానుభవములలో ఒక అవిచ్ఛిన్నత ఉంది. అట్టిది స్వప్నానుభవములలో లేదు.

**మ:** నీవు నిద్రిస్తావు. ఆ నిద్రా సమయములో నీకు కలవస్తుంది. ఆ కలలో ఏబది యేండ్ల అనుభవములు కలలోని ఆ అల్ప సమయములో, ఉదాహరణకు ఐదు నిమిషములలో సంగ్రహింపబడి, అనుభవమునకు వస్తున్నాయి. ఆ అనుభవములలో అవిచ్ఛిన్నత కూడా ఉంటున్నది. వీనిలో ఏది నిజము? జాగ్రద్దశలోని నీ యేబది యేండ్ల జీవిత దశాకాలము నిజమా? లేక నీ కలలోని ఐదు నిమిషాల అల్పమయిన కాలము నిజమా? రెండు దశలలోని కాలప్రమాణములలో వ్యత్యాసము ఉన్నది. అంతే. ఆ అనుభవముల మధ్య ఇతరమయిన ఏ వ్యత్యాసమూ లేదు.

**భ:** క్షణికములయిన దృశ్యముల చేతగాని, మరల మరల కలుగుతున్న జన్మలలోని

శరీరముల పరంపర చేత గాని ఆత్మ బాధితమగుట లేదు. అయితే ప్రతి శరీరము పని చేయుటకు దానిలో జీవము ఎలా వస్తున్నది?

మ: **ఆత్మ పదార్థము కంటె భిన్నమైనది. అది జీవమయము. శరీరము దానిచే చైతన్యవంతమౌతున్నది.**

భ: అయితే జ్ఞాని ఆత్మరూపుడు కాబట్టి, అతనికి జగత్తు యొక్క ఎరుకవుండదు.

మ: అతడు జగత్తును చూస్తాడు, కాని ఆత్మ కంటె దానిని భిన్నముగా చూడడు.

భ: జగత్తు బాధలతో నిండియుండగా, జ్ఞానికి జగద్భావన ఇంకా ఎందుకు కొనసాగాలి?

మ: జగత్తు బాధామయముగా ఉన్నదని జ్ఞాని నీతో చెబుతున్నాడా? ఆ బాధలను అనుభవిస్తూ, జగత్తు బాధామయముగా ఉన్నదని చెబుతూ, జ్ఞాని యొక్క సాయమును కోరుతున్నామని ఇతరులు చెబుతున్నారు. అప్పుడు జ్ఞాని, స్వానుభవపూర్వకముగా, 'నీవు ఆత్మనిష్ఠుడవై ఉంటే సమస్తమయిన బాధలు అంతమవుతాయి' అని వివరిస్తాడు. దృశ్యము తనకంటె భిన్నముగా ఉన్నంత కాలము బాధ అనుభూతమవుతుంది. కాని సర్వము అవిభక్తమయిన ఆత్మగా తోచినప్పుడు అనుభవించుటకు బాధ ఏది? అనుభవించే వ్యక్తి ఏడి? ఆత్మానుభవమును పొందిన మనస్సు పవిత్రాత్మ, తదితరమయిన మనస్సు సైతానుకు నిలయము. జ్ఞానికి ఈ లోకము స్వర్గరాజ్యము. **"స్వర్గరాజ్యము నీలోనే ఉంది." ఆ రాజ్యము ఇదిగో ఇప్పుడే, ఇక్కడే ఉన్నది.**

## 2.09 నీ నిజస్వరూపము నిరాకారము (స.304)

ఒక స్విట్జర్లాండు మహిళ తనకు కలిగిన భ్రాంతి దర్శనమును గూర్చి శ్రీ భగవాన్‌కు వివరించింది. ఆమె కళ్లు బాగా తెఱచుకొని కూర్చుని ఉన్నది. భగవాన్ ముఖము అందమైన పసిబిడ్డ ముఖమువలె ఐనది. అది అందమైన పుష్పాలతో అలంకరింపబడి

ఉంది. ఆ శిశుసదృశ్వదనము పట్ల ఆమెకు ప్రేమ కలిగింది, ఆకర్షణ కలిగి

మ: ఆ దృశ్యము నీ మనస్సులోనిది. దానికి కారణము నీ ప్రేమ. పాల్ బ్రంట నన్ను ఒక మహాకాయునిగా చూశాడు. నీవు నన్ను ఒక శిశువుగా చూశావు రెండూ మనఃకల్పిత దృశ్యములే.

ఆ మహిళ ఇలా చెప్పింది : "నీకు అక్కడ ఏదయినా దివ్యానుభవము కలిగిందా" అని పాల్ బ్రంటన్ అడిగాడు. నేను "లేదు" అన్నాను. ఇప్పుడు ఈ అనుభూతి కలిగింది.

మ: ఇలాంటి దృశ్యములతో భ్రాంతికి లోనుకావద్దు.

భ: ఒక వ్యక్తి ఐరోపాలో, ఎంతో దూరంలో ఉండి, మీ సాయమును అర్థిస్తే...

మ: ఐరోపా ఎక్కడ ఉంది? అది నీలోనే ఉంది.

భ: నే నిక్కడికి వచ్చాను. మహర్షి అక్కడికి రావాలి అని కోరుకొంటున్నాను. (ఇలా అని, ఆమె మృదువుగా నవ్వింది. కొన్ని నిమిషాలు నిశ్శబ్దము)

మ: నీవు భౌతిక శరీరాన్ని చూస్తున్నావు కాబట్టి నీకు పరిమితులు కన్పిస్తున్నాయి. స్థల కాలములు ఈ స్థాయిలో పని చేస్తాయి. నీవు స్థూల దేహమును గూర్చి భావిస్తున్నంత వరకు, భిన్న శరీరములుగా కన్పించు విభేదములు ఉంటాయి. అందుకు భిన్నముగా, నిజమయిన మహర్షిని గూర్చిన జ్ఞానము సకల సంశయములను నివారిస్తుంది. ఇప్పుడు నీవు భారతదేశములో ఉన్నావా? భారతదేశము నీలో ఉన్నదా? ఇప్పుడు కూడా నీవు భారతదేశములో ఉన్నావన్న మిథ్యాభావన తొలగిపోవాలి. భారతదేశము నీలోనే ఉంది. దీనిని సరిచూచు కోవాలంటే, నీ నిద్రను గమనించు. నిద్రలో ఉండగా, నీవు ఐరోపాలోనో, భారతదేశంలోనో ఉన్నట్లు అనిపించిందా? అయినా కూడా, నీవు ఇప్పుడెలా ఉన్నావో అప్పుడు కూడా అలాగే ఉన్నావు. ఆకాశము అనేది నీలోనే ఉన్నది. భౌతికమైన

**శరీరము ఆకాశములో ఉన్నది, కాని నీవు కాదు.** పాల్ బ్రంటన్ ఆ దృశ్యమును చూచినప్పుడు కళ్లు మూసుకొని ఉన్నాడు. నీవు కళ్లు తెఱచుకొని ఉన్నట్లు చెబుతున్నావు.

భ: అవును. నేను అట్టి దృశ్యమును ఎన్నడును చూడలేదు. కాని బ్రంటన్ అభౌతిక వాది. కొద్ది నిమిషముల తరువాత, ఇట్టి దర్శనములు ఉపకారకమా, అపకారకమా అని ఆమె అడిగింది.

మ: అది ఉపకారకమే.

శ్రీ భగవాన్ ఇట్లు చెప్పసాగారు. బహుశా నీవు ఒక పసి బిడ్డను గూర్చి ఆలోచిస్తూ ఉండి ఉంటావు. అదే నీకు కలిగిన దర్శనములో గోచరించింది.

భ: అవును. శివుని యొక్క........ ఆ శివుని శిశు సమానమయిన ముఖమును గూర్చి.

మ: అదీ సంగతి.

భ: కానీ, శివుడు సంహరించేవాడు (నశింపజేసే వాడు)

మ: అవును ----- దుఃఖములను (నశింపజేసేవాడు).

కొన్ని నిముషాల తరువాత శ్రీ భగవాన్ ఇలా చెప్పసాగారు :

నీవు కొద్దిసేపట్లో నిద్రబోతావు. ప్రొద్దుననే నిద్ర లేవగానే, "నేను బాగా నిద్రబోయాను, హాయిగా నిద్రబోయాను" అని చెబుతావు. నిద్రలో ఉన్నది నీ యథార్థ స్వరూపము. ఇది ఇప్పుడు కూడా కొనసాగుతూనే ఉంది. అలా కాకపోతే, అది నీ నిజస్వరూపము కాజాలదు. ఇప్పుడు కూడ ఆ నిద్రా స్థితిని పొందు. అదే శివుడంటే. మనకు ఒక రూపము ఉన్నదా? శివుని రూపమును గురించి ఆలోచించే ముందు దీనిని గురించి ఆలోచించు. నిద్రలో నీవు లేవా? అప్పుడు

నీకు ఏ రూపముయొక్క ఎరుక ఐనా వున్నదా? గాఢనిద్రలో నీకు ఒక రూపము ఉన్నదా? నువ్వు మాత్రం ఎప్పటి వలెనే ఉన్నావు. నీ నిద్రలో ఏ 'నేను' ఉన్నదో, అది ఇప్పుడూ ఉన్నది. నీ నిద్రానుభవమును బట్టి నీ కప్పుడు రూపము లేదు. ఇప్పుడు కూడా నీవు అదే - అనగా దేహము లేకుండా ఉన్నావు. దేహము లేకుండా ఉండటం కారణంగా నీవు నిద్రలో సుఖంగా కూడా ఉన్నావు. నీవు ఇప్పుడు కూడా అదే. ఏదైతే స్థిరంగా నిలిచి ఉంటుందో అదే యథార్థ స్వరూపము అయి ఉండాలి. నిద్రలో శరీరము లేదు. సుఖానుభవము మాత్రమే ఉన్నది. అది ఇప్పుడు కూడా స్థిరంగానే నిలిచే ఉన్నది. ఆత్మకు శరీరము లేదు. ఈ విధంగా నీకే శరీరము లేకపోతే, ఇక శివునికి శరీరము ఎలా ఉంటుంది? నీకు శరీరము ఉంటే శివునికి కూడా శరీరము ఉంటుంది. నీకు లేక పోతే, శివునికి కూడా లేదు.

భ: అట్లయితే ఆయన శివుడు ఎందుకు అయినాడు?

మ: శివుడు అంటే ఆనందస్వరూపము. మంగళరూపము. ఆమె (ఆ భక్తురాలు) చాలా సంతోషించింది.

## 2.10 సుషుప్తిలో ఆత్మ శుద్ధ చైతన్యము (స.314)

గాఢ నిద్రలో ఆత్మ శుద్ధచైతన్యముగా ఉంటుందని శ్రీ భగవాన్ చెప్పారు. అలాగే నిద్ర నుండి మేల్కొనునప్పుడు గల సంధిదశలో ఉండే ఆత్మయే సాక్షాత్కారమునకు మిక్కిలి ఉపయోగకరంగా ఉంటుందని చెప్పారు.

దీనిని గురించి వివరించవలసిందని శ్రీ భగవాన్‌ను అడిగారు. శ్రీ భగవాన్ అనుగ్రహపూర్వకంగా ఇలా చెప్పారు.

ఆత్మ సుషుప్తిలో శుద్ధ చైతన్యముగా ఉంటుంది. సంక్రమణ దశలో (సుషుప్తి నుండి మెలకువకు మారే దశ) అది ఇదం (ఇది) లేకుండా కేవలము అహం

('నేను') గాను, జాగ్రద్దశలో 'అహం' ('నేను')గాను, మరియు ఇదం (ఇది)గాను అభివ్యక్తమవుతుంది. వ్యక్తి యొక్క అనుభవము అహం ('నేను') ద్వారానే సాగుతుంది. అందుచేత అతడు పైన సూచించిన విధంగా (అనగా సంక్రమణ దశలోని 'నేను' ద్వారా) ఆత్మానుభవము పొందుటకు ప్రయత్నించాలి. అలా కాకపోతే, నిద్రానుభవము వలన అతనికి ప్రయోజనము లేదు. సంక్రమణ 'నేను'ను సాక్షాత్కరించుకుంటే, దాని కాధారమై ఉన్నదేదో అది తెలుస్తుంది. అది గమ్యమునకు చేరుస్తుంది. అలాగే, నిద్ర అజ్ఞాన దశగా పేర్కొన బడింది. కాని, జాగ్రద్దశలో ఉండే మిథ్యాజ్ఞానాన్ని బట్టి అలా చెప్పటం జరుగుతోంది. నిజానికి జాగ్రద్దశయే అజ్ఞానము, సుషుప్తి ప్రజ్ఞానము. 'ప్రజ్ఞానమే బ్రహ్మము' అని శ్రుతి చెబుతోంది. బ్రహ్మము శాశ్వతము. సుషుప్తిని అనుభవించెడి వాడు ప్రాజ్ఞుడు. అవస్థాత్రయములోనూ అతడు ప్రజ్ఞానమే. అయితే సుషుప్తిలోని ప్రత్యేకత ఏమిటంటే – ఆ స్థితిలో అతడు ప్రజ్ఞాన ఘనము. 'ఘనము' అంటే ఏమిటి? జ్ఞానము ఉన్నది; విజ్ఞానము ఉన్నది. ఈ జ్ఞాన విజ్ఞానములు రెండూ కలిసి బోధలన్నింటిలోనూ పనిచేస్తుంటాయి. జాగ్రద్దశలోని విజ్ఞానము విపరీతజ్ఞానము. అంటే అది మిథ్యాజ్ఞానము, అజ్ఞానము. అది ఎప్పుడూ జీవుడితో కూడి ఉంటుంది. ఇది విస్పష్టజ్ఞానము అయినప్పుడు, అదే బ్రహ్మము. సుషుప్తిలో మాదిరిగా మిథ్యాజ్ఞానము పూర్తిగా నశించినప్పుడు అతడు శుద్ధ ప్రజ్ఞానముగా ఉంటాడు. ప్రజ్ఞానఘనము అంటే అదే. ప్రజ్ఞానము, విజ్ఞానము, అజ్ఞానము, సంజ్ఞానము – ఇవి అన్నీ బ్రహ్మము యొక్క నామములే అని ఐతరేయోపనిషత్తులో పేర్కొనబడింది. జ్ఞాన స్వరూప మాత్రముగా ఆయనను అనుభవగోచరుని గావించుకోవటం ఎలా? అనుభవము ఎప్పుడూ విజ్ఞానముతో కూడి ఉంటుంది. అందుచేత, ప్రజ్ఞానఘనానుభవము కోసం సంక్రమణ దశలోని శుద్ధఅహం స్వరూపమును పట్టుకోవలసియున్నది. జాగ్రద్దశలోని 'నేను' కలుషితమైన 'నేను' అగుటచేత, అది అట్టి అనుభవమునకు పనికిరాదు. కాబట్టే అందుకు సంక్రమణ 'నేను' లేక శుద్ధమయిన 'నేను' అవసరమౌతున్నది. ఈ శుద్ధ అహంతత్త్వాన్ని

సాక్షాత్కరింపజేసుకోవటం ఎలా అనే ప్రశ్న ఉంది. "విజ్ఞానకోశే విలసత్య (అతడు ఎల్లప్పుడూ విజ్ఞానమయ కోశమునందు ప్రకాశించుచున్నాడు) అని వివేకచూడామణిలో చెప్పబడినది. త్రిపురారహస్యములోను, తదిత గ్రంథములలోను ఇట్లు చెప్పబడింది : **ఒకదాని తరువాత మరొకటి వచ్చే రెం తలపుల నడుమ ఉండే అంతరము శుద్ధఅహం రూపము. ఆ శుద్ధమయిన స్థితి పట్టుకొని, ప్రజ్ఞానఘన అనుభవమును లక్ష్యముగా ఉంచుకుని చేసే ప్రయత్నంలో వృత్తి ఉంటుంది.** వీని అన్నింటికీ వాని వానికి తగిన అధి స్థానములున్నాయి. అన్నీ కలిపి ఒకేసారి సాక్షాత్కారానికి దారి తీస్తాయి. అలా వివేకచూడామణిలో మరో మాట చెప్పబడింది. శుద్ధాత్మ అసత్తుకు అతీతము అనగా అసద్విలక్షణము. **ఇక్కడ అసత్తు అంటే కలుషితమయిన జాగ్రద్దశలో 'నేను' అని అర్థం.** అసద్విలక్షణము అంటే సత్తు, అనగా సుషుప్తిలోని ఆత్మ. ఆయన సదసద్విలక్షణుడని కూడా వర్ణింపబడ్డాడు. రెండింటి అర్థమూ ఒకటే. అంతేకాదు ఆయన అశేషసాక్షి (సర్వసాక్షి) కూడా.

**అయన శుద్ధుడయినట్లయితే, ఆయనను కలుషితమయిన అహం ద్వారా అనుభవగోచరునిగా చేసుకోవటం ఎలా?** 'నేను హాయిగా నిద్రించాను', అని ఒక మనిషి చెబుతున్నాడు. 'హాయి' అనగా ఆనందము, అతని అనుభవమునకు వచ్చింది. అలా రాకపోతే, అనుభవమునకు రానిదానిని గురించి అతడు ఎలా చెప్పగలిగి ఉండే వాడు? **ఆత్మ శుద్ధము అయినట్లయితే, సుషుప్తిలో అతనికి ఆనందానుభవము ఎలాకలిగింది? పైగా, ఆ అనుభవాన్ని గురించి ఇప్పుడు చెబుతున్నవాడెవడు? చెప్పేవాడు విజ్ఞానాత్మ, (అజ్ఞానాత్మ). అతడు ప్రజ్ఞానాత్మను గురించి చెబుతున్నాడు. ఇది ఎలా కుదురుతుంది? ఈ విజ్ఞానాత్మ సుషుప్తిలో ఉన్నాడా? సుషుప్త్యానందాను భవమును గూర్చి అతడు ఇప్పుడు చెబుతున్న మాటలను బట్టి సుషుప్తిలో అతడు ఉండి ఉండాలని ఊహించవలసి వస్తుంది.** ఉంటే, అతడు అప్పుడు ఎలా అనగా ఏ రూపంలో ఉన్నాడు? జాగ్రద్దశలో ఉన్న రూపంలో మాత్రం కానే కాదు. **అతడు అక్కడ చాలా సూక్ష్మరూపంలో ఉన్నాడు.** విజ్ఞానాత్మ అత్యంత

సూక్ష్మరూపంలో ఉండి, ఆనందరూపుడయిన ప్రజ్ఞానాత్మను అనుభవగోచరం కావించుకొన్నాడు : ఎలా అంటే మాయా కరణము (వృత్తి) ద్వారా అని చెప్పాలి. ఈ అనుభవం ఎలా ఉంటుంది? **చెట్టు యొక్క కొమ్మల, రెమ్మల, ఆకుల క్రింద చంద్రకిరణకాంతి చూచాయగా గోచరిస్తుంటుంది.** ఆ విధంగానన్న మాట.

ఇప్పటి ప్రత్యక్ష విజ్ఞానాత్మకు ఆ సూక్ష్మ విజ్ఞానాత్మ అపరిచితుని వలెనే బహుశా గోచరిస్తాడు. అయితే సుషుప్తిలో అతని అస్తిత్వాన్ని మనం ఎందుకు ఊహించుకోవాలి అసలు? ఆ నిద్రాసుఖానుభవం అనేది లేనే లేదని, ఆ అనుభవాన్నే మనం నిరాకరించవచ్చును, ఆ విధంగా ఈ ఊహకు స్వస్తి చెప్పవచ్చును. అలా కాదు. అది వీలు కాదు. ఎందుకంటే, ఆనందానుభవమనేది అక్కడ ఉన్నది; అది వాస్తవం. దానిని కాదనటానికి వీలులేదు. అనుభవాన్ని ఎలా కాదనగలము? అందుకొరకే గదా ప్రతివాడూ నిద్రనుకోరుకుంటాడు; చక్కని మెత్తని శయ్యను ఏర్పాటు చేసుకొని, దానిపై హాయిగా నిద్రించి, గాఢ నిద్రలోని ఆనందాన్ని పొందాలనుకుంటాడు.

దీనిని బట్టి మనము ఒక విషయాన్ని నిర్ధారణ చేసి చెప్పగలము. మూడు అవస్థల (మెలకువ, కల, నిద్ర)లోను జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము – ఈ మూడు (త్రిపుటి) ఉన్నాయి. వాని యొక్క సూక్ష్మ సూక్ష్మతర దశలలో వ్యత్యాసాలు ఉండవచ్చుగాక. సంక్రమణ దశలో మాత్రము అహం ('నేను') శుద్ధరూపంలో ఉంటుంది. అక్కడ ఇదం (ఇది) అనేది అణచబడి ఉంటుంది. అహం ('నేను') ప్రాబల్యమును కలిగి ఉంటుంది. ఇదే కారణము.

ఆ శుద్ధ 'నేను' స్వరూపము ఇప్పుడు ఎందుకు సాక్షాత్కరించటం లేదు, పోనీ ఎందుకు జ్ఞప్తికి రావటం లేదు. ఎందుకంటే – దానితో పరిచయము లేదు కనుక అని చెప్పాలి. దానిని ఎరుకతో పొందవలసి ఉంది. అప్పుడే అది ఏమిటో గుర్తించగలము. అందుచేత ప్రయత్నం చేయి, ఎరుకతో దానిని సాధించు.

**2.11 రెండు తలపుల మధ్య కాలంలో అహంత శుద్ధముగా ఉంటుంది.**

**(స.286)**

భ: మనము కోరుకున్నంత కాలము సుషుప్తిలో ఎందుకు ఉండలేము? అంత జాగ్రదవస్థలో ఉన్నట్లుగానే సుషుప్త్యవస్థలో కూడా మనము స్వచ్ఛందంగా ఎందుకు ఉండలేము?

మ: ఈ (జాగ్రత్) స్థితిలో కూడా సుషుప్తి కొనసాగుతూనే ఉంటుంది. మనము ఎప్పుడూ సుషుప్తిలోనే ఉంటున్నాము. **ఆ సుషుప్తిలోకి ఎరుకతో పోయి, ఈ జాగ్రద్దశలోనే దానిని అనుభవగోచరము కావించుకోవలసి ఉంటుంది.** నిజానికి ఆ సుషుప్తిలోకి పోవటమూ లేదు, దానిలో నుండి వెలుపలకు రావటమూ లేదు. దానిని తెలిసికోవటమే సమాధి. అజ్ఞాని సుషుప్తిలో బహుకాలము ఉండలేడు. అతడు బలవంతంగా సుషుప్తి నుండి ప్రకృతి చేత బయటకు నెట్టివేయబడతాడు. అతనిలో అహంత నశించలేదు కనుక అది మరల పైకి లేస్తుంది. కాని జ్ఞాని దానిని, దాని మూలములోనే అణగద్రొక్కేందుకు ప్రయత్నిస్తాడు. కాని ఆ అహంత మరల మరల పైకి వస్తూనే వుంటుంది; ప్రకృతి చేత అనగా ప్రారబ్ధముచేత ప్రేరేపింపబడి తలెత్తుతూనే ఉంటుంది. ఇలా జ్ఞానిలోను, అజ్ఞానిలోనూ అహంత ఆవిర్భవిస్తూనే ఉంటుంది. అయితే, ఇరువురికీ ఒక తేడా ఉంది. అజ్ఞాని యొక్క అహంతకు, అది తలెత్తినప్పుడు, తన మూలమేమిటో తనకు తెలియదు. అంటే **అజ్ఞాని స్వప్నదశలో, జాగ్రద్దశలో, తన సుషుప్తిని యెరుగడు. జ్ఞాని విషయం అలా కాదు. అహంత యొక్క మూలాన్ని తన లక్ష్యంగా పెట్టుకొన్న జ్ఞాని, ఆ అహంత తలెత్తగానే, దాని ద్వారానే పారమార్థికానుభవమును పొందుతాడు.** జ్ఞానిలోని ఈ అహంత ప్రమాదకారికాదు. అది కాలిన త్రాడు వంటిది. ఆకారమునకే అది త్రాడు. కాని త్రాడుగా అది పనికి రాదు. అలాగే అది పేరుకు మాత్రమే అహంత. అహంతగా అది నిరుపయోగము. మనమూలము నందు నిరంతరము మన లక్ష్యమును ఉంచుకోవటం వలన అహంకారము తన మూలములో, ఉప్పుబొమ్మ సముద్రములో విలీనమైపోయినట్లు, విలీనమైపోతుంది.

భ: నిర్వికల్ప సమాధిలో 21 రోజులకంటె ఎక్కువ ఉండటం సాధ్యం కాదని

రామకృష్ణ పరమహంస చెప్పారు. ఇంకా అట్లే నిలిచి వుంటే, ఆ వ్యక్తి మరణిస్తాడు. ఇది నిజమా?

**మ:** ప్రారబ్ధము క్షయమయి పోయిన తరువాత అహంత పూర్తిగా నశిస్తుంది; దాని యొక్క ఆనవాలు కూడా లేకుండా పోతుంది. ఇదే మోక్షము. ప్రారబ్ధము పూర్తిగా క్షయము కానంత వరకూ, అహంత జీవన్ముక్తులలో కూడా పైకి వస్తూనే వుంటుంది. అయితే వారిలో ఆ అహంత శుద్ధరూపంలో ఉంటుంది. నిర్వికల్ప సమాధి యొక్క అంతిమ అవధి 21 రోజులు మాత్రమే అని చెప్పినమాట విషయంలో నాకింకా అనుమానం ఉంది. మనిషి 30 లేక 40 రోజుల పాటు ఉపవాసం వుంటే బ్రతుకలేడని చెబుతారు. కాని అంతకంటె ఎక్కువకాలము, అంటే 100 రోజులు కూడా ఉపవాసం ఉన్న వాళ్లు ఉన్నారు. అంటే అర్థం ఏమిటంటే - వారిలో ప్రారబ్ధం ఇంకా మిగిలి ఉంది.

**భ:** ఆత్మ సాక్షాత్కారము ఎలా కలుగుతుంది?

**మ:** నిప్పు నుండి నిప్పు రవ్వవలె పరమాత్మ నుండి ఒక కణము బయలుదేరుతుంది. ఆ కణమును అహంత అన్నారు. అజ్ఞాని విషయములో, ఆ అహంత ఒకానొక దృశ్య వస్తువుతో తాదాత్మ్యము చెందుతూనే ఆవిర్భవిస్తుంది. **దృశ్య వస్తు సంసర్గము లేకుండా అది స్వతంత్రముగా ఉండజాలదు.** ఈ సంసర్గమే అజ్ఞానము. మన ప్రయత్నములన్నింటి యొక్క ఉద్దేశ్యము ఈ సంసర్గమును నశింపజేయుటమే. **అహంత యొక్క ఈ విషయములతో కూడే అలవాటు నశింపజేసినట్లయితే, అది శుద్ధరూపంలో నిలిచి ఉంటుంది; తన మూలంలో విలీనమైపోతుంది కూడా.** దేహముతో గల మిథ్యా తాదాత్మ్యభావమే దేహాత్మబుద్ధి, 'నేను ఈ దేహము' అనే భావన. సత్ఫలితములు కలగాలంటే ఇది నశించాలి.

**భ:** దీనిని నిర్మూలించటం ఎలా?

మ: దేహముతో, మనస్సుతో ఏ విధమైన సంసర్గము లేకుండా మనము సుషుప్తిలో ఉంటున్నాము. కాని మిగిలిన రెండు అవస్థలలోను మనస్సు శరీరముల సంసర్గమును కలిగి ఉంటున్నాము. **మనము దేహముతో అభిన్నులము అయినట్లయితే, సుషుప్తిలో దేహము లేకుండా ఎలా ఉండగలుగుతున్నాము? మనకు భిన్నమై, బాహ్యముగా ఉండే దాని నుండే మనము విడివడగలము. కాని మనకు అభిన్నమై మనముగా ఉండే దాని నుండి విడివడలేము. అందుచేత అహం అనేది దేహముతో ఒకటి అయినది కాదు; దేహము కంటె భిన్నమైనట్టిది. దీనిని జాగ్రదవస్థలో మనము సాక్షాత్కరింప జేసుకోవాలి.** ఈ దృష్టిని పొందుట కొరకు మనము జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి అవస్థాత్రయమును అధ్యయనం చెయ్యవలసి ఉంది.

**రెండు అవస్థల మధ్య కాలములో లేక రెండు తలపుల మధ్య కాలములో అహంత శుద్ధ స్థితిలో ఉంటుంది.** వేరొక ఆధారము చిక్కిన తరువాత మాత్రమే వెనుకటి ఆధారమును వదలిపెట్టెడి గొంగళిపురుగు వలె అహంత ఉంటుంది. దృశ్య విషయములతోగాని, తలపులతోగాని ఎట్టి సంపర్కము లేకుండ ఉన్నప్పుడే ఈ అహంత యొక్క నిజస్వరూపము గోచరిస్తుంది. **చైతన్యము యొక్క మూడు దశలయిన అవస్థాత్రయమును అధ్యయనము చేసి, తద్వారా లభించిన విశ్వాసముతో ఈ దశల మధ్య కాలమును సాక్షాత్కరింపజేసుకోవాలి.**

భ: మనము ఎలా నిద్రిస్తున్నాము, ఎలా మేల్కొంటున్నాము?

మ: రాత్రి కాగానే తల్లి కోడి కూస్తుంది; అంతట కోడిపిల్లలు తల్లికోడిరెక్కల క్రిందికి పోయి దాగుకొంటాయి. అప్పుడు తల్లి కోడి పిల్లలను తన రక్షణలో ఉంచుకొని, గూటిలోకి పోతుంది. తెల్లవారగానే, పిల్లలు బయటికి వస్తాయి; తల్లి కోడి కూడా బయటికి వస్తుంది. తల్లి కోడి అహంతకు ప్రతీక. అహంత తలపులన్నింటినీ ప్రోగుచేసుకొని, నిద్రిస్తుంది. సూర్యోదయం కాగానే సూర్యకిరణములు పైకి వస్తాయి, సూర్యాస్తమయానికి ఉపసంహరింపబడతాయి. అలాగే అహంత అభివ్యక్తమైనప్పుడు,

తన సరంజామా అంతటితో వెలువడుతుంది. అది లయమైనప్పుడు, దానితో బాటు సమస్తమూ అదృశ్యమవుతుంది.

భ: సుషుప్తి యొక్క స్వరూపము ఎలా ఉంటుంది?

మ: మేఘావృతమై అంతా చీకటిమయముగా ఉన్న రాత్రి వేళ వస్తువులను విడివిడిగా గుర్తించటం సాధ్యముకాదు. చూచేవాడు కళ్లు బాగా తెరచుకొని ఉన్నప్పటికీ, అంతా గాఢాంధకారముగా ఉంటుంది. అలాగే సుషుప్తిలో ద్రష్ట కేవలము అజ్ఞానమును చూస్తూ ఉంటాడు, అనగా అజ్ఞానము యొక్క ఎరుక కలిగి ఉంటాడు.

## 2.12 చైతన్యమే అవస్థాత్రయమునకు సాక్షి (స.13)

భ: సాక్షాత్కారమునకు సహాయకములు ఏవి?

మ: వేదశాస్త్రముల యందలి బోధలు, జ్ఞాను లొసగే ఉపదేశములు.

భ: అట్టి ఉపదేశములు చర్చలు, ఉపన్యాసములు, ధ్యానములు – ఈ రూపముగా ఉండవచ్చునా?

మ: ఉండవచ్చును. కాని ఆ సహాయకములన్నీ ద్వితీయ శ్రేణికి చెందినవి; అత్యంత ప్రధానమైనట్టిది గుర్వనుగ్రహమే.

భ: అది పొందటానికి ఎంత కాలము పడుతుంది?

మ: దానిని గుర్చి నీవు తెలుసుకోవటం ఎందుకు?

భ: దాని వల్ల నాకు ధైర్యం కలుగుతుంది.

మ: అట్టి కోరిక ఉండటం కూడా ఒక ఆటంకమే. ఆత్మ ఎప్పుడూ ఉన్నది. అది లేకుండా మరేదీ లేదు. అందుచేత ఆత్మగా ఉండు. దానితో కోరికలూ, సందేహాలూ, అన్నీ మటుమాయమై పోతాయి. సత్‌స్వరూపము యొక్క జాగ్రత్, స్వప్న, సుషుప్తి

దశలలో ఆ ఆత్మ సాక్షిగా ఉన్నది. ఈ దశలు అహంతకు సంబంధించినవి. ఆత్మ అహంతకు కూడ అతీతముగా ఉన్నది. సుషుప్తిలో నీవు ఉన్నావని, నీవు నిద్రాగతుడవై ఉన్నావని గాని, నీకు జగత్తు యొక్క ఎరుక లేదని గాని అప్పుడు తెలియునా? నీకు మెలకువ వచ్చి, నీవు జాగ్రద్దశలో ఉన్నప్పుడు పూర్వ నిద్రలో నీకేమియు తెలియలేదన్న నిద్రానుభవాన్ని గూర్చి వర్ణించి చెబుతున్నావు. కాబట్టి, నీవు నిద్రించినప్పుడున్న చైతన్యమే మెలకువతో ఉన్నప్పుడూ ఉన్నది. జాగ్రచ్చైతన్యతత్త్వము ఏమిటో నీవు తెలుసుకుంటే, అవస్థాత్రయమునకు సాక్షిగా ఉన్న చైతన్యమును గూర్చి నీవు తెలుసుకుంటావు. సుషుప్తిదశలో చైతన్యము ఏ రీతిగా ఉన్నదో తెలిసికొనేందుకు వెదకటం ద్వారా నీవు అట్టి చైతన్యమును కనుగొన గల్గుతావు.

భ: అట్లయితే నేను నిద్రకు ఉపక్రమిస్తాను.

మ: నిద్రపో. నష్టమేమీలేదు.

భ: అది శూన్యస్థితి.

మ: ఆ శూన్యము అనేది ఎవరికి? కనుక్కో. ఏ సమయంలోనూ 'నేను లేను' అని నీవు చెప్పలేవు. ఆత్మ అక్కడ ఎప్పుడూ ఉండనే ఉన్నది; అది అన్ని దశలలోనూ కొనసాగుతుంది.

భ: అయితే నేను సుషుప్తిలో ఉన్న రీతిగా ఉంటూ, అదే సమయంలో మెలకువతో కూడ ఉండాలా?

మ: అవును. మెలకువ కలిగి ఉండటమే జాగ్రదవస్థ. కాబట్టి ఆ స్థితి నిద్రాస్థితికాదు. అది నిద్ర కాని నిద్ర. నీవు నీ తలపుల వలయములోబడి పోతే, ఇక అంతే. అవి నిన్ను లాగుకొనిపోతాయి. నీవు ఇక అంతులేని చిక్కుల్లో పడిపోతావు.

భ: అలా అయితే నేను తలపుల మూలము యొక్క జాడను తెలుసుకొనుటకు

వెనుకకు పోవాలన్న మాట.

మ: అవును. నిశ్చయంగా అట్లే చేయాలి. ఆ విధంగా చేస్తే తలపులు అదృశ్యమై **ఆత్మ ఒక్కటే మిగులుతుంది.** నిజానికి ఆత్మకు లోపల, వెలుపల అనేవి లేవు. అవి కూడా అహంత యొక్క కల్పనలే. **ఆత్మ శుద్ధము, కేవలము.**

భ: సాక్షాత్కారము ఇతరులకు సాయపడుతుందా?

మ: అవును. తప్పకుండా. అదే అత్యుత్తమయిన సహాయము. కాని సాయపడేందుకు అక్కడ ఇతరులంటూ ఎవ్వరూ లేరు. వివిధములయిన నగలలో బంగారమునకు మాత్రమే వెలకట్టే కంసాలివలె, జ్ఞాని అయినవాడు అంతటా ఆత్మనే చూస్తాడు. నీవు దేహముతో తాదాత్మ్యము చెందినప్పుడు మాత్రమే నామ రూపములు ఉంటాయి. **నీవు నీ దేహమును అధిగమించినప్పుడు, నీ దేహచైతన్యముతో బాటు ఇతరులు కూడా అదృశ్యమైపోతారు.**

భ: మొక్కలు, చెట్లు మొదలయిన వానికి కూడా ఇది అన్వయిస్తుందా?

మ: అవి అసలు ఆత్మ భిన్నంగా ఉన్నాయా? కనుక్కో. వానిని చూస్తున్నట్లు నీవు భావిస్తున్నావు. ఆ తలపు నీ ఆత్మలో నుండి ఉబికి వచ్చింది. అది ఎక్కడ పుట్టిందో కనుక్కో. అప్పుడు తలపులు తలెత్తవు, ఆగిపోతాయి. **ఆత్మ ఒక్కటే మిగులుతుంది.**

భ: ఇదంతా సిద్ధాంతపరంగా నాకు అర్థమయింది. కాని అవి ఇంకా అక్కడ ఉండనే ఉన్నాయి.

మ: అవును. అది ఒక సినిమా ప్రదర్శన వంటిది. తెరమీద వెలుతురు ఉంది. ఛాయాచిత్రాలు అటూ ఇటూ కదలుతున్నాయి; ఏదో ఒక దృశ్యం ప్రదర్శింపబడుతోంది; అది ప్రేక్షకులను ఆకట్టుకుంటోంది. ఆ సినిమా దృశ్యంలో భాగంగా ప్రేక్షకులను చూపిస్తే, అది కూడా అలాగే ఉంటుంది. అప్పుడు ఆ తెరపైన ద్రష్ట ఉంటాడు, దృశ్యమూ ఉంటుంది. దీనిని నీకు అన్వయించి చూచుకో.

నీవే తెరవు. ఆత్మ నుండి అహంత ఆవిర్భవించింది. అహంత విస్తరించి తలపులు ఏర్పడ్డాయి. ఆ తలపులే జగత్తుగా, చెట్లుగా, మొక్కలుగా, తదితరములుగా గోచరిస్తున్నాయి. వానిని గురించే నీవు అడుగుతున్నావు. నిజానికి ఇవి అన్నీ ఆత్మకు మరేదీ కాదు. నీవు ఆత్మను చూస్తే, అదే సర్వత్రా, సర్వదా, సర్వమూ సాక్షాత్కరిస్తుంది. అప్పుడు **ఆత్మ ఒక్కటే ఉంటుంది. ఇంకొకటి యేదీ ఉండదు.**

**భ:** అవును. అయినా సరే, ఇదంతా నాకు సిద్ధాంత రీత్యా మాత్రమే అవగతమవుతోంది. కాని, మీ జవాబులు సరళంగా ఉన్నాయి, సుందరంగా ఉన్నాయి, విశ్వసనీయములుగా ఉన్నాయి.

**మ:** మరో మాట ఉంది. 'నాకు సాక్షాత్కారము కాలేదు,' అన్న తలపు కూడా ఒక పెద్ద అవరోధమై కూర్చుంటుంది. వాస్తవానికి, ఉన్నది ఒకే ఒక ఆత్మ.

## 2.13 నీవు మెలకువగా ఉండు, నిద్రలో ఉండు, ఎఱుకలో ఎటువంటి మార్పు ఉండదు. (స.490)

ఒక ఆంగ్ల మహిళ భగవాన్‌తో ఏకాంతంగా సంభాషించాలన్న కోరికను వెల్లడించింది. ఆమె ఇలా మొదలుపెట్టింది; "నేను ఇంగ్లాండుకు తిరిగి పోతున్నాను. ఈ సాయంత్రం ఈ ప్రదేశాన్ని వదలి వెళ్లాలి. నాకు ఒక కోరిక ఉన్నది. అక్కడ మా గృహంలో నేను ఆత్మ సాక్షాత్కారము యొక్క ఆనందాన్ని అనుభవించాలి. నిజమే, పశ్చిమదేశాలలో అది అంత సులభమేమీ కాదు. అయినప్పటికీ, నేను దాని కోసం ప్రయత్నం చేయగలను. అలా ప్రయత్నించటానికి మార్గం ఏమిటి?

**మ:** సాక్షాత్కారము నీకు వెలుపల ఉండే ఒకానొకటేదో అయినట్లయితే, మనిషికున్న భద్రత, అతనికున్న సామర్థ్యము మొదలయిన వానిని దృష్టిలో ఉంచుకొని, వానికి అనుగుణమైన మార్గమేదైనా చూపించేందుకు అవకాశం ఉంటుంది. అప్పుడు అది సాధించదగినదేనా, అట్లే అయితే, దానికి ఎంతకాలం పడుతుంది మొదలగు ప్రశ్నలు కూడా ఉత్పన్నమవుతాయి. కాని ఇక్కడ సాక్షాత్కారము ఆత్మకు

సంబంధించినట్టిది. ఆత్మ లేకుండా నీవు ఉండలేవు. ఆత్మ ఎల్లప్పుడూ సాక్షాత్కారమయ్యే ఉంది. కాని ఆ వాస్తవాన్ని నీవు గుర్తించటం లేదు, అంతే. ఆ సాక్షాత్కారము ప్రస్తుతం ఉన్న జగద్భావన వలన మరుగై ఉంది. **ఇప్పుడు జగత్తు నీకు బాహ్యముగా గోచరిస్తోంది. దానితో కూడి ఉన్న భావము నీ నిజతత్వాన్ని మరుగు పరుస్తున్నది.** చేయవలసినదంతా ఒకటే ఒకటి. ఈ అజ్ఞానాన్ని తొలగించుకోవాలి. అప్పుడు ఆత్మ తానుగా గోచరిస్తుంది. ఆత్మను సాక్షాత్కరింప జేసుకొనేందుకు ప్రత్యేకంగా వేరే ఏ ప్రయత్నమూ చేయనక్కరలేదు. **ప్రస్తుతము సత్యము మరుగుపడి ఉన్నది కనుక ఆ ఆవరణమును తొలగించటానికే అన్ని ప్రయత్నాలు.**

ఒక మహిళ తన మెడలో హారమును ధరించింది. ఆమె మరచిపోయి, అది ఎక్కడో పోయిందని ఊహించుకొని, కంగారుపడి, ఇక్కడ అక్కడ వెదకటం మొదలుపెట్టింది. అది దొరకక పోవటంతో, తన తోటి వారి నందరినీ, 'మీరు చూచారా', 'మీరు చూచారా', అని అడగసాగింది. చివరకు ఒకామె ఆమె మెడను చూచి, మెడలోనే హారం ఉందని తెలుసుకొని, 'నీ మెడను తడవి చూచుకో', అని చెప్పింది. హారం కోసం వెదకుతున్న ఆ మహిళ తడవి చూచుకుంటే హారం ఉంది. హారం దొరికింది కదా అని ఆమె సంతోషించింది. తన ఇతర స్నేహితురాండ్రను కలసినప్పుడు, వారు ఆమెను 'పోయిన నీ హారం దొరికిందా' అని అడిగితే, ఆమె, 'దొరికింది', అని చెప్పింది. అది పోయిందనీ, పోయింది మరల దొరకిందనీ భావించి అలా చెప్పింది. హారం ఆమె మెడలోనే ఉన్న విషయాన్ని కనుగొన్నప్పుడు ఆమెకు కలిగిన ఆనందం, పోయిన సొమ్ము తిరిగి లభించినప్పుడు పొందిన ఆనందముతో సమానముగా ఉంది. నిజానికి ఆమె హారము పోనూ లేదు, తిరిగి లభించనూ లేదు. అయినా ఆమె అప్పుడు దుఃఖించింది, ఇప్పుడు ఆనందించింది.

ఆత్మసాక్షాత్కార విషయమయినా అంతే. ఆత్మ ఎప్పుడూ సాక్షాత్కారమయ్యే ఉంది. ఆ సాక్షాత్కారము ఇప్పుడు మరుగునబడి ఉంది. అడ్డుగా ఉన్న తెరను తొలగించగానే

నిత్య సిద్ధమై ఉన్న ఆత్మను తిరిగి పొందినట్లు కనుగొని మనిషి ఆనందిస్తున్నా నిత్యసిద్ధముగా ఉన్న సాక్షాత్కారము కొత్తగా పొందిన సాక్షాత్కారమువలె తోస్తు

ఇప్పుడు ఉన్న అజ్ఞానాన్ని తొలగించేందుకు ఏం చెయ్యాలి అనే ప్రశ్న ఉ **సత్యజ్ఞానమును పొందవలయునన్న జిజ్ఞాసతో ఉండు. ఈ జిజ్ఞాస** పెరిగిన కొ **మిథ్యాజ్ఞాన బలము క్షీణిస్తుంది; చివరకు లేకుండా పోతుంది.**

భ: సుషుప్తిలో ఎరుక ఉండదని నిన్న తమరు చెప్పారు. కాని, కొన్ని సందర్భాలలో ఆ దశలో కూడా నాకు నిద్ర యొక్క ఎరుక కల్గుతోంది.

మ: ఇప్పుడు ఎరుక, నిద్ర, ఆ నిద్ర యొక్క జ్ఞానము - ఈ మూడు అంశములలో మొదటి దానిలో ఏ మార్పూ ఉండదు. నిద్రను ఒక అవస్థగా గుర్తించిన ఆ ఎరుకయే, ఇప్పుడు ఈ జాగ్రద్దశలో జగత్తును కూడా చూస్తున్నది. జగత్తు నిషేధింపబడిన స్థితియే నిద్రాస్థితి. జగత్తు కన్పించవచ్చును, కన్పించకపోవచ్చును - అనగా నీవు మెలకువతో ఉండవచ్చును, లేదా నిద్రించుచుండవచ్చును - కాని ఎరుక మాత్రము బాధింపబడకుండా అల్లే ఉంటుంది. అది ఏకము, అవిచ్ఛిన్నము, పూర్ణము అయి ఉండగా, దానిలో మెలకువ, కల, నిద్ర అనే మూడు అవస్థలూ వస్తూ పోతూ ఉంటాయి. ఇప్పుడు కూడా నీవు ఆ ఎరుకగానే నిలిచి ఉండు. అదే ఆత్మ - అదే సాక్షాత్కారము. అక్కడే శాంతి ఉన్నది - అక్కడే ఆనందము ఉన్నది. ఆ మహిళ మహర్షికి కృతజ్ఞతలు తెలిపి, నిష్క్రమించింది.

## 2.14 జ్ఞాని యొక్క స్థితి జాగ్రత్ సుషుప్తి (స.609)

శ్రీమతి బేట్మన్ వ్రాత పూర్వకంగా ఇలా అడిగింది: "మనిషి జాగ్రద్దశలో కంటె సుషుప్తి దశలో శుద్ధ చైతన్యమునకు దగ్గరగా ఉంటాడా?

మ: జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు ఆత్మలో తోచే దృశ్య మాత్రములు. ఆత్మ స్థిరము, కేవల జ్ఞాన దశ. ఎవరైనా ఏ క్షణమునందైనా ఆత్మకు దూరముగా ఉండగలరా?

అది సాధ్యమయితేనే ఈ ప్రశ్న ఉదయిస్తుంది.

భ: జాగ్రదవస్థలో కంటె సుషుప్త్యవస్థలో మనిషి [illegible] సమీపవర్తియై ఉంటాడని తరచు చెబుతుంటారు కదా!

మ: ఇదే ప్రశ్న ఇలా కూడా ఉండవచ్చును : నా జాగ్రదవస్థలో కంటె, నా సుషుప్త్యవస్థలో నేను నాకు ఎక్కువ దగ్గరగా ఉన్నానా? [illegible], ఆత్మ శుద్ధచైతన్యము. ఏ ఒక్కరూ ఆత్మనుండి దూరముగా ఉండలేరు. ద్వైతం ఉన్నప్పుడే ఈ ప్రశ్నకు అవకాశం ఉంటుంది. కాని శుద్ధ చైతన్యస్థితిలో ద్వైతము లేదు. ఒకే మనిషి నిద్రిస్తాడు, కలగంటాడు, మేల్కొంటాడు. జాగ్రదవస్థ [illegible], ఆసక్తికరమయిన వస్తువులతో నిండి ఉంటుందని భావిస్తుంటారు. అట్టి అనుభవములు ఏవీ లేకపోవటం కారణంగా సుషుప్త్యవస్థ జడస్థితి అని చెప్పటం జరుగుతోంది. ఈ విషయాన్ని గురించి యింకా విచారణ చేయటానికి ముందు ఒక విషయం స్పష్టం చేసుకోవలసి ఉంది. నీవు నిద్రలో ఉన్నావు అని అంగీకరిస్తావు కదా!

భ: అంగీకరిస్తాను.

మ: నిద్రలో ఉన్న ఆ నీవే, ఇప్పుడు మేల్కొని ఉన్నావు; అవునా?

భ: అవును.

మ: కాబట్టి, సుషుప్తి దశలోను, జాగ్రద్దశలోను ఒక అవిచ్ఛిన్నత ఉన్నది. ఆ అవిచ్ఛిన్నత ఏమిటి? అది శుద్ధసత్తామాత్రస్థితి. అయితే రెండు అవస్థల నడుమ ఒక వ్యత్యాసము ఉన్నది. ఆ వ్యత్యాసము ఏమిటి? సంఘటనలు, అనగా దేహము, జగత్తు, విషయములు – ఇవి అన్నీ జాగ్రదవస్థలో అగుపిస్తాయి; కాని సుషుప్త్యవస్థలో అంతర్ధానమౌతాయి.

భ: కాని, నా నిద్రలో నాకు ఎరుక లేదు.

**మ:** నిజమే. అక్కడ దేహము యొక్క ఎరుక లేదు, జగత్తు యొక్క ఎరుక లే కాని ఒక విషయం ఉన్నది. 'నా నిద్రలో నే నెరుగను' అని ఇప్పు చెప్పవలయునంటే నీ నిద్రలో నీవు ఉండి తీరాలి. ఇప్పుడు అలా చెబుత దెవరు? మేల్కొనియున్న మనిషే చెబుతున్నాడు. నిద్రించే మనిషి ఆమాట చెప్పలే అంటే ఏమన్నమాట? **మనిషి ఇప్పుడు దేహంతో తాదాత్మ్యం చెంది ఉండి, అ ఎరుక నిద్రలో లేదని చెబుతున్నాడు.** నీవు నీ దేహముతో తాదాత్మ్యము చెందియున్న కారణంగా నీ చుట్టూ ఉన్న ప్రపంచాన్ని చూస్తున్నావు. జాగ్రద్దశ అందమైన ఆసక్తికరమయిన వస్తువులతో నిండి ఉన్నదని చెబుతున్నావు. సుషుప్తి జడస్థితిగా గోచరిస్తోంది; ఎందుకంటే, నీవు అక్కడ ఒక వ్యక్తిగా (జీవునిగా) ఉండలేదు, అందువల్ల ఈ వస్తువులన్నీ అక్కడ లేవు. కాని వాస్తవము ఏమిటి? **మూడు అవస్థలలోను ఉనికి అవిచ్ఛిన్నముగా ఉన్నది; కాని వ్యక్తి, విషయములు అవిచ్ఛిన్నముగా లేవు.**

**భ:** అవును.

**మ: ఏదైతే అవిచ్ఛిన్నముగా ఉంటుందో, అది స్థిరము, అనగా శాశ్వతము. ఏదైతే విచ్ఛిన్నముగా ఉంటుందో, అది అశాశ్వతము.**

**భ:** అవును.

**మ:** కాబట్టి, సత్‌స్థితి శాశ్వతము, శరీరము, జగత్తు కావు. అవి ఉనికి - ఎరుక అనే తెర మీద సాగిపోవుచున్న క్షణిక దృశ్య మాత్రములు. ఆ సచ్చైతన్యమో, శాశ్వతము, స్థిరము.

**భ:** సాపేక్షముగా చెప్పినప్పుడు, జాగ్రదవస్థ కంటె సుషుప్త్యవస్థ శుద్ధ చైతన్య సమీపవర్తి కాదా?

**మ:** అవును, ఒక విధముగా : సుషుప్తి నుండి జాగ్రత్తులోనికి వచ్చునప్పుడు, 'నేను' తలపు బయలుదేరుతుంది; దానితో మనోవ్యాపారము మొదలవుతుంది;

తలపులు తలెత్తుతాయి; దేహధర్మములు క్రియాశీలములవుతాయి; ఇవి అన్నీ కలిస్తే, అప్పుడు మనము మేల్కొన్నామని చెబుతాము. ఈ పరిణామక్రమమంతా లేని స్థితియే సుషుప్తి యొక లక్షణము. ఆ విధముగా చూచినప్పుడు, జాగ్రత్తు కంటె సుషుప్తి శుద్ధ చైతన్యమునకు చేరువగా ఉన్నది. అంత మాత్రాన మనిషి ఎప్పుడూ సుషుప్తిలోనే ఉండాలని కోరుకోకూడదు. మొట్టమొదటి, అది అసంభవము. ఎందు కంటే ఇతర అవస్థలతో బాటు అది కూడా వస్తూ పోతూ ఉంటుంది. తప్పదు. ఇక రెండవది – అది జ్ఞాని ఉండే ఆనందస్థితి కాదు. జ్ఞాని యొక్క ఆ స్థితి శాశ్వతమైనది; అది వచ్చిపోయే స్థితి కాదు. పైగా సుషుప్తిని ఎరుకతో కూడియున్న దానినిగా జనులు గుర్తించటం లేదు; జ్ఞాని అలా కాదు, అతడు ఎప్పుడూ ఎరుకతో ఉంటాడు. ఆ రీతిగా సుషుప్తిదశ జ్ఞాని నెలకొనియున్న స్థితి కంటె భిన్నమైనట్టిది. ఇంతేకాక, సుషుప్తిలో మనిషికి తలపులు ఉండవు, ఆ తలపుల యొక్క ముద్రలు ఉండవు. ఆ స్థితిలో ప్రయత్నము చేయటం అసంభవం. కనుక మనిషి తన సంకల్పానుసారంగా దానిని మార్చలేడు. శుద్ధచైతన్యమునకు చేరువగా ఉన్నప్పటికీ, ఆత్మసాక్షాత్కారసాధనకు అది యోగ్యమయిన స్థితి కాదు. ఆత్మను సాక్షాత్కరింపజేసు కొనేందుకు ప్రేరణ జాగ్రధవస్థలోనే లభిస్తుంది. అంతేకాక మనిషి మేలుకొని యున్నప్పుడే ఏ ప్రయత్నమయినా చేయగల్గుతాడు. సుషుప్తిలోని నిశ్చలత్వాన్ని పొందటానికి జాగ్రత్తులోని తలపులు ఆటంకమై కూర్చుంటాయని మనము తెలిసికొంటాము. "నిశ్చలంగా ఉండు, నేనే దైవాన్ని అని తెలుసుకో". కనుక నిశ్చలత్వమే సాధకునికి లక్ష్యము. కనీసము ఒక్క తలపును ఆపేందుకు ఒక చిన్న ప్రయత్నము చేయి; ఒక్క క్షణకాలం చేయి; చాలు. అదే ఎంతగానో ఉపకరిస్తుంది; అది నిశ్చలత్వ స్థితి దిశగా నిన్ను కొనిపోతుంది. ప్రయత్నం చేయటం అవసరమై ఉన్నది. అది జాగ్రదవస్థలోనే సాధ్యపడుతుంది. ఆ స్థితిలో ప్రయత్నమూ ఉంది; ఎరుక కూడా ఉంది; తలపులు ఆగిపోతాయి. అంతట సుషుప్తిలోని శాంతి సాధింపబడుతుంది. జ్ఞాని యొక్క స్థితి అదే. అది సుషుప్తీ కాదు, జాగ్రత్తూ కాదు, రెండింటికీ నడుమనున్న స్థితి. అందులో జాగ్రత్తులోని ఎరుక ఉంటుంది, సుషుప్తిలోని

నిశ్చలత్వం ఉంటుంది. దానిని జాగ్రత్ సుషుప్తి అంటారు. నీవు దానిని మెలకువలో ఉన్న నిద్ర అని గాని, నిద్రలో ఉన్న మెలకువ అనిగాని, నిద్ర లేని మెలకువ అని గాని, మెలకువ లేని నిద్ర అనిగాని - ఎలాగైనా పిలువ వచ్చును. అది [illegible] మెలకువ కాదు, నిద్ర కాదు. అది అతి జాగ్రత్తు (జాగ్రద్దశాతీతము) లేదా అతి సుషుప్తి (సుషుప్తి దశాతీతము). అది అఖండమయిన ఎరుక, అఖండమయిన నిశ్చలత్వము, ఈ రెండూ కూడియున్న స్థితి. అది నిద్రకూ మెలకువకూ నడుమ ఉండే స్థితి; అలాగే క్రమానుగతములయిన రెండు తలపుల మధ్యనున్న కాలము కూడా అదే. అదే తలపుల ఆవిర్భావమునకు మూలము. నిద్ర నుండి మేల్కొనే సమయంలో దానిని మనం చూస్తాము. మరో మాటలో చెప్పాలంటే, తలపుల మూలము నిద్ర యొక్క నిశ్చలత్వములో ఉంది. నిద్రలోని నిశ్చలత్వానికీ, మెలకువలోని సంక్షోభానికీ మధ్య గల వ్యత్యాసమంతా తలపులు ఉండటము, తలపులు లేకపోవటములోనే ఉంది; ఆ తలపులే కారణము. తలపుల యొక్క మూలానికిపో, నీవు నిద్రయొక్క నిశ్చలత్వాన్ని చేరుకొంటావు. కాని దానిని నీవు పూర్తి అన్వేషణాబలముతో చేరుకోగలవు. అంటే పూర్తి ఎరుకతో చేరుకోగలవు. అంటే జాగ్రత్ సుషుప్తి అనే అర్థం. పైన చెప్పబడింది అదే. అది జడస్థితి కాదు; ఆనందస్థితి. అది నశ్వరమైనది కాదు, శాశ్వతమైనది. దాని నుండే తలపులు బయలుదేరతాయి. మన అనుభవములన్నీ కలిపి తలపులే కదా; కాక మరియేమిటి? సుఖదుఃఖాలనేవి కేవలము తలపులే. అవి మన లోపలే ఉన్నాయి. నీవు తలపుల నుండి విడివడు, కాని ఎరుకతో ఉండు; అప్పుడు నీవు ఆ పరతత్త్వమే అవుతావు. శ్రీమతి బేట్మన్ ఈ ప్రసంగమును ఎంతగానో మెచ్చుకున్నది; శ్రీ భగవాన్‌కు కృతజ్ఞతలు తెలిపింది.

**2.15 'నేను' యొక్క మూలమును కనుక్కో; అప్పుడు అన్ని ప్రశ్నలూ పరిష్కరింపబడతాయి. (అ.ర. 22.3.1946).**

ఒక స్వామి యిలా అడిగాడు : "ఆత్మ సాక్షాత్కారానికి అత్యంత [illegible]

మ: 'నేను ఉన్నాను' అన్న దొక్కటే ప్రతివానికీ శాశ్వతము ప్రత్యక్షము అయిన అనుభవముగా ఉన్నది. 'నేను ఉన్నాను' అన్న దానివలె ప్రత్యక్షమైన విషయం మరొకటి ఏదీలేదు. జనులు 'ప్రత్యక్షము'గా అనగా ఇంద్రియముల ద్వారా వారు పొందే అనుభవముగా పేర్కొనేది, ప్రత్యక్షము కానేకాదు; ప్రత్యక్షము ఆత్మయే. 'ప్రత్యక్షము' అన్నది ఆత్మకున్న మరోపేరు. కాబట్టి ఆత్మవిచారణ చేసి, 'నేను ఉన్నాను'గా ఉండటం ఒక్కటే చేయవలసిన పని. 'నేను ఉన్నాను' అనేదే పరతత్త్వము. 'నేను ఇది', 'నేను అది', అనుకోవటం అసత్యము. **'నేను ఉన్నాను' అనేదే సత్యము. అదే ఆత్మకున్న మరొక పేరు. 'నేను దైవాన్ని' అనే మాట సత్యము కాదు.**

భ: 'నేను బ్రహ్మమును', (అహం బ్రహ్మాస్మి) అని ఉపనిషత్తులే చెప్పాయి కదా.

మ: ఆ ఉపనిషద్వాక్యాన్ని అర్థం చేసుకోవలసింది అలా కానే కాదు. "బ్రహ్మము 'నేను'గా ఉన్నది" అని మాత్రమే దాని అర్థము; అంతే కాని 'నేను బ్రహ్మమును' అని కాదు. 'నేను బ్రహ్మమును', 'నేను బ్రహ్మమును', అని ధ్యానించవలెనని అందులో సూచింపబడలేదు; అలా భావించకూడదు. మనిషి, 'నేను మనిషిని', 'నేను మనిషిని', అని అనుకుంటూ ఉంటాడా? అతడు అదే. తాను ఒక జంతువు అనో, ఒక చెట్టు అనో సంశయం వస్తే, అప్పుడు మాత్రమే తాను మనిషిని అని చెప్పాలి. లేకపోతే 'నేను మనిషిని' అని నొక్కి వక్కాణించవలసిన అవసరం ఏముంది? అదే విధంగా **ఆత్మ ఆత్మయే. బ్రహ్మము, 'నేను ఉన్నాను'గా ప్రతి వస్తువులోనూ, ప్రతి జీవిలోనూ** ఉంది.

భ: తాను భక్తితో సేవించేందుకు భక్తునికి ఒక ఇష్టదైవం కావాలి. 'పూజించే వాడూ, పూజింపబడే వాడూ అని ఎవరూ లేరు, ఉన్నది ఒక ఆత్మయే,' అని ఆ భక్తునికి బోధించాలా?

మ: సాధనకు దైవం అవసరమన్న మాట నిజమే. **సాధనా లక్ష్యము సిద్ధించాలంటే, భక్తిమార్గంలోనైనా, సంపూర్ణ శరణాగతి అవసరమౌతుంది.** దాని అర్థం ఏమిటి?

ఉంది. మన ప్రయత్నములన్నీ ఆ తెరను ఎత్తివేయటం కొరకే. పిదప సాక్షాత్కారము అభివ్యక్తమౌతుంది.

ధ్యానము చేయవలసినదని బోధిస్తే ముముక్షువులలో చాలామంది ఆ బోధతో సంతృప్తిచెంది వెడలిపోవచ్చు. కాని వారిలో ఒకానొకడు వెనుకకు తిరిగి ఇలా అడుగవచ్చును. **'ఒక విషయమును ధ్యానించేందుకు అసలు నేనెవడను?'** అతనికి 'ఆత్మను కనుగొనుము' అని చెప్పవలసి ఉంటుంది. అదే దానికి అవధి. విచారణ అంటే ఇదే.

*భ:* ధ్యానము లేకుండ విచారణ ఒక్కటే సరిపోతుందా?

**మ: విచారణ అనేది మార్గమూ, గమ్యమూ కూడా. 'నేను ఉన్నాను' అనేది గమ్యము, అదే పరతత్త్వము. ప్రయత్నపూర్వకముగా దానిని గ్రహించియుండుట విచారణ. అయత్నకృతము, సహజము అయితే అదే సాక్షాత్కారము.**

**2.17 అవరోధాలను తొలగించుకొని, "ఆత్మ ఎప్పుడూ సాక్షాత్కారమయ్యే వున్నది", అన్న సత్యాన్ని అనుభవపూర్వకంగా గ్రహించు. (స.618)**

హరిద్వార్ నుండి వచ్చిన ఒక సజ్జనుడు : నన్ను నేను విశ్లేషించుకుంటూ పోతుంటే, నేను బుద్ధిని అధిగమించిపోతున్నాను. ఇక అటు తరువాత ఆనందము లేదు.

*మ:* బుద్ధి ఆత్మకు ఒక సాధనము మాత్రమే. దానికి అతీతముగా ఉన్నదానిని తెలిసికొనేందుకు అది నీకు సాయపడలేదు.

*భ:* అది నాకు తెలిసింది. కాని దానికి అవతల ఆనందము లేదు.

*మ:* **తెలియని విషయాలను తెలిసికొనేందుకు బుద్ధి ఉపకరణముగా ఉంటుంది. కాని నీవు ఆత్మవు. ఆత్మ అంటే జ్ఞానము. అంటే నీవు ఇప్పటికే తెలిసికొనబడి ఉన్నావు.** కనుక నీవు జ్ఞానమునకు విషయము అగుట కుదరదు. **నీకు వెలుపల**

**ఉన్న విషయములను బుద్ధి తెలియజేస్తుంది. ఆ బుద్ధి తనకు మూలమయిన దానిని తెలియజేయలేదు.**

అదేప్రశ్న మరల వేయబడింది.

**మ:** బుద్ధి అంత వరకే సాయపడగలదు. నిన్ను నీవు విశ్లేషించుకొనుటకు బుద్ధి నీకు తోడ్పడుతుంది. అంతకుమించి అది తోడ్పడజాలదు. అప్పుడు దానిని అహంతలో విలీనము చేయాలి; అహంత యొక్క మూలమును అన్వేషించాలి. అలా చేస్తే అహంత లేకుండా పోతుంది. ఆ మూలముగా నిలిచి ఉండు. ఇక అహంత తలెత్తదు.

**భ:** ఆ స్థితిలో ఆనందము లేదు.

**మ:** 'ఆనందము లేదు', అనేది ఒక తలపు మాత్రమే. ఆత్మయే ఆనందము; శుద్ధము, సరళము అయిన ఆనందము. నీవు ఆత్మవు, కనుక ఆనందస్వరూపమే నీవు, తదన్యము కాజాలవు. అట్లు అయి ఉండి, ఇక్కడ ఆనందము లేదు అని నీవు చెప్పలేవు. ఆ విధంగా చెప్పేది ఆత్మ కాదు. అది అనాత్మ. ఆత్మానందమును సాక్షాత్కరింపజేసుకోవాలంటే ఆ అనాత్మను వదలించుకోవలసి ఉన్నది.

**భ:** దానిని వదలించుకోవటం ఎలా?

**మ:** ఆ తలపు ఎక్కడి నుండి వస్తున్నదో చూడు. అది మనస్సు. మనస్సు, బుద్ధి - ఇవి ఎవరి కోసం పని చేస్తున్నాయో చూడు. అహంత కొరకు. బుద్ధిని అహంతలో విలీనం చేయి. అంతట అహంతయొక్క మూలమును అన్వేషించు. అహంత లేకుండా పోతుంది. 'నాకు తెలుసు', 'నాకు తెలియదు', అనేవి విషయి, విషయము - ఈ రెంటినీ సూచిస్తాయి. అందుకు కారణము ద్వైతము. **ఆత్మ శుద్ధము, అఖండము, ఏకము, కేవలము. ఒకటి మరియొకదానిని తెలిసికొనేందుకు రెండు ఆత్మలు లేవు.** అయితే ద్వైతము అంటే ఏమిటి? అది ఏకము, కేవలము అయిన ఆత్మ కాజాలదు. అది అనాత్మ అయి ఉండాలి. ద్వైతము అహంత యొక్క

లక్షణము. తలపులు ఆవిర్భవించినప్పుడు ద్వైతం ఉంటుంది. అది ద్వైతము అని తెలిసికో; దాని మూలమును అన్వేషించు.

**తలపులు ఏ మేరకు లేకుండా పోతాయో ఆ మేరకు ఆత్మసాక్షాత్కార అభిముఖంగా నీ పురోగతి ఉంటుందని చెప్పవచ్చు.** దాని కొలత అది అన్నమాట. అయితే ఆత్మసాక్షాత్కారములో పురోగతి అనే ప్రసక్తి లేదు. అది ఎప్పుడూ ఒకే రీతిగా ఉన్నది. ఆత్మ ఎప్పుడూ సాక్షాత్కారములోనే ఉన్నది. **తలపులే అవరోధాలు. ఆత్మ ఎప్పుడూ సాక్షాత్కారమయ్యే ఉన్నది అనే అవగాహనకు ఏర్పడిన అవరోధములు ఏ మేరకు తొలగిపోయాయో ఆ మేరకు పురోగతిని కొలవటం జరుగుతుంది.** అందుకు ఆ తలపులు ఎవరికి వస్తున్నాయి అని అన్వేషించాలి. ఆవిధంగా అది ఆవిర్భవించని వానిమూలానికి చేరగలవు.

*భ:* సందేహాలు ఎప్పుడూ వస్తూనే ఉన్నాయి. అందుకే ఆ ప్రశ్న అడిగాను.

*మ:* ఒక సందేహం వస్తుంది. ఆ సందేహం నివారింపబడుతుంది. మరల ఇంకొక సందేహం వస్తుంది. అదికూడా నివారింపబడుతుంది. అది మరల ఇంకొక సందేహానికి దారి తీస్తుంది. ఈ విధంగా కొనసాగుతుంటుంది. కనుక సందేహాలన్నింటినీ తీర్చటం సాధ్యము కానేకాదు. అసలు సందేహములు ఎవరికి కలుగుతున్నవో చూడు. వాని మూలమునకు పో. ఆ మూలములో నిలిచి ఉండు. అప్పుడు సందేహాలు రావు, ఆగిపోతాయి. సందేహాలను తీర్చుకొనే విధానం అది. "ఆత్మ సంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్." (మనస్సును ఆత్మలో నిలిపి ఉంచి, ఇక దేనిని గూర్చి ఆలోచింపరాదు)

*భ:* అనుగ్రహము ఒక్కటే అందుకు నాకు సాయపడగలదు.

*మ:* అనుగ్రహము ఎక్కడో బయటలేదు. నిజానికి **అనుగ్రహం కావాలన్న నీ కోరికకు నీలో ఇప్పటికే ఉన్న అనుగ్రహమే కారణము అని గ్రహించు.**

## 2.18 'నేను ఉన్నాను' అనేదే భగవంతుడు (స.503)

భ: నేను ఇరువది యేండ్లకుపైగా వేదాంత శాస్త్రములో ఆసక్తి కలిగి ఉన్నాను. అయితే ఇతరులెందరో చెప్పుకొంటున్నారు కాని నాకు మాత్రము ఏ నూతనమయిన అనుభవమూ కలుగలేదు. నా వద్ద దూరదృష్టి, దూరశ్రవణము మొదలయిన సిద్ధులు ఏవీ లేవు. నేను ఈ దేహబద్ధుడనై ఉన్నట్లుగా మాత్రం అనిపిస్తుంది. అంతకంటే మరేదీ లేదు.

మ: మంచిది. **పరతత్త్వము ఒకటే. అది ఆత్మ.** తక్కినవన్నీ దానిలో తోచే దృశ్య మాత్రములు. అవి అన్నీ దానికి సంబంధించినట్టివి, దానిచే కల్పింపబడినట్టివి. ద్రష్ట, దృశ్యము, దృష్టి - ఇవి అన్నీ ఆత్మయే - ఆత్మను విడిచి, ఎవరైనను చూడగలరా, వినగలరా? అత్యంత సమీపమున ఉండిగాని, లేదా ఎంతో దూరమున ఉండిగాని ఎవరినైనా చూడవచ్చు, లేదా వినవచ్చు. కాని దాని వల్ల ఏమైనది? ఏమి తేడా వచ్చింది? రెండు సందర్భాలలోనూ నేత్రేంద్రియము, శ్రవణేంద్రియము అవసరమౌతాయి. అలాగే మనస్సు కూడా అవసరమవుతుంది. వీనిలో దేనినీ ఈ రెండు సందర్భాలలో వదలి పెట్టడానికి వీలులేదు. ఏదో రీతిగా వాని మీద ఆధారపడక తప్పదు. అలాంటప్పుడు, దూరదృష్టి, దూరశ్రవణము - వీని పట్ల వ్యామోహము ఉండటం ఎందుకు? పైగా, పొందే వానిని క్రమంగా పోగొట్టుకోవలసి వస్తుంది కూడా. అవి శాశ్వతముగా ఉండవు. శాశ్వతమైనది ఒక్క పరతత్త్వమే. అదే ఆత్మ. "నేను ఉన్నాను', "నేను పోతున్నాను", "నేను మాట్లాడుతున్నాను", "నేను పని చేస్తున్నాను"-ఇత్యాదిగా నీవు చెబుతావు. వీటి అన్నింటిలో, **'నేను ఉన్నాను' అనే దానిని వేరు చేయి; అలా 'నేను-ఉన్నాను' అదే మూలాధారమైన శాశ్వత తత్త్వము.** ఈ సత్యాన్నే భగవంతుడు మోసెస్‌కు ఇలా బోధించాడు : * 'నేను ఆ నేను-ఉన్నాను'. 'నిశ్చలముగా ఉండుము. 'నేను' భగవంతుడను అని తెలిసికొనుము'. కనుక 'నేను ఉన్నాను' అనేదే భగవంతుడు. **నీవు ఉన్నావు అని నీకు తెలుసు. నీ అస్తిత్వాన్ని నీవు ఏ క్షణములో**

* I Am that I-Am

నిరాకరించలేవు. ఎందుకంటే అలా నిరాకరించేందుకు నీవు అంటూ ఉంధాలి అక్కడ. నీ మనస్సును నిశ్చలమొనరిస్తే ఈ శుద్ధ సద్రూపము తెలుస్తుంది. మనిషి యొక్క బహిర్ముఖప్రవృత్తియే మనస్సు. ఆ మనస్సును అంతర్ముఖ మొనరిస్తే అది క్రమంగా నిశ్చలమవుతుంది. అంతట 'నేను ఉన్నాను' అన్నదొక్కటే మిగిలి, నిలిచి ఉంటుంది. **'నేను ఉన్నాను' అనేదే సంపూర్ణ సత్యము.**

## 2.19 మనశ్శూన్యమైన అంతశ్చైతన్యము భగవంతునిగా అనుభవ గోచరమౌతుంది (స.244)

ఒక మహారాణి సాహెబా మృదుమంద్రమగు కంఠ స్వరంతో ఇలా చెప్పింది. ఆమె మాటలు స్పష్టముగా వినిపిస్తూనే ఉన్నాయి.

**భ:** మహారాజ్! తమను దర్శించుకొనే భాగ్యము కలిగింది. మిమ్మల్ని దర్శించటంతో నా కనులకు పండుగ అయినది. మీ కంఠ స్వరాన్ని వినటంతో నావీనులకు విందు అయినది. "ఒక మనిషి ఏవి ఏవి తనకు కావాలని కోరుకుంటాడో అవి అన్నీ నాకు అనుగ్రహింపబడ్డాయి." మహారాణి సాహెబా గొంతు రుద్ధమైంది. ఎంతో మనోబలమును కూడగట్టుకొని ఆమె నిదానముగా ఇలా చెప్ప నారంభించింది : 'నేను కోరుకొన్నవి అన్నీ నాకున్నాయి. మనిషి ఏమేమి కోరుకుంటాడో అవి అన్నీ ఉన్నాయి..... కాని... కాని... **నేను...... నేను......... మనశ్శాంతి లేకుండా ఉన్నాను.... ఏదో దానిని ఆటంకపరుస్తోంది.** బహుశా నా ప్రారబ్ధం...". కొన్ని నిమిషాలు అక్కడ మౌనము నెలకొన్నది.

అప్పుడు మహర్షి మధురమైన తమ వాణితో ఇలా సెలవిచ్చారు :

**మ:** మంచిది. చెప్పవలసినది చెప్పారు. బాగున్నది. ప్రారబ్ధము అంటే ఏమిటి? ప్రారబ్ధము అనేది లేదు. శరణాగతి చెందు. అన్నీ సర్దుకుంటాయి. సర్వబాధ్యతలు భగవంతునిపై పడవేయి. ఆ భారమును నీవు మోయవద్దు. అప్పుడు ప్రారబ్ధము నిన్నేమి చేస్తుంది?

భ: శరణాగతి అసంభవము.

మ: **అవును. మొదట, మొదట సంపూర్ణ శరణాగతి అసంభవమే. పాక్షికమయిన శరణాగతి తప్పకుండా ఎవరికైనా సాధ్యమే. క్రమంగా అదే సంపూర్ణశరణాగతికి దారితీస్తుంది.** సరే, శరణాగతి అసంభవమైతే మరి ఏం చేయగలం? **మనశ్శాంతి కరువైనదికదా!** నీవు నిస్సహాయంగా ఉన్నావు. నీకుగా దానిని పొందలేకున్నావు. **అది శరణాగతి ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది,**

భ: పాక్షిక శరణాగతి ప్రారబ్ధాన్ని నశింపజేయగలదా?

మ: ఆహా, తప్పక చేయగలదు.

భ: ప్రారబ్ధము పూర్వ కర్మఫలము కదా?

మ: మనిషి భగవంతునికి శరణాగతి చెందితే, ఆ భగవంతుడే దానిని చూచుకొంటాడు.

భ: ఇది భగవంతుడు ఏర్పరచిన విధివిధానము కదా, దానినే భగవంతుడు ఎట్లు లేకుండ చేయగలడు?

మ: అన్నీ ఆయనలోనే ఉన్నాయి.

భ: భగవంతుని దర్శించటం ఎలా?

మ: లోపల. **మనస్సును అంతర్ముఖమొనరిస్తే, భగవంతుడు అంతశ్చైతన్యముగా ప్రత్యక్షమవుతాడు.**

భ: భగవంతుడు అన్నింటిలో ఉన్నాడు. మన చుట్టూ చూస్తున్న విషయము లన్నింటియందు ఉన్నాడు. వాని అన్నింటిలో భగవంతుని దర్శింపవలయునని చెప్పబడినది.

*మ:* భగవంతుడు అన్నింటిలోను ఉన్నాడు. చూచే వానిలో కూడా ఉన్నాడు. భగవంతుని మరి యెచ్చట చూడగలము? భగవంతుని బాహ్యమున చూడలేము. ఆయనను మనము లోపల అనుభవగోచరము కావించుకోవాలి. విషయములను **చూడాలంటే మనస్సు ఉండాలి. వానిలో భగవంతుణ్ణి చూడటం మానసిక వ్యాపారము.** కాని అది సత్యము కాదు. **మనశ్శూన్యమయిన అంతశ్చైతన్యమే భగవంతునిగా అనుభవగోచరమవుతంది.**

*భ:* అందమయిన రంగులు ఎన్నో ఉన్నాయి. వానిని చూడటంలో ఆనందం ఉంటే వానిలో భగవంతుణ్ణి మనం చూడగలము.

*మ:* అవి అన్నీ మనః కల్పనము.

*భ:* రంగులను మించినవి ఎన్నో వున్నాయి. నేను ఉదాహరణగా మాత్రమే రంగులను గురించి చెప్పాను.

*మ:* అవికూడా అదే విధంగా మానసికములు.

*భ:* దేహము కూడా ఉన్నది; ఇంద్రియములు, మనస్సు ఉన్నాయి. విషయములను తెలిసికొనేందుకు జీవాత్మ వీని అన్నింటినీ వినియోగించుకుంటుంది కదా!

*మ:* విషయములు, భావనలు, తలపులు అన్నీ మనఃకల్పనలే. 'నేను - తలపు' లేక అహంత పుట్టిన తరువాత మనస్సు పుడుతోంది. **అహంత ఎక్కడి నుండి పుడుతున్నది? నిరాకార చైతన్యము లేక శుద్ధ జ్ఞానము నుండి పుడుతున్నది.**

*భ:* అదే ఆత్మయా?

**మ: ఆత్మ, మనస్సు లేక అహంత ఇవి అన్నీ శబ్దమాత్రములు, అట్టి తత్త్వములంటూ ఏవీలేవు. చైతన్యము ఒకటే సత్యము.**

**భ: అయితే, అట్టి చైతన్యము ఎట్టి సంతోషాన్నీ ఇవ్వజాలదు.**

మ: దాని స్వరూపము ఆనందమే. ఆనందమే ఉన్నది. ఆనందాన్ని అనుభవించే అనుభోక్త ఎవ్వడూ లేడు. అనుభోక్త, ఆనందము - ఈ రెండూ అందులో విలీనమైపోతాయి.

భ: సామాన్యజీవితములో సుఖదుఃఖములు రెండూ ఉన్నాయి. మనము సుఖమును మాత్రమే కలిగి యుండవచ్చును కదా!

మ: మనస్సును అంతర్ముఖ మొనరిస్తే సుఖముంటుంది; బహిర్ముఖ మొనరిస్తే దుఃఖం ఉంటుంది. సుఖము యొక్క అభావమే దుఃఖము, మనిషి యొక్క స్వరూపము ఆనందమే.

భ: అది ఆత్మయా?

మ: ఆత్మ, ఈశ్వరుడు అనేవి మనో భావనలు.

భ: ఈశ్వరుడు మనోభావన మాత్రమేనా?

మ: అవును. నిద్రలో నీవు ఈశ్వరుని గూర్చి ఆలోచిస్తావా?

భ: కాని నిద్ర జడ స్థితి.

మ: ఈశ్వరుడు సత్యమే అయితే ఆయన ఎల్లప్పుడూ ఉండాలి. నీవు నిద్రలో ఉంటావు, మెలకువలో ఉంటావు. ఒకే విధముగా ఉంటావు. ఈశ్వరుడు కూడా నీ ఆత్మ మాదిరిగా సత్యమే అయితే నిద్రలో కూడా ఆత్మలాగానే ఉండాలి. ఈ ఈశ్వరభావన జాగ్రదవస్థలో మాత్రమే ఉదయిస్తోంది. ఇప్పుడు ఆలోచించేవాడు ఎవడు?

భ: ఆలోచించేది నేనే.

మ: ఈ 'నేను' ఎవరు? 'నేను' అంటున్నది ఎవరు? శరీరమా?

భ: శరీరమే మాట్లాడుతున్నది.

మ: శరీరము మాట్లాడదు. అదే మాట్లాడితే, నిద్రలో మాట్లాడినదా? లేదు కనుక ఈ 'నేను' ఎవరు?

భ: శరీరములో ఉన్న నేను.

మ: నీవు శరీరములోపల ఉన్నావా లేక వెలుపల ఉన్నావా?

భ: నేను నిశ్చితంగా శరీరంలోపలే ఉన్నాను.

మ: ఉన్నట్లు నిద్రలో ఎరుగుదువా?

భ: నిద్రలో కూడా నేను శరీరంలోపలే ఉన్నాను.

మ: శరీరములోపల ఉన్నట్లు నిద్రలో నీవు ఎరుగుదువా?

భ: నిద్ర జడస్థితి.

మ: యథార్థము ఏమిటంటే, నీవు లోపల లేవు, బయట లేవు, నిద్ర సహజ సత్‌స్థితి.

భ: అయితే దీని కంటె నిద్రయే ఉత్తమస్థితి అయి ఉండాలి.

మ: ఉత్తమ స్థితి లేదు, అధమ స్థితి లేదు. నిద్రలో, కలలో, మెలకువలో నీవు ఒకేరీతిగా ఉన్నావు. **సుషుప్తి ఆనందస్థితి. అక్కడ దుఃఖము లేదు. ఏదో లేదు అన్న కొరత, బాధ మొదలయినవన్నీ జాగ్రద్దశలోనే ఉద్భవిస్తాయి. అయితే జరిగిన** మార్పు ఏమిటి? రెండింటిలోనూ నీవు ఒకే రీతిగా ఉన్నావు. కాని ఆనందములో తేడా వచ్చింది. ఎందువల్ల? మనస్సు పుట్టుకొని వచ్చింది. అదే తేడా. 'నేను - **తలపు' పుట్టిన తరువాత మనస్సు పుడుతోంది. తలపు చైతన్యము నుండి పుడుతోంది. మనిషి చైతన్య నిష్ఠుడై ఉంటే, ఎప్పుడూ ఆనందంగానే ఉంటాడు.**

భ: మనస్సు నిశ్చలంగా ఉండే స్థితి సుషుప్త్యవస్థ. అది అధమస్థితి అని నేను భావిస్తున్నాను.

మ: అదే నిజమైతే, అందరూ నిద్రను కోరుకుంటారెందుచేత?

భ: అలసిపోయినప్పుడు శరీరము నిద్రను కోరుకుంటుంది.

మ: నిద్రబోయేది శరీరమా?

భ: అవును. శ్రమ వల్ల శరీరం నలిగిపోతుంది. ఆ నలత నుండి తేరుకొనేందుకు తగిన స్థితియే నిద్ర.

మ: అది అట్లే కావచ్చును. కాని శరీరమే నిద్రించి, శరీరమే మేల్కొంటుందా? నీవు ఇంతకుముందే, నిద్రలో మనస్సు నిశ్చలంగా ఉంటుందని చెప్పావు. మూడు అవస్థలూ మనస్సుకే ఉన్నాయి.

భ: అవి ఇంద్రియముల ద్వారా పని చేసే ఆత్మ యొక్క అవస్థలు కావా?

మ: అవి ఆత్మకు సంబంధించినవీ కావు. శరీరమునకు సంబంధించినవీ కావు. **ఆత్మ ఎప్పుడూ అకలుషితంగానే ఉంటుంది. అది ఈ మూడు అవస్థలకూ ఆధారముగా, అధిష్ఠానముగా కొనసాగివస్తున్నట్టిది. మెలకువ గడచిపోతున్నది నేను ఉన్నాను; కల చెదరిపోతున్నది, నేను ఉన్నాను; నిద్ర ముగిసిపోతున్నది, నేను అలాగే నేను ఉన్నాను. అవి మరల మరల వస్తూ, పోతూ వున్నాయి, కాని నేను అలాగే ఉన్నాను.** అవి సినిమా ప్రదర్శనలో తెరమీద కదలాడే చిత్రములవంటివి. అవి తెరను బాధించవు. అదే విధంగా ఈ అవస్థలు వస్తుంటాయి, పోతుంటాయి, కాని అవి నన్ను ఏ మాత్రము బాధించవు. ఇదంతా శరీరానికే సంబంధించినది అయినట్లయితే నిద్రలో నీకు శరీరమును గురించిన ఎరుక ఉన్నదా?

భ: లేదు.

మ: అక్కడ శరీరము ఉన్నదని ఎరుగ కుండా, శరీరము నిద్రిస్తున్నదని ఎలా చెప్పగలము?

భ: ఎందుకంటే, మేల్కొన్న పిదప కూడా అది కన్పిస్తోంది.

**మ: దేహస్ఫురణ ఒక తలపు. ఆ తలపు మనస్సుకు సంబంధించినట్టిది. మనస్సు 'నేను- తలపు' పుట్టిన తరువాత పుడుతోంది. 'నేను - తలపు' మొదటి తలపు. దానిని పట్టుకుంటే, ఇతర తలపులన్నీ మాయమైపోతాయి.** అప్పుడు ఇక శరీరము లేదు, మనస్సు లేదు, అహంత సైతము లేదు.

భ: అప్పుడు మిగిలి ఉండేది ఏమిటి?

మ: ఆత్మ శుద్ధస్థితిలో ఉంటుంది.

భ: మనస్సును లేకుండా చేయటం ఎలా?

**మ: దానిని నశింపజేసేందుకు ఏ ప్రయత్నమూ చేయనక్కరలేదు. దానిని గురించి ఆలోచించటం, దానిని కోరుకోవటం - అదే ఒక తలపు. తలపులను తలచేది ఎవరో వానిని అన్వేషిస్తే, తలపులు లేకుండా పోతాయి.**

భ: అవి వాని అంతట అవి లేకుండా పోతాయా? ఇది ఎంతో కష్టమైనదిగా తోస్తున్నది.

మ: అవి మిథ్యా మాత్రములు కనుక లేకుండా పోతాయి. 'ఇది కష్టము', అనే భావం కూడా సాక్షాత్కారమునకు ఒక ఆటంకము. దానిని అధిగమించాలి. ఆత్మగా ఉండటం కష్టము కానేకాదు.

భ: బాహ్య ప్రపంచంలో భగవంతుణ్ణి ధ్యానించటం సులభంగా తోస్తున్నది. కాని తలపులు లేకుండా ఉండటం మాత్రం కష్టమనిపిస్తోంది.

మ: ఇది అసందర్భమయిన మాట : అన్య విషయములను చూడటం సులభమా, (తన)లోపలికి చూడటం కష్టమా? ఇది వ్యతిరేకముగా ఉండవలసినట్టిది.

భ: ఏమైనా నాకు ఇది అర్థం కావటం లేదు. ఇది కష్టమే.

మ: 'కష్టముగా ఉన్నది' అనే ఈ తలపే ముఖ్యమయిన ఆటంకము. కొంచెము సాధన చేస్తే చాలు, అది నిన్ను మరో రీతిగా భావించేట్లు చేస్తుంది.

భ: ఆ సాధన ఎలా ఉంటుంది?

మ: 'నేను' యొక్క మూలమును కనుగొనటం.

భ: అది మనిషి పుట్టకపూర్వమున్న స్థితి.

మ: మనిషి జనన మరణాలను గురించి ఆలోచించటం ఎందుకు? నీవు నిజంగా పుట్టావా? మనస్సు ఉద్భవించటమే పుట్టుక అని పిలువబడుతోంది. మనస్సు తరువాత దేహభావన పుడుతుంది; దేహము కన్పిస్తుంది. పుట్టుకను గూర్చి తలపు, చావు, చచ్చిన తరువాత స్థితి – ఇవి అన్నీ మనస్సుకు సంబంధించినట్టివి. పుట్టుక ఎవరికి?

భ: నేను ఇప్పుడు పుట్టనే లేదా?

మ: దేహమును గురించి ఆలోచించినపుడు పుట్టుక అనేది వాస్తవమే. కాని దేహము 'నేను' కాదు. ఆత్మ పుట్టలేదు, అది మరణించదు కూడ. కొత్తగా వచ్చిన దేదీ లేదు. జ్ఞానులు సమస్తమూ ఆత్మలో ఉన్న దానినిగా ఆత్మకు సంబంధించిన దానినిగా చూస్తారు. అందులో నానాత్వమే లేదు. అందుచేత జననమూ లేదు, మరణమూ లేదు.

భ: నిద్ర అంత మంచి స్థితి అయితే, మనిషి ఎప్పుడూ నిద్రలోనే ఉండాలని ఎందుకు కోరుకోవటం లేదు?

# ప్రవేశిక

'ఏ ప్రయత్నమూ లేకుండా, నిత్యమూ, జాగరూకము అయిన శాంతి' - ఇదే ఆత్మ అంటే అంటారు శ్రీ భగవాన్. కేవలం ఎరుకా, కేవల నిశ్చలతా కలిసి ఉండే స్థితి అది. అదే నిత్య సత్యమంతా. స్వయం విదితమైన చైతన్యం. అవస్థాత్రయం అందులోనే ఉదయించి, అస్తమిస్తుంది.

జాగ్రదవస్థలో మనస్సూ, ఇంద్రియాలూ గ్రహించే బాహ్యజగత్తు, వాస్తవమనే నమ్మకంలో చిక్కుకుపోయాం. అసలు, మనస్సే ఆత్మ అనే అధిష్ఠానంపై లేస్తూ పడుతూ ఉండే తాత్కాలికమైన స్థితి. ఈ భాగంలో, మనస్సు యొక్క ఉద్భవం గురించీ, దాని క్షణికత గురించీ వివరింపబడుతుంది. ఈ భాగంలో పొందుపరచబడిన సంభాషణలు వీటిని విశదీకరిస్తాయి: (1) ఆత్మ నుండి మనస్సు ఉదయించడం, అస్తమించడం (2) అహంభావం ఎట్లా వస్తుంది, దాని నైజమేమిటి? అంతేకాక మనోకల్పితమైన దేశకాలాల భ్రమ గురించి కూడా చర్చ ఉంటుంది. ఈ అవగాహన జగత్తు వాస్తవమన్న నమ్మకాన్ని పోగొడ్తుంది. అంతేకాక విచారణ మార్గంలో నిలిచి ఆత్మానుభూతి పొందటానికి సుగమం చేస్తుంది.

## జాగ్రదవస్థ ఆవిర్భావం

చైతన్యమే అధిష్ఠానమనీ, ఎల్లప్పుడూ మూలంగా ఉండేదే అని శ్రీభగవాన్ ఇట్లా అంటారు:

| | |
|---|---|
| మెలకువ | = చైతన్యం + మెలకువ(3.04) |
| కల | = చైతన్యం + కల. (3.04) |

ఎల్లప్పుడూ ఉండే ఆత్మే, చైతన్యంగా- మనస్సునీ, ఇంద్రియాలనీ సచేతనం చేస్తుంది.

వీటి వల్లనే అన్నిటినీ గ్రహించగలుగుతాం (పనులను కూడ చేస్తాం, కాని ప్రస్తుతానికి అవి అంత ముఖ్యం కాదు.) ఎల్లప్పుడూ హృదయంలో ఉండే ఆత్మ కాంతి మెదడు మీద పడినప్పుడు (మెదడే, మనస్సుకి భౌతికస్థానం) తల పైకి లేస్తుంది (3.10). తలలేవడం తోబాటే మనస్సూ ఉదయిస్తుంది. మెదడులోని ఆ పరివర్తిత కాంతి వల్లనే ఇంద్రియాలు కూడా సచేతనమౌతాయి. అట్టి మనస్సు యొక్క స్థితిని శుద్ధమనస్సంటారు. ఈ స్థితిలో పరివర్తితమైన కాంతికి దేనితోనూ సంబంధముండదు. అది అపరిమితం, దానినే విశ్వచైతన్యమని కూడా అంటారు. మనస్సు నుండి చైతన్యం దేహమంతా వ్యాపిస్తుంది. ఇంద్రియాలు రంగంలోకి దిగుతాయి. మనస్సుతోబాటే ఆకాశం (స్థలం) ఉదయిస్తుంది. ఆ విధంగా జాగ్రదవస్థ ఉదయిస్తుంది. అంటే, నిత్యమైన చైతన్యపు వెలుగు పరివర్తితమై మనస్సులోనూ- దేహమంతానూ వ్యాపించి ఉన్న స్థితే జాగ్రదవస్థ. చైతన్యం సూర్యుడనీ, మెదడు మీద పడే కాంతే చంద్రుని యొక్క వెన్నెల వంటిదనీ, అంటారు శ్రీభగవాన్. మామూలుగా మనకి ఈ పరివర్తితమైన కాంతే (అంటే మనస్సు యొక్క చైతన్యమే) తెలుసు- దీనివల్లనే మనం వస్తుజాలాన్ని చూస్తాం(3.11).

## 'నేనున్నాను' నుండి 'నేనిది' వరకూ

మెలకువ వస్తూండగా చైతన్యం మనస్సుకి, దాని నుంచి దేహానికి, వ్యాపించినప్పుడు మనం దేహంతో ఉన్నామన్న ఎరుక కలుగుతుంది. 'నేనున్నాను' అంటే ఇదే. చైతన్యమనే తెరమీద లోకమనే ఆకాశము, అందులోని వస్తుజాలమూ, కనబడుతాయి. ఆ లోకంలో ఒక దేహం ఉన్నట్టు తెలుస్తుంది. (ఏదైనా శబ్దమైతే వినటం, ఎవరైనా మనల్ని ముట్టుకుంటే తాకినట్టు తెలియడం- ఇవన్నీ మన ప్రయత్నం లేకుండానే జరుగుతాయి. అవి వ్యక్తిగత లక్షణాలు కావు. అయినా నేనే శ్రోతని, నేనే ద్రష్టనీ అని మనం తప్పుగా భావిస్తాం). "నేనున్నాను" అనే చైతన్యం ఆ దేహంతో తాదాత్మ్యం చెందినప్పుడు చిత్-జడ గ్రంధి ఏర్పడుతుంది- ఇది చైతన్యానికీ, జడ ప్రదార్థమైన దేహానికీ మధ్య ఏర్పడే ముడి. ముడి యేర్పడకమునుపు వున్న చైతన్యపు కాంతిని 'అహం వృత్తి' అనీ,

దేహంతో ముడిపడినపుడు అహంకారమనీ లేదా అహంత అంటారు. 'నేను ఉన్నాను' అనే పరివర్తన కాంతి ఒక శరీరాన్ని (ఒకరూపాన్ని) పట్టుకొని 'నేను ఇది' (నేను ఈశరీరాన్ని) అంటుంది. అది దేహంతో ఏకమై, మెలుకువ స్థితిలో కలిగే శరీరం నేననే భావనతో, మనం అనే 'నేను'గా వ్యవహరిస్తుంది. అందువల్ల అహంకారానికి రెండు అంశాలున్నాయి. ఒకటి చైతన్యము, రెండవది జడమైన దేహము. మనవ్యవహారాలన్నిటిలోనూ 'నేను' విషయిఅవుతుంది, అది గ్రహించేవస్తు విషయములవుతాయి. ఈ 'నేను' 'అసలైన నేను' కాదంటారు శ్రీభగవాన్- దేహంతో కలిసి ఉండటం వల్ల అది కలుషితమైంది. అపరిమితమైన విశ్వచైతన్యం ఒకానొక రూపానికి పరిమితమై ఉపాధిగతమై వ్యక్తిగా రూపొందుతుంది(3.12). దేహమూ, చైతన్యమూ ఒకటే కావు– అయినా ఈ విధంగా ఉపాధిగతం అవటం జరుగుతుంది. భ్రమే అయిన ఒక వ్యక్తి చిత్రంగా ఉదయిస్తాడు. "ఇది", అంటే ఈ అహంకారం, దేనినో పట్టుకోకుండా ఉండలేదంటారు శ్రీభగవాన్. అహంకారమొక గొంగళీపురుగు వంటిది, మరొకటి దొరికే వరకూ మొదటి దాని పట్టుని విడువదు. ఆపట్టుకున్న వస్తువు మనస్సులో ఉదయించే భావమైనా కావచ్చు, లేక బయట ఏదో వస్తువైనా కావచ్చు.

దేహంతో తాదాత్మ్యం చెందడం వల్ల ఈ 'నేను' అనేది దేహపు కార్యకలాపాలన్నీ తనవే అని తప్పుగా భావిస్తుంది. అందువల్లే 'నేను పయనించాను', 'నేను నడుస్తున్నాను' వంటివన్నీ అంటుంది. మనం 'నేను' అనేది అహంకారం లేదా అహంత సేకరించుకొన్న అభిప్రాయాల మూట మొత్తమూ అన్నమాట. ఇది పేర్లు, సంబంధాలు, సుఖ దుఃఖాల అనుభవాలు ఇత్యాది సంస్కారాల సముదాయ స్వరూపము. దానికున్న జ్ఞానమంతా ఇంద్రియాల ద్వారా బయట నుండి సంపాదించినదే. తన మూలమైన చైతన్యం గురించి దానికి తెలియదు.

ఇట్లా ఉపాధిగతం కాని దశలో 'నేను' నిర్మలం. అది దేహంతో తాదాత్మ్యం చెందలేదప్పటికి. పసి బిడ్డలో ఈ విధమైన ఉపాధిగత స్థితి ఏర్పడని దశలో అహంకారం ఉండదు. అప్పటికింకా అభిప్రాయాలేర్పడవు. శ్రీభగవాన్ ఇలా చెప్పారు: "ఒక విధంగా చూస్తే పసివాడు, జ్ఞాని ఒకే విధంగా ఉంటారు, ఏదైనా జరిగితే

పసివానికి దానిపై ధ్యాస అదేదో జరుగుతున్నంత సేపే ఉంటుంది. అది అయిపోయిన తరువాత పసివాడు దాని గురించి ఆలోచించడు. అదివాని మనస్సు మీద పని చేయదు. ఎందుకంటె, పసివాని మీద ఏ ముద్ర పడలేదు- జ్ఞానికీ ఇంతే" (1.15)

## దేహం గురించి ఎరుక, పృథక్ (వ్యక్తిత్వ) భావం బలమవడం

ఉపాధిగతమవడం వల్ల కొన్ని అనుభవాలు అంటే, ఆకలి, దాహం, శారీరిక బాధ- ఇంద్రియాల ద్వారా పొందిన ఇతర అనుభవాల ద్వారా- ఆ వ్యక్తిత్వం బలపడుతుంది. (దీనినే ప్రభావిత మనస్సంటారు). పిల్లవాడిని తల్లి కొడితే నొప్పి కలిగి ఏడుస్తాడు. కాని, ఆ విషయాన్ని మరచిపోయి మళ్లీ అదే పని చేయవచ్చు. వ్యక్తిత్వమనేది అతనిలో ఇంకా ఏర్పడలేదన్నమాట. కాని తల్లి మళ్లీ మళ్లీ కొట్టే దెబ్బల వల్ల నొప్పి కొన్నాళ్ళకి భరింపరానిదవుతుంది, దానికి కారణం 'అహంవృత్తి'. దేహపు బాధ గురించిన ఎరుక కలిగి దాని పట్ల అయిష్టత కలుగుతుంది. దెబ్బలు తగులుతుండటం వల్ల 'నేనీ దేహాన్ని' అనే భావం పసివానిలో ధ్రువపడుతుంది. దెబ్బల వల్ల కలిగిన నొప్పి, స్మృతిలో నిలిచిపోతుంది. దానిని జ్ఞాపకం తెచ్చుకుంటే బాధ కలుగుతుంది.

దేహానికీ, చైతన్యానికీ గల బంధం వల్ల వ్యక్తిత్వ భావం ఏర్పడుతుంది. దేశము, కాలము అనే భ్రమలు దీనిని బలపరుస్తాయి. ఈ దశలో, 'నేను దేహాన్ని, నాకొక పేరుంది, లోకంలో నాకొక స్థలముంది, నాకు గతం, భవితవ్యం ఉన్నాయి'- వీటన్నిటి సమూహాముగా తయారవుతుంది ఆ 'నేను' అనేది. ఎవరినైనా 'మీరెవరు' అని అడిగితే అతను, నేను ఫలానా, 15 డిశంబరు 1950న హైదరాబాదులో పుట్టాను. ఫలానా వారి కుమారుణ్ని, అంటూ ఇతర వివరాలు చెప్తాడు. తన గురించి ఇంకే విధంగానూ చెప్పలేడతను. అహంవృత్తి, అహంకారంగా రూపొందటం వల్లనే 'నేను' 'అతడు' 'ఆమె' 'అది' అన్నీ ఉదయిస్తాయి, లోకం సత్యంగా కనబడుతుంది.

### స్వప్నావస్థ

చైతన్యపుకాంతి మనస్సుకే పరిమితమైనప్పుడు- స్వప్నావస్థ ఏర్పడుతుంది. స్వప్నం,

కలగనే వాని మెదడులో (అంటే మనస్సులో) ఉంటుంది. జాగ్రదవస్థలో బాహ్యావస్తుజాలపు స్థూలరూపాలకి సంబంధించిన అభిప్రాయాలను సేకరించుకుంటాం. అట్లా సేకరించబడినవి, స్వప్నంలో, (3.51) స్మృతులుగా వ్యక్తమవుతాయి.

## మనస్సు యొక్క యథార్థస్థితి

స్వప్నంలో ఏం జరుగుతుందో చూద్దాం. గాఢనిద్రలో మనస్సే ఉండదు. కలగనేవ్యక్తి తననీ, (అంటే అహంకారాన్ని, ద్రష్టని) పరిసరాలనీ సృష్టించుకుంటాడు. స్వప్నం ముగియగానే అవన్నీ అతనిలోకే ఉపసంహరింపబడుతాయి. ఏకం, అనేకమైందన్నమాట (3.10). ఒక పెట్టెలో వేటినైనా పెట్టాలంటే ఆ పెట్టెలో చాలినంత జాగా ఉండాలి. లేకపోతే ఆ వస్తువులు ఇమడవు. కలలో మన మనస్సు కల్పించే ఆకాశంలో (స్థలంలో) మనమొక లోకాన్ని చూస్తాము. అందులో మనో కల్పితమైన మన సూక్ష్మ శరీరమూ, ఇతర వస్తుజాలమూ ఉంటాయి. అందువల్ల, వీటినన్నిటినీ ఇముడ్చుకోగలిగిన మనస్సు కూడా ఒక ఆకాశం వంటిదే అయి ఉండాలి.

కలలో ఉండగా పైన చెప్పినవన్నీ అంటే, స్థలము, శరీరము, వస్తువులు, ఇతరులు, మనస్సులో ఉన్నా, కల నుండి మేల్కొనగానే మనిషి తన కలలోని దేహంతో మాత్రమే తాదాత్మ్యం చెందుతాడు. ఉదాహరణకి, ఒకడు కల నుండి మేల్కొనగానే "కలలో, నేను తిరువణ్ణామలైలో ఉన్నాను, అరుణాచలగిరి ప్రదక్షిణని ఫలానావాళ్లతో చేశాను" అంటాడు. మేల్కొన్నప్పుడు తిరువణ్ణామలై, అరుణాచలం, తన దేహమూ, ఇతరులూ కూడ కలలో, తనలోనే ఉన్నారని గ్రహించడు. మేల్కొని ఉన్నప్పుడు ప్రపంచం తనకు భిన్నంగా ఉన్నట్టే స్వప్నావస్థలోని ప్రపంచం అట్లాగే తనకు భిన్నంగా ఉందనే అనుకుంటాడు. కలలోని వన్నీ తనలోనే ఉన్నాయనీ, తనలో లేస్తున్నాయనీ జ్ఞాపకం ఉంచుకోడు. మేల్కొని ఉన్నప్పుడు మాత్రం అతడు ఒక దేహంతోనే తాదాత్మ్యం చెందుతాడు కాబట్టి తాను వేరూ, ప్రపంచం వేరుగానూ కనబడుతాయి. మేల్కొని ఉండగా ఏర్పడిన ముద్రలే కలలోని అనుభవాలుగా మారుతాయి. జాగ్రదవస్థలోనైనా,

స్వప్నావస్థలోనైనా ప్రధానంగా మనస్సు, కేవలం ఆకాశమే (3.22). దీనినే చిత్తాకాశమనీ లేక మనోకాశమనీ అంటారు.

మనం మేల్కొన్నప్పుడు కూడా మనస్సు లేస్తుంది. ఆకాశం లేస్తుంది. చిత్తాకాశంలో స్థూలశరీరమూ, ఇతర వస్తుజాలమూ కనబడినట్లు అనిపిస్తాయి. వాస్తవానికి, మనమే ఆ ఆకాశమూ, అందులో మనం చూచేవన్నీను. కాని ఒక దేహానికీ పరిమితం చేసుకున్నాం కాబట్టి ఇతరమైనవన్నీ దానికి వెలుపల ఉన్నాయనుకుంటాము.

స్వప్నావస్థ గురించి అధ్యయనం చేయటం వల్ల మనకి తెలిసేది యిది: మనస్సు ఉదయించినప్పుడే లోకం కూడా ఉదయిస్తుంది, అట్లాగే మనస్సు అణిగిపోతే లోకం కూడా అణిగిపోతుంది. ఆ విధంగా చూస్తే లోకం మనస్సుచే కల్పింపబడినదే అని తెలుస్తుంది (2.08, 3.22). మనస్సు ఉదయించి, అస్తమించేది చైతన్యంలోనే. ఆ చైతన్యమే మనం(2.01,3.19).

మనోనాశనమైతే ఆత్మసాక్షాత్కారమవుతుందంటారు. దీని అర్థం మనం చూచే ఆకాశమూ, వస్తుజాలమూ మాయమైపోతాయని కాదు, ఆ ఆకాశంలో మనం దేహంతో తాదాత్మ్యం చెందటం నశిస్తుందనే. ఆత్మ సాక్షాత్కారమైన తరువాత నేను వేరు, ఇతరములు వేరు కావని తెలుస్తుంది. సర్వం మనమే అనే ఎరుక కలుగుతుంది. అహంవృత్తి వల్లనే ఇతర ఆలోచనలన్నీ ఉదయిస్తాయని శ్రీభగవాన్ అంటారు. "ఎండమావి అని తెలిసినా, ఎండమావి మాయమైపోదు. ఆ దృశ్యముంటుంది. కాని నీటి కోసం దానివైపు మనిషి పరుగెత్తడు. లోకమే మిథ్య. ఇది తెలిసిన తరువాత కూడా ప్రపంచం కనబడుతుంది కాని అది బ్రహ్మమే అనీ, వేరే ఏమీ కాదనీ తెలుసుకోవాలి" (3.35).

స్వప్నావస్థలో ఒక విచిత్రముంది. విశ్వమంతా మనలోనే కనబడినా మనం మాత్రం ఒక దేహంతోనే తాదాత్మ్యం చెంది, మిగిలినవన్నీ మనకన్న వేరుగాచూస్తాం. ఇదే 'మాయ' అంటే- మేల్కొని ఉన్నప్పుడు కూడా ఈ మాయనే అనుభవిస్తాం. ఈ 'మాయ' ఎట్లా కలుగుతుంది? అహంవృత్తి దేహంతో తాదాత్మ్యం చెందడం వల్లనే.

## అహంవృత్తి అంటే ఏమిటి?

'నేను' అనే దాని గురించిన అవగాహనలో మనకి గందరగోళం ఉంది. మనం స్వయం గురించి అనుకునేది కేవలం ఒక ఊహ మాత్రమే. స్వప్నావస్థ 'అహంవృత్తి' అంటే ఏమిటో తెలుసుకోవడానికి దారి చూపుతుంది. కలలో మనిషి ఒక దేహంతో తాదాత్మ్యం చెంది, కలలో కనబడే ఇతరులతో వ్యవహారాలు నడుపుతాడు. గాఢ నిద్రలో దేహం పరుపు మీద పడుకునివుంది, ఇంకేమీ చేయదు. కానీ కల, మనస్సులో జరిగేది స్థూల శరీరంలో దాని ఫలితాలు తెలుస్తాయి. కలలో 'నేను'కి కలిగే బాధ, కలలోని దేహానికి అనుభవమవుతుంది, ఆ తరువాత స్థూల శరీరానికి కూడ అనుభవమవుతుంది. కలలో ఉన్నవాడు భయంతో, ముచ్చెమటలతో మేల్కొంటాడు. కలలోని 'నేను', కలలోని 'దేహము', వాటికి స్థూల శరీరముతో గల సంబంధమూ– అన్నీ ఒకటేనని స్వప్నంలో తెలుస్తుంది. మేల్కొని ఉండగా మనస్సుపై బడిన స్థూల శరీరపు ముద్రే కలలోని దేహం కూడా. (ఉదాహరణకి:– డెబ్బై సంవత్సరాల వృద్ధుడు స్కూలులోని స్నేహితులతో కలిసి ఫుట్‌బాల్ ఆడుతున్నట్లు కలగనవచ్చు. నిద్ర మేల్కొగానే "నేను బడిలో విద్యార్థినని, స్నేహితులతో బంతి ఆట ఆడాననీ కలగన్నాను" అంటాడు. అంటే ఆ వృద్ధుడు బడి పిల్లవానితో తాదాత్మ్యం చెందాడన్నమాట). దీనినిబట్టి మనకి తెలిసేది ఇది: మనస్సులో 'నేను' అని మనం అనుకునేది, నిజానికి దేహమే. మన అభిప్రాయాలన్నిటినీ సినిమాలాగ తీసి, ఆ సినిమాని మనం చూస్తుండటం వంటిదే స్వప్నానుభవం కూడా. మేల్కొని ఉన్న స్థితిలో 'నేను దేహాన్ని' అనే అభిప్రాయముండటం వల్ల కలలో కూడా అదే కనబడుతుంది. (ఈ భావం, పసితనం నుండి పెరుగుతూన్నప్పుడు కలుగుతుంది.) 'నేను' అనేప్పుడు మనం దేహం గురించే మాట్లాడుతున్నామని మనం గ్రహించం. మేల్కొన్నప్పుడైనా, కలగంటున్నప్పుడైనా 'నేను' కి బాధ కలిగితే అది భౌతికకాయంలో కనబడుతుంది. 'నేను' అని మనం చెప్పుకునేది 'నేను ఈ దేహాన్ని' అనే భావమే. కలలో ప్రపంచం మనలో ఉదయించినట్లే మేల్కొని ఉన్న స్థితిలో కూడా జరుగుతుంది. కాని, ఈ "దేహాన్ని నేను" అనే భావం వల్ల మనలోనే దృశ్యమానమై గోచరమౌతున్న ప్రపంచాన్ని మనకి వెలుపల ఉన్నదనుకుంటాం. లోకంలో మనం లేము, నిజానికి లోకం మనలో ఉంది.

## ఆత్మని ఇంద్రియాల ద్వారా దర్శించాలని తప్పుగా అన్వేషిస్తాం

మేల్కొని ఉండగా ఇంద్రియాల ద్వారా సేకరించినదే మన జ్ఞానమంతా. దేని గురించైనా తెలుసుననో, తెలియదనో అన్నప్పుడు మనం సూచించేది మనం ఇంద్రియాల ద్వారా గ్రహించామనో, గ్రహించలేదనో మాత్రమే. గాఢ నిద్ర నుండి మేల్కొన్నప్పుడు మనం 'మంచి నిద్ర పట్టింది, నా చుట్టూ ఏం జరిగిందో నాకు తెలియలేదం'టాము. దీని అర్థమేమిటి? మేల్కొని ఉన్న స్థితిలోవలె నిద్రలో ఇంద్రియాల ద్వారా ప్రపంచాన్ని అనుభవించలేదనే. అట్లాగే 'నాకు ఆత్మ అంటే ఏమిటో తెలియదంటాం'. దీని అర్థమేమిటి? ఇంద్రియాల ద్వారా ఆత్మని గ్రహించలేదని, అందువల్ల ఆత్మ గురించి తెలియదనీను. నిద్రలోని 'నేను,' ఆత్మ. మేల్కొని ఉన్నప్పుడు కూడా 'నేను' ఆత్మే. దేహంతో తాదాత్మ్యం చెందడం వల్ల (అంటే నిద్రలో అయినా, మేల్కొని ఉన్నప్పుడైనా) విషయ జ్ఞానం మీదే ఆధారపడుతాం. విషయ జ్ఞానముంటే 'నాకు తెలుసు'నంటాం. అది లేకపోతే తెలియదంటాం.

బయటి వాటినన్నిటినీ మనస్సు ద్వారా, ఇంద్రియాల ద్వారానే తెలుసుకోవడానికి అలవాటుపడిపోయాం కాబట్టి, ఆత్మని కూడా ఆ విధంగానే చూడాలని కోరుతామంటారు శ్రీభగవాన్. వారిట్లా అంటారు: "ఆత్మ నాకు తెలియటం లేదు" అన్నప్పుడు మీ ఉద్దేశం సాపేక్షజ్ఞానం (అంటే మనస్సూ, ఇంద్రియాల ద్వారాతెలియటం) లేదు అని భావం. దీనికి కారణం సాపేక్షజ్ఞానానికి అలవాటుపడిపోయి, దానితోనే తాదాత్మ్యం పొందటం (3.15). ఉన్నదల్లా ఒక్క చైతన్యమే, అదే అహంవృత్తిగా దేహంతో తాదాత్మ్యం చెందుతుంది. ఆ తరువాత కళ్లద్వారా బయటకుప్రసరించి, చుట్టూ ఉన్న వాటిని చూస్తుంది. మేలుకొని ఉన్న స్థితిలో వ్యక్తి దేహంతో తాదాత్మ్యం చెందుతాడు, అందువల్ల ఆత్మని వేరేగా చూడాలని అనుకుంటాడు.(3.38)

ఈ తప్పుడు తాదాత్మ్యం ఒక అవరోధంగా మారి స్వయం విదితమైన ఆత్మని మరుగు పరుస్తుంది- ఆత్మ వేరుగా చూడగలిగే వస్తువు కాదు కాబట్టి. ఇంద్రియాల ద్వారా తెలిసినదే ప్రామాణికమని అనుకుంటాం. దీనివల్ల ద్రష్టా, దృశ్యమూ, దృష్టీ అన్నీ ఒక చైతన్యపు అభివ్యక్త రూపాలే అని అర్థం చేసుకోలేము, ఒప్పుకోము.చింతన, ఆత్మ ఒక దృశ్యంగా చూడాలి అనే భావాన్ని అధిగమించగలదు.

అసలు కనబడేది అంటూ ఏమీ లేదు. తానెవరో తెలిసికోవడానికి అర్థం అయినా లేదుకదా. ఎరుకే 'నేను'- అని అనుభవపూర్వకంగా తెలుసుకోవాలి. శ్రీభగవాన్ ఇట్లా అంటారు: ఏదో కొత్తదాన్ని చూచినట్టు ఆత్మని కూడా చూడాలనుకుంటారు. కాని ఆత్మ అనాది, ఎప్పుడూ అట్లాగే ఉంటుంది. ఆత్మని తేజోమయంగా చూద్దామనుకుంటారు. అదెట్లా సాధ్యం? అది తేజస్సుకాదు, తమస్సూ కాదు. అది ఉంటుంది అట్లాగే. దానిని నిర్వచించలేం. పరమోత్తమమైన నిర్వచనమిదే: "నేను నేను-ఉన్నాను". శృతులు ఆత్మ అంగుష్టమాత్రమంటాయి. లేక కుశాగ్రమంటాయి, లేక విద్యుత్కణమనో, మహనీయమనో, సూక్ష్మాతి సూక్ష్మమనో అంటాయి. ఈ వర్ణనలన్నీ నిరాధారాలు. అది కేవల "సత్ మాత్రమే" (స122).

అందరూ ఆత్మే అయినా ఇంకా ఆత్మసాక్షాత్కారం కావాలని ఎదురు చూస్తారు, దీనికి కారణం వారు తప్పుగా దేహంతో తాదాత్మ్యం చెందడమేనంటారు శ్రీభగవాన్. మనకి ఇంద్రియాల ద్వారా లభించిన జ్ఞానం గురించి గొప్పగా అనుకుంటాం, కాని వాస్తవమేమిటంటే ఈ జ్ఞానమే మనలని 'ఆత్మ'గా ఉండనీయదు. 'నాకు ఇంద్రియాల ద్వారా కాకుండా ఉన్న జ్ఞానమేదైనా ఉందా?' అని మనల్ని మనం ప్రశ్నించుకుంటే, నిరుత్తరలమవుతాం. మన రూపము, నామము, అనుభవాలూ, మనమెరిగిన వ్యక్తులూ, ప్రదేశాలూ, మనకున్న జ్ఞానమూ, ఇట్లాగే ప్రతిదీ- ఇంద్రియాల ద్వారా సంపాదించినదే. వీటినన్నిటినీ కాదని, ఇంద్రియేతరంగా ఉన్న జ్ఞానాన్ని అన్వేషిస్తే మనకి గల ఎరుక గురించి మనమెరుగుతాం. ఆత్మని, అంటే ఆలోచనారహితమైన చైతన్యాన్ని అనుభవసిద్ధం చేసుకుంటాం.

**నిద్రావస్థ**

నిద్ర= చైతన్యం+ నిద్ర, అంటారు శ్రీభగవాన్ (3.04).

నిద్ర అంటే యిది: ఆత్మ, ఎల్లప్పుడూ ఉండే కేవల చైతన్యంగా ఉండి, ఇతరమైన వాటిని గ్రహించే సాధనాలు అంటే, మనస్సూ, ఇంద్రియాలూ లేని స్థితి. అంటే,మెదడు

నుంచి చైతన్యపు కాంతి ఉపసంహరింపబడి, అది తన మూలంలో ఉన్నప్పుడు, తల వాలిపోతుంది. అహంకారం యొక్క శరీర తాదాత్మ్యంపోతుంది. లోకమూ, మనస్సూ మాయమవుతాయి. పరివర్తితమైన కాంతి (అంటే మనస్సు) ఉండదు. ఇంద్రియాలుండవు, దేహం ఉండదు (అంటే దేహంతో తాదాత్మ్యం చెందే అహంకారముండదు). ఈ విధంగా చూస్తే మనస్సు నిర్జీవమనీ, తాత్కాలికమనీ, చైతన్యపుకాంతిపై ఆధారపడినదనీ తెలుస్తుంది. చైతన్యపు కాంతి పని చేసినప్పుడే అది సజీవమవుతుంది. అంటే మేల్కొన్న స్థితిలో ఉన్నప్పుడు కలిగిన ముద్రలు, ఇతరత్రా గ్రహించినవీ కూడా గాఢ నిద్రలో పూర్తిగా మాయమైపోతాయి. మనస్సుగాని దేహంగాని లేకుండా శుద్ధచైతన్యమే గాఢ నిద్రలో ప్రకాశిస్తుంది. అందువల్ల తనకీ, ఇతరమైన వాటికీగల భేదం ఉండదు. ఇంద్రియాలూ, మనస్సూ లేని సుషుప్తి అవస్థలోని చైతన్యం- మబ్బుపట్టిన చీకటిలో కళ్లు తెరుచుకొని ఉన్నా చీకటిని తప్ప ఏ వస్తువునీ విడిగా చూడలేని మనిషి వంటిది అంటారు, శ్రీభగవాన్. ఉండేదల్లా ఆ చీకటే. అతడు సుషుప్తిలో అజ్ఞానం యొక్క ఎరుక కలిగి ఉంటాడు. ఆత్మనుండే లోకం ఉదయించడమూ, మాయమైపోవడమూ సాలీడు తన గూడుని అల్లుకొని తనలోకి తిరిగి తీసుకోవడం వంటిదేనంటారు శ్రీభగవాన్.

## చైతన్యం మూడు అవస్థలకూ సాక్షి

ఈ లోకాన్ని ఇప్పుడు ఎవరు చూస్తున్నారని ప్రశ్నించుకుంటే 'నేను' అనే సమాధానం వస్తుంది. నిద్రపోతున్నవాడు మాత్రం 'నేను నిద్ర పోతున్నానని' అనడు. అట్లాగే కలగనే వాడు కూడా తాను కలగంటున్నట్టు చెప్పడు. మేల్కొన్నవాడే 'నేను నిద్రపోయాను', 'నేను కలగన్నాను' అని అంటాడు. అంటే ఈ మూడు అవస్థలూ మేల్కొని ఉన్న అహంకారం యొక్క ఆలోచనలే. కలలోనూ, నిద్రలోనూ కూడా నేను (తాను) ఉంటుంది కాని ఆ అవస్థలలో ఆ అవస్థల ఎరుక ఉండదు దానికి. మేల్కొని ఉన్నప్పటి 'నేనే' నిద్రలోనూ, కలలోనూ ఉన్న 'నేను'తో తాదాత్మ్యం చెంది, ... చేసుకుంటుంది. ఆ రెండు అవస్థలకీ తాను సాక్షిగా

వ్యవహరిస్తుంది. కాని విచిత్రమేమిటంటే మేల్కొని ఉన్నవాడు మాత్రం స్వప్నావస్థకి తాను సాక్షిననీ, ఆ కలలో కనబడిన ప్రపంచమంతా తనలోనే ఉందనీ తాను కేవలము కలలోని ఒక దేహము మాత్రమే కాదని మరుస్తాడు. సాక్షి యొక్క దృష్టి మెలకువలో అహం భావం వల్ల మసకబడుతుంది. దీనికి కారణం ద్రష్టకీ, దృశ్యానికీ దాని వల్ల ఏర్పడే భేదభావమే. ఉదాహరణకి: 'కలలో నేను తిరువణ్ణామలైలో ఉన్నాను, ఇప్పుడు చెన్నైలో ఉన్నాను' అనవచ్చు. తాను దేహం కానని గ్రహిస్తే, తాను ద్రష్టని కాననీ జాగ్రదవస్థకి సాక్షినని తెలుస్తుంది. కాని, సాక్షిననే భావం గూడా మనస్సులో ఉన్నదే అని (2.13 స.180), ఈ సాక్షిననే భావాన్ని కూడా దాటాలి. సత్యమేమిటంటే గాఢనిద్రలో వలెనే, సదా 'తాను' మాత్రమే ఉంది. మూడు అవస్థలూ మరల మరల వచ్చి పోతున్నా, వాటి ఎరుక లేకుండా, అధిష్ఠానంగా ఎప్పుడూ ఉండేది 'తాను' అనే చైతన్యమే.

శ్రీభగవాన్ ఇట్లా సెలవిచ్చారు "ఆత్మే నిద్రలో, కలలో, మెలకువలో కూడా సాక్షి. ఈ మూడు అవస్థలూ అహంతకి సంబంధించినవి. ఆత్మ, అహంతని అధిగమిస్తుంది. నిద్రిస్తున్నప్పుడు నీవు లేవా! అప్పుడు నిద్రిస్తున్నట్టుగాని, నిద్రలో ప్రపంచం తెలియదన్నట్టుగాని నీవెరుగుదువా? మేల్కొన్నప్పుడే నిద్రావస్థలో దేని ఎరుకాలేదని అనగలవు. అంటే నిద్రలోని చైతన్యమూ, మేల్కొన్నప్పటి చైతన్యమూ ఒక్కటే. ఈ జాగ్రదవస్థలోని చైతన్యమేమిటో తెలిస్తే, మూడు అవస్థలకు సాక్షిగాఉన్న చైతన్యమంటే ఏమిటో తెలుస్తుంది. ఆ చైతన్యాన్ని గ్రహించాలంటే, నిద్రలో ఉండే చైతన్యాన్ని అన్వేషించాలి (2.12).

## ఆత్మసాక్షాత్కార స్థితిని అర్థం చేసుకోవడం

మేల్కొన్న అవస్థలో, దేహమూ– మనస్సులపై ప్రసరించే చైతన్యపుకాంతి దేహంతో తాదాత్మ్యం చెందని స్థితిని తురీయమంటారు. తురీయావస్థలో, చైతన్యం ఉపాధిగతమవ్వదు కాబట్టి వ్యక్తిత్వ భావం కూడా ఉండదు. తురీయావస్థలో ఉన్నా, పృథక్ భావమున్నా లోకం కనబడుతూనే ఉంటుంది. ఎటొచ్చీ, తురీయావస్థలోని మనిషి, లోకాన్ని తనలోనే గోచరిస్తున్న రూపంగా చూస్తాడు. పృథక్ భావయుతుడు

లోకాన్ని తనకి బయట ఉన్న దానిగా చూస్తాడు. "దేహంతో తప్పుడు తాదాత్మ్యంపోతే, సత్యం యొక్క నిత్యత్వం గోచరిస్తుంది" (స. 46). శ్రీభగవాన్ ఇంకా ఇట్లా అంటారు: "అన్నిటికన్నా వింత ఏమిటంటే, మనమే సత్యమై ఉండి, దానిని సంపాదించడానికి ప్రయత్నిస్తాం. ఆ సత్యాన్ని మననుంచి మరుగుపరచేదేదో ఉందనీ, దానిని ధ్వంసం చేయాలనీ అనుకుంటాం. ఇది హాస్యాస్పదం. ఇప్పటి నీ ప్రయత్నాలని తలచుకొని నీవే నవ్వుకొనే రోజు ఎప్పుడో వస్తుంది. నువ్వు అట్లా నవ్వుకోవలసిన దినం ఇప్పుడే, ఇక్కడే ఉంది" (స. 146).

## దేశకాలాల భ్రమ*

దేశకాలాల భ్రమ గురించి చర్చించడంలో ఉద్దేశమిది. వాటికి మూలం మనస్సులోనే ఉందనీ, మన దృష్టిని ఆ మనస్సు నుంచి ఆత్మవైపు మళ్లించాలనీను. ఈ భ్రమని రెండు కోణాల నుంచి చూడాలి. మొదటిది, ఏ భావమూ ఉండని మన కేవల స్థితి నుంచి - ఆ స్థితిలో మనస్సూ, ప్రపంచమూ ఉదయించవు. అట్లాగే దేశకాలాల గురించి ఏ భావమూ కూడా ఉండదు. రెండవ కోణమిది: జాగృత్ స్వప్నావస్థల నుండి- ఈ రెండింటిలోనూ దేశకాలాలుంటాయి, ప్రపంచం కనబడుతుంది. ఈ అవస్థలలో కూడా ఇవి మనం దేహంతో తాదాత్మ్యం చెందినంతసేపే ఉంటాయి. స్వప్నావస్థలో మనం గమనించినట్టు విశ్వమంతా మనలోనే ఉండి, మేల్కొన్నప్పుడు మాత్రం దానిని భిన్నమైనట్టుగా, తప్పుగా, జ్ఞాపకం తెచ్చుకుంటాం. అంతేకాకుండా మేల్కొని ఉన్నప్పుడే ఎవరైనా 'నేనిప్పుడు, ఇక్కడ ఉన్నాను' అనగలడు. గాఢనిద్రలో తానున్న ప్రదేశం గురించిగాని, తన ఉనికి గురించిగాని ఏవిధమైన అనుభవమూ ఉండదు. మేల్కొని ఉండగా మనస్సుని నిశ్చలం చేసినప్పుడు దేహంతో తాదాత్మ్యం సమసిపోయినప్పుడూ- దేశంలో ఏకత్వం తిరిగి వస్తుంది. ప్రపంచం కనబడుతుంది. కాని నేను వేరు, ప్రపంచం వేరు అనే విభేదముండదు. తురీయావస్థలో దేశకాలాలభ్రమ ఉండదు.

* దేశము అన్నమాట అన్ని వస్తువులూ వుండటానికి ఆధారమైన ఆకాశము (space) అన్న భావంలో ఉపయోగించబడింది.

శ్రీభగవాన్ ఉన్నది నలుబదిలో (16వ సూత్రంలో) ఇట్లా అంటారు: "మనము ... కాలమేది? దేశమేది? మనము దేహమనినచో కాలదేశములకు లోబడగలము. మనము దేహమా? మనము ఇప్పుడు అప్పుడు ఎప్పుడు ఒకరము. ఇక్కడ, అక్కడ, ఎక్కడ ఏకమే. కనుక కాలదేశములు లేని మనమే ఉన్నారము"

ఇంకా ఇట్లా అంటారు శ్రీభగవాన్: "నిద్రలో కాలంగాని దేశంగానిలేవు. అహంవృత్తి ఉదయించిన తరువాతే ఆ భావాలు ఉదయిస్తాయి. అహంవృత్తి తలెత్తక ముందు ఏ భావాలూ ఉండవు. అందువల్ల నీవు, దేశకాలాతీతుడవు. అహంవృత్తి కేవలం పరిమితమైన 'నేనే'. నిజమైన 'నేను'– అపరిమితము, విశ్వమయము, దేశకాలాతీతము. నిద్ర నుండి మేల్కొంటూండగా బయటి ప్రపంచాన్ని చూడకముందు ఎరుక ఉంటుంది, అదే నీ శుద్ధాత్మ. దానిని తెలుసుకోవాలి" (3.23).

ఒక మహిళ, శ్రీభగవాన్‌తో తాను భారతదేశానికి వచ్చాననీ, వారు కూడా యూరప్‌కి రావాలనీ చెప్పగా, భగవాన్ ఆమె దృక్పథాన్ని తప్పుపడ్తూ ఇచ్చిన సమాధానమిది: "దేశమనేది మీ మనస్సులో ఉంది. అందులోనే భారతదేశం ఉంది" (2.08).

ఒక కాగితంలో ఒక బెజ్జం పెట్టి కాగితాన్ని చూద్దాం. ఆకాశం కాగితం వెలుపల, కాగితంలోని బెజ్జంలోనూ కనిపిస్తుంది. ఆ బెజ్జపు ఆకాశం కాగితంలో ఉందా, కాగితం బయటా అని ప్రశ్నిద్దాం. కాగితాన్ని తీసేసి చూస్తే ఆకాశం బెజ్జమనేది లేకుండా అంతా ఒకటిగానే కనబడుతుంది. అప్పుడు ఆ బెజ్జపు ఆకాశం కాగితంలోనే ఉందనే భ్రమకి కారణం కాగితమని గ్రహిస్తాం. అదేవిధంగా అవిభక్తమైన చైతన్యంలో, 'నేను దేహాన్ని' అనే భావం లోపలాబయటా అనే విభజనని కలిగిస్తుంది– అదే నా దేహం లోపలా, వెలుపలా అనే భావాన్ని కలిగించి నాకూ, ప్రపంచానికీ భేదాన్ని కూడా కలిగిస్తుంది.

"చైతన్యం ఎప్పుడూ, ఇక్కడా, ఇప్పుడూ ఉండే ఎరుకే" అంటారు శ్రీభగవాన్. వారింకా ఇట్లా అంటారు: "మనకి వర్తమానం తెలుసు, మనమున్నామనీ తెలుసు. ఈనాటికి సంబంధించినవే నిన్నా, రేపూను. 'నిన్న' జరుగుతున్నప్పుడు, దానిని అపుడు 'నేడు'

అంటాం. అట్లాగే 'రేపు' జరుగుతున్నప్పుడు దానిని అప్పుడు 'నేడు' అనే అంటాం. నేడు ఎప్పుడూ ఉండేదే. ఎల్లప్పుడూ ఉండేదే శుద్ధమైన ఉనికి. దానికి పూర్వాపరాలు లేవు. అటువంటప్పుడు వర్తమానం యొక్క అసలు నైజం కనుక్కొని ఆ సత్‌లో ఎందుకుండకూడదు? (4.01)

ఇప్పుడు జరుగుతున్న దానినే వర్తమానమనుకుంటాం. కాని శ్రీభగవాన్ వర్తమానమంటే కేవలం ఉనికేననీ అది కేవల చైతన్యమేననీ అంటారు. "వర్తమానం పూర్వకర్మ ఫలితమంటారు. ఆ గత కర్మ ఇప్పటి సంకల్పంతో దాటగలమా" అని శ్రీభగవాన్‌ని ఎవరో అడిగారు. దానికి మహర్షి ఇచ్చిన సమాధానమిది: "నేను చెప్పినట్టు వర్తమానమేమిటో గమనించు. గతం వల్ల ఏది ప్రభావితమైందో, దేనికి గతమూ, భవితవ్యమూ ఉన్నాయో అర్థమవుతుంది. అంతేకాక, ఏది ఎల్లప్పుడూ స్వతంత్రంగా ఉండేదో, ఏది గతం వల్లగాని, భవిష్యత్తువల్లగాని, గత కర్మవల్లగాని ప్రభావితం కాదో తెలుస్తుంది". సద్విద్య (ఉన్నది నలుబది సంస్కృతంలో) 15వ సూత్రంలో శ్రీభగవాన్ ఇట్లా అంటారు : వర్తమానమును బట్టియే భూతభవిష్యత్కాలములు నిలుచును. 'ఇప్పుడు' తత్త్వమునెరుంగుట అంటే సత్యాన్ని ఎరుగుటయే.

## గతం ఒక భావం మాత్రమే

ఇంద్రియాల ద్వారా కలిగిన ముద్రలు, స్మృతిలో ఉంటాయి. ఇదే గతమంటే. అవి కేవలం ఆలోచనలే గాని యథార్థం కావు. ఏదైనా తెలుసుననిగాని, తెలియదనిగాని మన మన్నప్పుడు మనం సూచించేది మనకి దేని గురించైనా ఇంద్రియాల ద్వారా కలిగిన అనుభవాలని స్మృతిలో ఉంచుకున్నందువల్లే. అందువల్ల గతం కేవలం ఒక భావం మాత్రమే. వర్తమానంలో, సద్వస్తువుగా అది ఉండదు. ఏ చైతన్యపు కాంతిలోప్రపంచాన్ని గ్రహించ గలగడం సంభవిస్తుందో, ఆ చైతన్యమే వర్తమానమంటే, దానిని ఉపసంహరిస్తే ఆ గ్రహింపు పోతుంది. ఇంద్రియాల ద్వారా గ్రహింపువున్నా లేకపోయినా, ఎప్పుడూ ఉన్నదే వర్తమానమంటే. గడియారం ప్రకారం ఈ నిమిషమే కాదు వర్తమానమంటే, అంతేకాక ఆ సమయంలో మనకి కలిగే గ్రహింపు కాదు.

అంటాం. అట్లాగే 'రేపు' జరుగుతున్నప్పుడు దానిని అప్పుడు 'నేడు' అనే అంటాం. నేడు ఎప్పుడూ ఉండేదే. ఎల్లప్పుడూ ఉండేదే శుద్ధమైన ఉనికి. దానికి పూర్వాపరాలు లేవు. అటువంటప్పుడు వర్తమానం యొక్క అసలు నైజం కనుక్కొని ఆ సత్‌లో ఎందుకుండకూడదు? (4.01)

ఇప్పుడు జరుగుతున్న దానినే వర్తమానమనుకుంటాం. కాని శ్రీభగవాన్ వర్తమానమంటే కేవలం ఉనికేననీ అది కేవల చైతన్యమేననీ అంటారు. "వర్తమానం పూర్వకర్మ ఫలితమంటారు. ఆ గత కర్మ ఇప్పటి సంకల్పంతో దాటగలమా" అని శ్రీభగవాన్‌ని ఎవరో అడిగారు. దానికి మహర్షి ఇచ్చిన సమాధానమిది: "నేను చెప్పినట్టు వర్తమానమేమిటో గమనించు. గతం వల్ల ఏది ప్రభావితమైందో, దేనికి గతమూ, భవితవ్యమూ ఉన్నాయో అర్థమవుతుంది. అంతేకాక, ఏది ఎల్లప్పుడూ స్వతంత్రంగా ఉండేదో, ఏది గతం వల్లగాని, భవిష్యత్తువల్లగాని, గత కర్మవల్లగాని ప్రభావితం కాదో తెలుస్తుంది". సద్విద్య (ఉన్నది నలుబది సంస్కృతంలో) 15వ సూత్రంలో శ్రీభగవాన్ ఇట్లా అంటారు : వర్తమానమును బట్టియే భూతభవిష్యత్కాలములు నిలుచును. 'ఇప్పుడు' తత్త్వమునెరుంగుట అంటే సత్యాన్ని ఎరుగుటయే.

## గతం ఒక భావం మాత్రమే

ఇంద్రియాల ద్వారా కలిగిన ముద్రలు, స్మృతిలో ఉంటాయి. ఇదే గతమంటే. అవి కేవలం ఆలోచనలే గాని యథార్థం కావు. ఏదైనా తెలుసుననిగాని, తెలియదనిగాని మన మన్నప్పుడు మనం సూచించేది మనకి దేని గురించైనా ఇంద్రియాల ద్వారా కలిగిన అనుభవాలని స్మృతిలో ఉంచుకున్నందువల్లే. అందువల్ల గతం కేవలం ఒక భావం మాత్రమే. వర్తమానంలో, సద్వస్తువుగా అది ఉండదు. ఏ చైతన్యపు కాంతిలోప్రపంచాన్ని గ్రహించ గలగడం సంభవిస్తుందో, ఆ చైతన్యమే వర్తమానమంటే, దానిని ఉపసంహరిస్తే ఆ గ్రహింపు పోతుంది. ఇంద్రియాల ద్వారా గ్రహింపువున్నా లేకపోయినా, ఎప్పుడూ ఉన్నదే వర్తమానమంటే. గడియారం ప్రకారం ఈ నిమిషమే కాదు వర్తమానమంటే, అంతేకాక ఆ సమయంలో మనకి కలిగే గ్రహింపు కాదు.

కాలమనే భావం మనస్సు లేచినప్పుడే కలుగుతుంది. నిద్రపోతున్నప్పుడు అన్ని భావాలు మాయమౌతాయి.

మేల్కొని ఉండగా కలిగిన ముద్రలే స్మృతిగా, కలగా ఏర్పడతాయి. గతం గురించి మనం జ్ఞాపకం తెచ్చుకోవటం, ఒక కలను జ్ఞాపకం తెచ్చుకోవటం వంటిదే. ఆ విధంగా గతమూ, స్వప్నమూ రెండూ అవాస్తవమే.

దేహంతో తాదాత్మ్యం చెందినవాడు ఇతర వస్తువులన్నీ తనకన్నా భిన్నంగా చూస్తాడు. ఈ చూపూ, స్మృతీ కలిసి అతనిలో కాలమనే భావాన్ని కలిగిస్తాయి. చైతన్యం దేశాతీతం, అందులో చూచే వ్యక్తి అంటూ ఎవ్వరూ ఉండరు. అటువంటప్పుడు కాలమనే భావం ఎట్లా వస్తుంది?

గతం గురించి ఇంత జాగ్రత్తగా ఎందుకు చింతించాలి? మనకి గతమొకటి ఉందని నమ్మటంవల్ల, పాత అనుభవాల ముద్రలు మన వర్తమానాన్ని ప్రభావితం చేయడం వల్లా - ఇంతగా ప్రభావితం చేసేది ఇంకేదీ ఉండదు. ఎప్పుడైతే మన జీవితాన్ని గతం అనే రంగుటద్దాలలో చూస్తూంటామో, అప్పుడే ప్రస్తుతపు యథార్థ స్థితిని చూచే శక్తిని కోల్పోతాము. మనచైతన్య ఆకాశము (క్షేత్రం) అవిభక్తమైనది, కానీ దేహం కల్పించే పరిమితుల వల్ల అట్లా చూడలేం. దేహం కేవలం ఒక సాధనం మాత్రమే- టెలిస్కోప్ వలెనో, మైక్రోస్కోప్ వలెనో ఒక పనిముట్టు వంటి దేహం కదిలినప్పుడు ఇంద్రియాలూ కదులుతాయి, కానీ చైతన్యం దేశకాలాలకి అతీతమయినది.

## 2. భవితవ్యం కూడా ఒక భావమే

మనస్సు యొక్క కల్పనే భవితవ్యమంటే.దానికి ఉనికి లేదు, అది కేవలం ఒక భావం మాత్రమే. అహంభావం తన పరికరాలయిన (శ్రీభగవాన్ వాటిని కోడిపిల్లలు అన్నారు) స్మృతి, బుద్ధి మనస్సులద్వారా భూతకాలపు లేదా భవిష్యత్కాలపు ఆలోచనలలో విహరిస్తుంది. భవిష్యత్తు గురించి ఆలోచించటం, పగటి కలలు కనటం వంటిదే.

అటు గతంగాని, ఇటు భవిష్యత్తుగాని వాస్తవం కావు. మనస్సంటే అవాస్తవమైన ఆలోచనలే. గతమూ, భవితవ్యమూ కలిసే మనస్సవుతుంది. అంటే మనస్సే కాలం కూడానన్నమాట. శ్రీభగవాన్ "మనస్సుకి పని కల్పించకపోతే కాలమనే భావమే ఉండదం"టారు (3.25). అవాస్తవమైన గతం గురించీ, భవిష్యత్తు గురించీ ఆలోచించకుండా ఉంటే కాలమనే భ్రమ అంతమైపోతుంది. శ్రీభగవాన్ "ఆలోచనలు లేకపోతే భవిష్యత్తంటూ ఏమీ లేద"ని (3.24) అంటారు. కేవలం ఆలోచనల మూటే అయిన మనస్సు లేకపోతే భవిష్యత్తు అంటూ ఏమీ ఉండదు. ఆలోచనారహితంగా ఉన్నప్పుడు అధిష్ఠానమైన ఆత్మ స్పష్టమవుతుంది.

### 3. గతం, భవిష్యత్తులోని ఆలోచనలు మెలకువలోని కలవంటివి

గతానికీ, భవితవ్యానికీ, సంబంధించిన ఆలోచనలు, మేల్కొని ఉండగా కలిగే కలవంటివి. అవి మనస్సులోనే ఉంటాయి. అలా ఆలోచనలో మునిగిపోయి, మేల్కొని ఉండగా కూడా మనిషి పగటి కలలు కంటూంటాడు. ఆ స్థితిలో ప్రత్యక్షంగా జరిగే వాటినిగాని, పరిసరాలనిగాని గమనించడు. ఎదురుగుండా దేనితోనో, ఎవరితోనో వ్యవహారం నడుస్తున్నా అతని మనస్సు గతం గురించో, భవిష్యత్తుగురించో చింతిస్తుంది. ఆ జ్ఞాపకాలలో గత అనుభవాలూ, ఇష్టాయిష్టాలు వగైరాలన్నీ ఉంటాయి.వాటివల్ల భావిలో కలగబోయే అనుభవాల గురించి కూడా కల్పనలు చేసుకుంటారు. అతనికి ఆలోచనల వల్ల తన ఎరుక లేకుండా పోతుంది.

జీవితంలో ప్రతి క్షణం కొత్తగా, ఏ పూర్వపు ముద్రలూ లేకుండా చూడగలమా? అంటే, దీని అర్థం మనుష్యులనిగాని వస్తువులనిగాని గుర్తుపట్టకుండా ఉండటం కాదు. దాని భావమిది: మన పనులు గత అనుభవాల వల్ల ప్రభావితం కాకుండా ఉండటమన్నమాట. ఉపదేశ సారము (2వ శ్లోకంలోని) భావమిదే.

కృతి మహోదధౌ పతన కారణం
ఫల మశాశ్వతం గతినిరోధకం

## 4. గతం లేకుండా మనిషి అస్తిత్వమేమిటి?

గతం వల్లా, భవితవ్యం వల్లా మాత్రమే అహంభావముండగలదు. గతకాలపు సంస్కారాల్ని తీసేస్తే, అసలు మనిషనేవాడు ఎవడు? ఒక మనిషి నుండి అతని గతాన్ని తీసేస్తే అతనికి పేరు ఉండదు, జ్ఞానముండదు, అతడు సాధించినవి ఉండక ఏవీ ఉండవు- అహంభావానికి పట్టుకునేందుకు ఏ ఆధారమూ వుండదు. ఇది చూడటానికి భయంగానే ఉంటుంది. గతం లేకపోతే మనిషికి గుర్తింపే ఉండదు. ఆ విధంగా గతం నుండి పొందిన ఒకానొక గుర్తింపు వున్నా మనిషి ఏదో వెలితి అనుభవిస్తాడు. ఇంకా ప్రసిద్ధులైన వారి ఆసరాని పొంది తన స్థాయిని పెంపొందించుకుందామనుకుంటాడు. గతం లేకపోతే తన గురించి తాను 'ఇది' అని చెప్పుకునేందుకు తన వ్యక్తిత్వాన్ని నిరూపించుకునేందుకూ ఆధారము ఉండదు. శ్రీభగవాన్ చెప్పిన మార్గంలో పయనించాలంటే గతంలో నేర్చుకున్నదంతా మరచిపోవాలి. అంతేకాక తన అన్ని రకాల గుర్తింపులూ కూడా పోగొట్టుకోవాలి.

## 5. వర్తమానం గురించి అహంభావం అరుదుగా సంతోషిస్తుంది.

ఇప్పుడు జరుగుతున్నదాని గురించి మనిషి అరుదుగా సంతసిస్తాడు. దీనికి కారణం అతడు వర్తమానంలో ఉండడు, వర్తమానాన్ని పూర్వపు అభిప్రాయలతోనే చూస్తాడు. తనకేది మంచిదో మనిషికి తెలియదు- కాని గతంలో ఏర్పడిన అభిప్రాయలననుసరించి తనకేది మంచిదో, చెడ్డదో అనే వాటి గురించి కొన్ని భావాలుంటాయి. ఆ భావాలకి అనుగుణంగానే ప్రస్తుతం జరుగుతున్న దానిని మార్చుకుందామనుకుంటాడు. భవిష్యత్తు ఇంకా పరిపూర్ణంగా ఇంకా భద్రతతో ఉండాలనీ, అందువల్ల తాను ఇంకా సంతోషంగా ఉంటాననీ ఎదురుచూస్తాడు. ఒక్కోసారి, ప్రస్తుతం సంతృప్తికరంగా ఉన్నా, ఆ సంతృప్తి నిలువదేమోనని భయపడుతాడు. తాను ఆత్మనే అనీ, పరిపూర్ణుడననీ, తన ప్రవృత్తే ఆనందమనీ గ్రహించేదాకా ఇట్లాగే కొనసాగుతూనే ఉంటుంది.

జ్ఞాని దేశకాలాతీతుడైన పరమాత్మయే. శ్రీభగవాన్ ఇంకా దేశకాలాలకి బందీలయిన వారితో కూడా, దేశకాల అతీత స్థితిలో అద్భుతంగా వ్యవహరించేవారు. వ్యక్తిత్వంలేని,

అహంభావరహిత స్థితిలో ఉండేవారు. వారికి గతంగాని భవితవ్యంగాని లేవు. వారెల్లప్పుడు నిత్యమైన వర్తమానంలోనే ఉండేవారు. శ్రీభగవాన్ విరజిమ్మే శాంతీ, వారి సన్నిధిలో లభించే సంతోషానికీ, స్వేచ్ఛకీ ఆకర్షితులై ఎందరో భక్తులు వారి చెంత చేరేవారు.

## 6. 'నేనీ దేహాన్ని' అనే భావాన్ని ఛేదించడం

ఉన్న సత్యమల్లా ఒక్కటే, అదే ఆత్మ, అదే మనమన్న దృఢ విశ్వాసం ఎంతో అవసరం. అంటే అహంవృత్తి అనేది కేవలం ఒక ఆలోచన మాత్రమేనని, అది కేవలం చేతనానికీ, జడమైన దేహానికీ మధ్య ముడి అనీ, దానిని ఛేదించాలనీ ఎరుక కలిగి ఉండాలి.

## 7. మేల్కొని ఉండగా కలిగే కలని ఛేదించడం

ఆలోచనారహిత స్థితి కలగటం కేవలం ఆత్మ అనుగ్రహమే. మేల్కొని ఉండగా కలిగే భావాలని విడిచి తన చైతన్యం మీద అవధానం కలిగి ఉండాలి. ఇది ఆ ఆలోచనా స్రవంతి ఆగితేనే సాధ్యం. రెండు ఆలోచనల నడుమ గల విరామంలో ఉండేది చైతన్యమే. ఏ మాత్రమైనా ఆలోచనారహిత స్థితిని అనుభవించి ఆ చైతన్యాన్ని గ్రహించాలి. 'నేనెవడను' అనే విచారణకి ఇదెంతో ముఖ్యం. తద్వారానే మనదైన చైతన్యాన్ని తిరిగి పొందగలుగుతాము (అనుభవం చేసుకోగలుగుతాము). విచారణ కొనసాగుతూంటే ఆలోచనా ప్రవాహంలో విరామాలెక్కువ అవుతూంటాయి. బాహ్యవస్తుజాలం గురించిన ఆలోచనలు తగ్గుతాయి. చైతన్యంగా మరింత నిలువగలుగుతాం. ఆ విధంగా ప్రశాంతి లభిస్తుంది.

## 8. ఇప్పుడూ ఇక్కడా

మన మనస్సు మనల్ని గతానికీ, భవిత్యానికీ తీసుకుపోయినట్లే అది బొంబాయిలో ఉన్న మిత్రుని వద్దకో మన ఎదుటే వెళ్లే కారు మీదకో తీసుకు వెళ్తుంది. వివిధ ప్రాంతాలకి మనస్సు కదిలినట్లే, మనముండే స్థలం కూడ మారుతూంటుంది. 'ఇక్కడ' అని మనమన్నప్పుడు మామూలుగా మన ఉద్దేశం ఒక స్థలంలో ఉన్నట్టు. అయినా

అందులో మనకొక రూపముందనీ, మనకి ఒక స్థలముందనీ అనుకుంటాం. 'ఇప్పుడు' అంటే ఎల్లప్పుడూ ఉండేదే అనీ, అదే అధిష్టానమై మన జాగ్రదవస్థలో అన్నిటినీ గ్రహింప చేసేదనీ అర్థం. అదే విధంగా, 'ఇక్కడ' అన్నప్పుడు ఏదో నిర్ణీతమైన స్థలం అనుకుంటాం, కానీ మనకి అటువంటి స్థలం (స్థిరమైనదైనా, మార్పు చెందేది అయినాసరే) లేనే లేదు. యథార్థంగా 'ఇక్కడ-ఇప్పుడు' అన్నప్పుడు మనం సూచించేది దేశకాలాలకి అతీతమైన చైతన్యపు ఉనికి. శ్రీభగవాన్ 'నేనున్నాను' అనే ఎరుక ఇప్పుడు, ఇక్కడే సాక్షాత్కారమని అంటారు.

## సాధన

బహిర్ముఖమైన బుద్ధే పనిముట్టు అవడం వల్ల మనిషి ఎప్పుడూ సంతోషం కోసం వెతుక్కుంటూనే ఉంటాడు. అతని సంతోషానికి మూలం ఆత్మేననీ, అది తనలోనే ఉందనీ అదినిజానికి తనేనని తెలియరాదతనికి. ఆ మూలం తనలోనే ఉందని గ్రహించేట్టు చేస్తే బుద్ధి తన పనిచేసినట్టే. ఈ గ్రహింపే కలిగితే మనిషి సంతోషం కోసం బయటి ప్రపంచంలో వెతుక్కోవడం మానేసి తనలోని ఆత్మపైనే అవధానుడవుతాడు. తన ఎరుక గోచరింప చేస్తున్న దానిని అంగీకరించకపోవడమే మనిషి శాంతిని కోల్పోవటానికి మూలకారణం.

ఉన్నది కేవలము ఆ ఆత్మ మాత్రమే. అదే భగవంతుడు. మనలో వ్యక్తి అనేవాడు లేడు. ఆత్మనుండి ప్రసరించే ఆత్మకాంతి మనస్సునీ శరీరాన్నీ చైతన్యవంతం చేస్తోంది. ఆలోచనలకి అన్నిటికీ మూలం ఆత్మే. శరీర కార్యకలాపాలన్నీ ఆత్మనుండి వచ్చే ఆజ్ఞల మేరకు మనస్సు నిర్వహిస్తోంది. మహర్షి బోధ నుండి ఇది గ్రహించగలిగి, తమలో కాస్తో గొప్పో మిగిలి వున్న వ్యక్తిత్వ భావాన్ని (చేపను విడచిన పక్షిలాగా, పప్పును విడిచిన కోతిలాగా) విడవగలిగిన పరిపక్వులకు, వెంటనే ఆత్మ సాక్షాత్కారమయింది. అలావిడువలేని వారికి సాధన అవసరమయింది. ఎంత సాధన అవసరం అన్నదానికి శ్రీభగవాన్ ఇచ్చిన సమాధానమిది: కొందరు తుపాకి మందు లాంటివారు, కొందరు ఎండుకట్టెల లాంటివారు, మరికొందరు తడికట్టెల లాంటివారు. ఆత్మవిచారణలో ఆత్మనుంచే ఆలోచనలు వస్తున్నాయని చూచాయగానైనా

గమనించగలిగిన వారికి గూడా అహంతను అంతమొందించడం సాధ్యమవుతుందని చెప్పారువారు. శరణాగతిలో గాని, ఆత్మవిచారణలో గాని మరే యితర మార్గంలో గాని వ్యక్తిత్వభావం నిర్మూలించుకోవడం గమ్యం. వ్యక్తిత్వభావ రహితుడే ఆత్మ, భగవంతుడు.

అసలు మనిషి యొక్క ఈ స్థితికి కారణమేమిటి? ఆత్మనుంచి ప్రసరించే ఆత్మకాంతి మనిషిని సచేతనం చేస్తుందని చూశాము. ఆత్మకాంతి సాక్షాత్తూ చైతన్యం. అది సహజమైన తన ఎరుక మరచిపోయి దేహపు, ప్రపంచపు ఎరుక కలిగి వుండటానికి కారణం, అలవాటు వలన కలిగిన దేహతాదాత్మ్యం. ఆ చైతన్యం ఎప్పుడూ దేహంతో ఒకటికాదని తెలిసికోవడం అన్ని సాధనల గమ్యం. తను ఎప్పుడూ వ్యక్తిగా లేదనీ, తాను కేవలం చైతన్యమనీ అనుభవానికి వచ్చిన మరుక్షణం వ్యక్తిమాయమై తురీయావస్థ మిగులుతుంది.

## అన్ని సాధనలూ 'ఏకంసత్' అన్న సత్యానికే దారి తీస్తాయి.

నిద్ర నుండి మేల్కొనేప్పుడు మొట్టమొదట వచ్చేది 'నేను-తలపు' అని శ్రీభగవాన్ అంటారు. ఈ 'నేను' అనే భావం ఎక్కడ్నుంచి వస్తుంది అని దాని మూలం అన్వేషిస్తే మనస్సు అందులో లీనమైపోతుంది. సాధకుడు ఆత్మనిష్ఠుడవుతాడు. శ్రీభగవాన్ బోధనాసారమిదే. అంటే 'నేను యొక్క జన్మస్థలాన్ని అన్వేషించడమే' ఆత్మ విచారణమన్నమాట. ఉపదేశసారం 12వ శ్లోకంలో చిత్-శక్తీ, శ్వాస (క్రియాశక్తీ) ఆత్మ నుండే ఉదయిస్తాయంటారు శ్రీభగవాన్. ఆత్మ నుండే శ్వాస ఉదయించినా, కేవలం శ్వాసని నియంత్రించినట్లైతే అది మనస్సుని ప్రశాంతం చేస్తుందేగాని, ఆత్మసాక్షాత్కారానికి దారి చూపదు. మంత్రజపం వంటి అభ్యాసాలు కూడ మనస్సు ఏకాగ్రమవటానికి సహాయపడుతాయి. ఇవన్నీ ఆత్మ సాక్షాత్కారానికి ఉపకరించే సాధనలుగా భావించాలి. కానీ, వాటిని చేస్తూ మూలాన్ని అన్వేషించమని చెప్పే శ్రీభగవాన్ ఉపదేశం మిగిలిన వాటికన్నా విస్తృతమైన అభ్యాసం- ఇందులో ఆ అభ్యాసం కొనసాగిస్తున్నా, ఆత్మాన్వేషణ కూడా ఇమిడి ఉంటుంది. ఇది ఇంతవరకూ

లోకానికి తెలియని నిగూఢమైన ఒక అద్భుతమైన మర్మము.

శ్రీ కావ్యకంఠగణపతి మునితో శ్రీభగవాన్ ఇట్లా అన్నారు : "మంత్రాన్ని జపిస్తున్నప్పుడు, ఆ మంత్రం శబ్దం ఉదయించే మూలంపై ధ్యాస నిలిపితే మనస్సు అందులో విలీనమైపోతుంది. అదే తపస్సంటే". ఇదివిని కావ్యకంఠ గణపతిముని నిశ్చేష్టుడై పరమానంభరితుడయ్యాడు. శాస్త్రాలన్నిటిలో దొరకని ఈ నిగూఢ రహస్యాన్ని తెలుపగలిగినవాడు సాక్షాత్తూ పరమేశ్వరుడే అని, 'భగవాన్' అని, 'మహర్షి' అని సంబోంధించాడు.

మరొక భక్తునితో శ్రీభగవాన్, ఇలా అంటారు: "యాంత్రికంగా శ్వాసని నియంత్రించినంత మాత్రాన గమ్యానికి దారితీయదు. అది ఒక సాధనం మాత్రమే. అది చేస్తున్నప్పుడు అప్రమత్తంగా ఉంటూ అహంవృత్తి యొక్క మూలస్థానాన్ని అన్వేషించు. శ్వాస ఎక్కడ సమసిపోతుందో, అక్కడే, 'నేను' అనే భావం ఉదయిస్తుందని గ్రహిస్తావు. రెండూ ఒకేచోట విలీనమవుతాయి, ఉదయిస్తాయి. శ్వాసతోపాటు అహంవృత్తి కూడా మూలంలో అణిగి పోతుంది. అదే సమయాన, 'నేను-నేను' అంటూ ప్రకాశమానమైనదేదో వ్యక్తమవుతుంది. అది నిరంతరం, నిరవధికం. అదే గమ్యం" (స. 195)

ఒకోసారి మనస్సుని నిశ్చలపరచడం కష్టమైతే, 'నేను-నేను' అని మానసికంగా అనుకుంటూ ఆ జపం ఎక్కడ్నుంచి ఉదయిస్తోందో గమనించినా, ఆత్మ విచారణ చేర్చే గమ్యానికే అది కూడా చేరుస్తుంది.

ఒక మంత్రాన్ని జపించే ముందు, ఆ మంత్రం గురించిన ఆలోచన కలుగుతుంది. ఆ ఆలోచన ఆత్మ నుండే ఉదయిస్తుంది. శ్రీభగవాన్ మన దృష్టి అంతా ఆ ఆలోచన యొక్క మూలంపైనే ఉండాలిగాని, ఆ శబ్దాల మీద కాదు అంటారు. ఆ శబ్దాలు, స్వరపేటిక నుండి వచ్చేవే కదా! మొదట్లో ఈ ఆలోచనలు ఎక్కడ్నుంచి వస్తున్నాయో తెలుసుకోలేకపోవచ్చు (ఆ తెలుసుకునే అవసరం కూడా లేదేమో). ఆ తీవ్రమైన గమనింపే, మనోనిశ్చలతకి అనూహ్యమైన రీతిలో దారితీస్తుంది. ఈ మౌనమే 'నేను'

అనే భావం, లేక అహంవృత్తి- దాని మూలాన్నే మనం అన్వేషిస్తున్నాం. ఈ పని చేసినప్పుడు ఆలోచనలన్నీ వెనుకకు మరలి తమ మూలస్థానంలోనికి వెళ్ళిపోతాయి. అప్పుడు అవన్నీ ఆత్మ నుండే ఉదయిస్తున్నాయని సాధకుడు గ్రహిస్తాడు. (స.325)

ఈ మూలస్థానంపై దృష్టి నిలుపడమెట్లా అని సందేహం కలగవచ్చు. ఆ మూలస్థానాన్నే ఆత్మ అనీ, హృదయమనీ అంటారు. శ్రీ భగవాన్ ఇలా అంటారు:"ఉపనిషత్తులు చెప్పేది హృదయం గురించి- ఆ మాటకర్థం 'ఇది కేంద్ర'మని. అంటే మనస్సు ఉదయించేదీ, అణిగిపోయేది అక్కడే. అదే సాక్షాత్కార కేంద్రం. అది ఆత్మేనని నేనంటే, ఆ ఆత్మ శరీరంలో ఉందనుకుంటారు. గాఢ నిద్రలో ఆ ఆత్మ ఎక్కడుందని నేను ప్రశ్నిస్తే అది శరీరంలోనే ఉందనుకుంటారు, కాని దానికి శరీరంగాని, పరిసరాలుగాని, చీకటి గదిలోవున్న వానివలె, ఏమీ తెలియవు. అటువంటి వారి కోసం, సాక్షాత్కారస్థానం దేహంలోనే ఉందని చెప్పవలసి వస్తుంది. ఆ కేంద్రం పేరే హృదయం. కాని, ఇది గుండెకాయ అని తికమకపడతారు" (స.474). అసలు మూలమనేది భౌతికం కాదు. దానిని అట్లాగే అనుభవసిద్ధం చేసుకోవాలి. మనం ముఖ్యంగా గుర్తుంచుకోవలసినది ఒకటే - 'నేను' అనే భావం (అంటే అహంభావం) శ్వాస వలెనే, ఒకే మూలం నుండి ఉదయిస్తుందని, అదే ఆత్మఅనీ. ఆత్మ విచారణ అభ్యాసంలో ఆ అహంభావం ఎక్కడుదయిస్తుందో గమనించాలి. అందులో లీనమవ్వాలి. ఇది చేస్తున్నప్పుడు మనకి సహజమైన శ్వాసక్రియని గమనించడం కూడా సాగుతుంది. అట్లా మూలాన్ని గమనిస్తూంటే, శ్వాస కూడా అందులో అణిగిపోతుంది.

గమనింపు అంటే 'అవధానం కలిగి ఉండట'మని అర్థం చేసుకోవాలి. ఇది నిశ్చలతలోనే సాధ్యమవుతుంది. అవధానమే అసలు కీలకం. దీనినే అంతర్ముఖత్వమంటారు శ్రీభగవాన్. ఏ మనోవ్యాపకంతోనూ అంతరాయం కలిగించకూడదు. గమనింపులో ఎరుకగా ఉండి మూలాన్ని గమనించడం తప్ప ఏ మానసిక వికారమూ ఉండకూడదు. శ్రీభగవాన్, "ఆలోచనల రూపంలో ఉండే వాసనా బలం వల్ల మనస్సు బహిర్ముఖమవుతూంటుంది. ఆలోచనలన్నీ ఆత్మ నుండే ఉదయిస్తాయని గ్రహించి,

ఆ మూలంలో నిలిస్తే మనస్సు మాయమవుతుంది. ఇందులో అంతర్భాగం గమనించడం. అహంభావపు మూలాన్ని గమనిస్తున్నప్పుడు, శ్వాస యొక్క మూలాన్ని కూడా గమనిస్తున్నట్లే." అని అంటారు

'అరుణాచల శివ' అంటూ జపించడం ఆత్మ విచారాన్ని ప్రారంభించడానికి అనువైన సాధనే. శ్రీభగవాన్ చెప్పినట్లు, ఈ మాటలు ఎక్కడ్నుంచి వస్తున్నాయో గమనించాలి. దీనినే ఎంతో అవధానంతో, మనోనిశ్చలతతో చేయాలి. ఇది చేస్తున్నప్పుడు మనస్సు చెదిరిపోతే, దాని వల్ల ఫలితమేమీ ఉండదు.

మూలాన్ని అన్వేషించడమే, ఆత్మ విచారణకి ముఖ్యం. అన్ని మార్గాల కూడలి స్థానం కూడా అదే. మూలంలో విలీనమైన మరుక్షణం దేహంతో తాదాత్మ్యంపోయి వ్యక్తి మాయమౌతాడు. అప్పుడు విభక్తిపోయి భక్తి, వియోగము పోయి యోగము, అజ్ఞానము పోయి జ్ఞానము మిగులుతాయి. అంటే అక్కడ మిగిలేది సచ్చిదానంద స్వరూపమే.

## ప్రపత్తి (శరణాగతి)

నిత్య జీవితంలో అందరి అనుభవమూ చూద్దాం. ఆందోళనా, భయమూ కేవలం భయానకమైన పరిస్థితుల్లోనే ఉండనక్కర్లేదు. తీరుబాటుగా శాంతంగా ఉన్నప్పుడు కూడా అవి కలుగవచ్చు. ఎవరికైనా దేని గురించో ఒక ఆలోచన వచ్చిందంటే ఉదాహరణకి, (తనకి ఆస్తి నష్టమో, పరువు నష్టమో కలుగుతుందేమోనన్నభావం వచ్చిందంటే) అతని బుద్ధి ఆ అవాంఛనీయమైన దానికి తిరగబడుతుంది. తాను నాశనమైపోతాడన్న భావం కలుగుతుంది. ఆ నాశనమవుతాననే ఆలోచనకి దుఃఖంగా ప్రతిస్పందిస్తాడు. ఆ దుఃఖించేది అహంభావమే, కాని అది దేహంతో తాదాత్మ్యం చెందడం వల్ల, ఏమీ ఎరుగని దేహం మీద కూడ ఆ బాధ ప్రభావం చూపుతుంది. వాస్తవానికి మనిషి నాశనం కాకపోవచ్చు కూడా. కాని ఆ ఆలోచన వచ్చిన వెంటనే దేహం ప్రతిస్పందిస్తుంది. నిజజీవితంలో ఏదైనా పరిస్థితి ఎదురైతే దానికి తగిన విధంగా నడుచుకోవడానికి ప్రయత్నించవచ్చు. కాని చాలాసార్లు, సంభవింప

బోయేదాన్ని మనస్సే ఊహించుకుంటుంది. అది నిజమైన పరిస్థితి కానేకాదు కదా. బుద్ధి (లేక అహంకారం) ప్రతిదానినీ బేరీజు వేస్తుంది- అది గతం గురించిన భావం కావచ్చు, భవితవ్యం గురించిన భావం కావచ్చు. ఒక వస్తువు గురించి కావచ్చు, ఒక పరిస్థితి గురించైనా కావచ్చు. అది వాంఛనీయమా కాదా అని ఊహించుకుని సంతోషంగానో, దుఃఖంగానో మారుస్తుంది.

శ్రీభగవాన్ ఇట్లా అంటారు: "అన్ని జీవరాశులకూ తమ చుట్టుప్రక్కల ఉన్నవాటి గురించి తెలుస్తుంది. అంటే అన్నిటికీ బుద్ధి ఉందని గ్రహించాలి. కాని, మనిషి బుద్ధికీ జంతువుల బుద్ధికీ తేడా ఉంది. మనిషి ప్రపంచాన్ని చూసి తదనుగుణంగా నడుచుకుంటాడు. అంతటితో ఆగక తన కోర్కెలు తీరాలనుకుంటాడు. అందువల్ల ఉన్న పరిస్థితి పట్ల అసంతృప్తి కలిగి ఉంటాడు. తన కోర్కెలను తీర్చుకుందామని ఇంకా దూరం ఆలోచిస్తాడు. అయినా సంతృప్తిచెందక వెనుదిరుగుతాడు. అప్పుడిక ఆలోచించడం మొదలుపెడ్తాడు. శాశ్వతానందం, శాశ్వతమైన ప్రశాంతి కోరుకోవడమంటే, అవి మనిషి ప్రకృతిలోనే ఉన్నాయని అర్థం. అందువల్ల వాటిని అన్వేషించి తన నైజాన్నే సంపాదించే ప్రయత్నం చేస్తాడు. అదే ఆత్మ అంటే. అది దక్కితే అన్ని దక్కినట్టే. అట్లా అంతర్ముఖమైన అన్వేషణ బుద్ధి వల్లనే సాధ్యమవుతుంది. నిరంతర అభ్యాసం వల్ల బుద్ధి కూడా తనని నడిపించే వేరే ఉన్నతమైన శక్తి ఉందని గ్రహిస్తుంది. ఆ కారణంగా, ఒకానొక స్థాయి తరువాత అది పని చేయడం మానేస్తుంది. ఆపరిస్థితిలో ఇంకా ఆ ఉన్నతశక్తి కేవలమై మిగిలి వుంటుంది. అదే సాక్షాత్కారమంటే, అదే అంతిమం, అదే గమ్యం. బుద్ధి తన పరిమితులను తెలుసుకోవడమే దాని లక్ష్యం- అది ఇంకొక శక్తిపైన ఆధారపడి ఉందని తెలియడం వల్ల ఆ గమ్యం చేరాలంటే అది నాశనమవ్వాలి. "పరమ లక్ష్యాన్ని అందుకోవడానికి అవసరమైనదల్లా పృథక్ భావం పోవడమే. బుద్ధీ, వ్యక్తిత్వ భావమూ కలిసే ఉంటాయి. మంచిది అయినా, చెడ్డది అయినా బుద్ధి మాయమైతేనే గాని వ్యక్తిత్వ భావం పోదు" (3.42)

తాను లోకంలో వెదుకుతున్న శాశ్వతశాంతిని పొందలేదని బుద్ధి ఎప్పుడో ఒకప్పుడు తెలుసుకుంటుంది. అసలైన ఆనందానికి మూలం తనలోనే, తన ఆత్మగా ఉందని

తెలుసుకొని దానికై అన్వేషించడం మొదలుపెడ్తుంది. అది పని చేయడం మానేస్తుంది. తానప్పటి వరకూ పట్టుకొని ఉన్న భావాలను వదులుకుంటుంది. బుద్ధికి కేవలం విచక్షణే కాకుండా, అవధానం కలిగి ఉండే లక్షణం కూడా ఉంది. అది ఉన్నదాన్ని యథాతథంగా స్వీకరిస్తే, దృష్టి బయటి ప్రపంచంవైపు వెళ్లక తనలోని ఆత్మ మీద దృష్టి నిలుపుతుంది. బాధ కూడా ఒక విధంగా గురువే. బాధ కేవలం భౌతికమనో మానసికమనో గ్రహించేదాకా బాధపడ్తాం. అంతేకాక ఉన్నదానిని మార్చడం మన చేతుల్లో లేనిపని అని గ్రహిస్తాం. అందాకా బాధ ఉంటుంది. ఆ స్థితిలోనే ప్రపత్తి కలుగుతుంది.

ఈ అంశాన్ని అవధూత గీత చక్కగా విశదీకరిస్తుంది. నీటిలోని ఒక చిన్న చేపని ఒక పక్షి పట్టుకుంటుంది. అంతకన్నా పెద్ద పక్షులు వచ్చి ఆ పక్షిని, చేపకోసం పొడిచి హింసిస్తాయి. చేపని పక్షి విడిచిపెట్టేసి శాంతంగా ఉంటుంది. ఇతర పక్షులు కూడా ఇంక దానిని హింసించవు.

ఇంకొక నీతి కథ ఇది. సన్నని మూతిగల ఒక జాడీలో ఉన్న పప్పుని తీసుకుందామని ఒక కోతి అందులో చేతిని దూర్చి ఆ పప్పుని పట్టుకుంటుంది. తన గుప్పెటమూసి చేతిని బయటకు తీసుకోవడానికి కోతి ఎంత ప్రయత్నించినా కుదరదు, చివరికి ఆ పప్పుని విడిచిపెట్టేస్తుంది. చెయ్యి పైకి తీసుకుంటుంది.

బుద్ధి చెలాకీగా ఉన్నప్పుడు అనేక ఆలోచనలూ, వస్తువులూ దేహాన్ని కార్యంలోకి దింపుతాయి. ఆ విధంగా బయటి ప్రపంచం వల్ల కలిగే సుఖదుఃఖాలని అనుభవింపచేస్తాయి. వచ్చే ఆలోచనలనూ, కనబడే వస్తువులనూ, పరిస్థితులనూ ఊరికే చూస్తూ బుద్ధి ఉంటే– ఆ బయట జరిగే వాటిని బేరీజు వేయకుండా ఏమీ కోరకుండా ఉంటే, ఎల్లప్పుడూ ఉండే ఆత్మ విదితమవుతుంది. ఉన్నదానిని అంగీకరించడమంటేనే ప్రపత్తి చెందటం. సంపూర్ణ శరణాగతి చెందినప్పుడు ఇతరమైన వాటిపై దృష్టి మళ్లదు. మన మీద వాటి ప్రభావమేమీ ఉండదు. నిశ్చలత నెలకొంటుంది. ఆ స్థితిలో తను ఆరాధించే దైవంపైనే అంటే, తన మూలమైన

ఆత్మపైనే అవధానముంటుంది. ఆలోచనలు ఉదయించినా సమసిపోతాయి, మనిషి శాంతంగానే ఉంటాడు, ఇక్కడ శ్రీ భగవాన్ బోధని గమనించడం చాలా ముఖ్యం. మనకి వచ్చే ఆలోచనలకి మన క్రియలకీ మూలం ఆత్మే. మనలోని ఆలోచనలని, బాహ్యంలో జరిగేవాటిని యథాతథంగా స్వీకరించడ మంటే ఇంతకు మునుపు శ్రీ భగవాన్ చెప్పిన (3.42) మన లోని ఆ ఉన్నత శక్తిని, అంటే, ఆత్మని గుర్తెరగడమే. మనం శరణాగతి చెందేది ఆశక్తికే.

ఎవరితోనో శ్రీభగవాన్ ఇట్లా అంటూండగా శ్రీమతి కనకమ్మాళ్ అనే ఆశ్రమవాసి విన్నారట. "నీ పుట్టుకనుండీ, అంతం వరకూ నీ సినిమా ఎప్పుడో తీయబడింది. ఇప్పుడు దానిని నీవు చూస్తున్నావు. అయినా, రంగం బాగులేదని, ఈ పాత్ర బాగులేదనీ, ఆ సంభాషణ బాగులేదనీ వ్యాఖ్యానిస్తూన్నావు. ఏ వ్యాఖ్యానాలూ చేయకుండా ఊరికే ఉండు".

దీనినే ఈవిధంగా కూడా అర్థం చేసికోవచ్చు. ఈ ప్రపంచాన్ని సృష్టించి నియంత్రిస్తున్న వాడు ఆ భగవంతుడు. జరిగేవన్నీ ఆయన ఇచ్ఛానుసారమే జరుగుతాయి. కేవలము మనకు జరుగుతున్న మంచికే పరిమితం కాకుండా, మన బహిర్గతమైన బుద్ధి యొక్క దృష్టిలోపంవల్ల అనిపించే చెడుకు గూడా మనం ఆయనకి సదా కృతజ్ఞులమై వుండాలి. భగవంతుడు అనంత ప్రేమమూర్తి కృపాసముద్రము అని గ్రహిస్తే, మన దృష్టిలోపం వల్ల, జరుగుతున్న దానికి మంచీ, చెడులను ఆపాదించి సుఖదుఃఖాలకులోనౌతున్నామని గ్రహిస్తాము. అప్పుడు, నాయిష్ట ప్రకారం జరిగితే బాగుంటుందన్న దృష్టిపోయి, జరుగుతున్నదానిని భగవంతునికి సంపూర్ణ కృతజ్ఞతతో యథాతథంగా స్వీకరిస్తాము. అది శరణాగతి. మనకి దుఃఖము కలిగినప్పుడు, ముడుపులు, మొక్కులు చేసి ప్రార్థన చేస్తే డబ్బు చెల్లించి పొందే ఒక సహాయకర పనిముట్టుకింద భగవంతుణ్ణి జమచేసినట్టు లెక్క. భగవంతుని ఇచ్ఛానుసారం కాక మనం కోరిన విధంగా జరగాలని చేసేది శరణాగతి కాదు.

"సర్వం నీవే, 'నీ ఇచ్ఛయేనెరవేరుగాక' అనగలగే స్థితి వచ్చేదాకా శరణాగతి పరిపూర్ణం

కాదు. జ్ఞానానికీ ఆ స్థితికీ తేడా లేదు. ప్రపత్తిలో అద్వైతముంది. నిజానికి, ద్వైతమూ లేదు అద్వైతమూలేదు. ఉన్నదే అది. శరణాగతి తేలిక అనిపిస్తుంది. పెద్దవాళ్ళు 'నేను నీ శరణుజొచ్చాను' అనేసి భారమంతా భగవంతుని పైన పెట్టేస్తే చాలు, ఇంక ఏది కావాలంటే అది చేసే స్వేచ్ఛ మనకుందనుకుంటారు కనుక. విషయమేమిటంటే ప్రపత్తి చెందటంలో ఇష్టాయిష్టాలంటూ ఉండరాదు. నీ ఇచ్ఛే లేకుండా పోవాలి, భగవంతుని ఇచ్ఛే ఆ స్థానాన్ని తీసుకుంటుంది. అట్లా అంతమైన అహంభావం, జ్ఞానం కన్నా ఏ విధంగానూ భేదం కాదు. అందువల్ల ఏ మార్గాన్ని అనుసరించినా చివరికి జ్ఞానానికే అంటే ఏకతకే రావాలి" అంటారు శ్రీభగవాన్. (అ.ర. 2.7.46)

అంగీకరింపలేని దాన్ని అంగీకరించడమే అన్నిటికన్నా కష్టం జీవితంలో, భక్తి అదే. కబీర్ ఇట్లా అంటారు "భక్తి మార్గం పిరికిపందలకి కాదు, పరిపూర్ణంగా శరణాగతి చెందితే భగవత్సాక్షాత్కారం కలుగవచ్చు."

శ్రీభగవాన్ ఎడమచేతి మీద కాన్సర్ వ్రణం లేచింది. అది ఎంతో బాధాకరమైన వ్యాధి. కాని ఒక్కసారి కూడా వారు ఏవిధమైన ఫిర్యాదూ చేయలేదు, నయం చేసుకోవడానికి ప్రయత్నించలేదు. శ్రీభగవాన్ అన్నట్టు, శరణాగతి అనేది ఒక్కసారే సంభవిస్తుంది. అదే ఆఖరిసారి కూడా. ఆ తరువాత మనస్సు ప్రశ్నలను లేవనెత్తదు. ప్రపత్తికి అనుగ్రహం, పరిపక్వత, ధైర్యం అవసరం. అందరికీ ఈ గుణాలు ఉండకపోవచ్చు. పాక్షికంగా శరణాగతినలవర్చుకొని, నిరంతరం ఆచరించినా, అదే పరిపూర్ణ శరణాగతికి దారితీస్తుందంటారు శ్రీభగవాన్. (2.19)

ఉన్నదాన్ని అంగీకరించకపోవడమనేది బుద్ధి (వ్యక్తిత్వ భావం) వల్లనే– ఏదో తర్కంతో, అభిప్రాయాలతో అది పని చేస్తుంది. అంటే, ఉన్నదాన్ని మారుద్దామనే కోరిక లేకపోవడమే శరణాగతి అంటే. బుద్ధి జోక్యం కలుగ చేసుకోకుండా ఉంటే ఉన్నదాన్ని సంపూర్ణంగా అంగీకరించినట్టే (నిజానికి అంగీకరించేవాడుగాని నిరాకరించేవాడుగాని ఎవ్వరూ లేనేలేరు). మిగిలేది ప్రశాంతే. 'నేను' అనే భావం పూర్తిగాపోతే మిగిలేదల్లా ఆత్మే. ఉపదేశసారం (20వ శ్లోకంలో) ఇట్లా అంటారు శ్రీభగవాన్:

"నేనడంగిన చోట "నేను నే" ననుచు, దానుగా దోచును దాను పూర్ణంబు"

ఇక "ఆత్మయే సర్వమూ" అన్న భగవాన్ బోధను మరింత దగ్గరగా చూద్దాము. అహంవృత్తి ఉదయించిన తరువాతే భగవంతుడనే భావముదయిస్తుందంటారు శ్రీభగవాన్ (3.43, 2.19). శరణాగతి అంటే మనకి భిన్నంగా ఉన్న భగవంతునికి శరణుజొచ్చటం కాదు - మన మూలానికే, మన ఆత్మకే ఆ శరణాగతి. 'నేను ఉన్నాను' అనేదే భగవంతుడు(2.18). ఓ అర్జునా హృదయాకాశంలో నేనుఉన్నాను అని శ్రీకృష్ణుడు అన్నారు. సూర్యునిలో ఉన్నదే మనిషిలో కూడా ఉన్నదని ఉపనిషత్తులన్నాయి. భగవంతుని సామ్రాజ్యం మనలోపలే ఉంది అని బైబిల్ అంటున్నది. భగవంతుడు మనలోపలే ఉన్నాడన్నది అందరూ అంగీకరించినమాట. మనః శూన్యమైన అంతశ్చైతన్యము భగవంతునిగా అనుభవగోచర మౌతుంది (2.19). శ్రీభగవాన్ ఇంకా ఇట్లా అంటారుః "శరణాగతి అహంభావపు మూలానికే అంటే అహంభావం, ఆత్మకి అర్పితమవుతుంది. మనకి ఆత్మ అంటే ప్రీతి కాబట్టి అన్నీ మనకి ప్రియమైనవే అవుతాయి. మన అహంభావం అర్పితమయ్యేది ఆత్మకే- ఆ పరమశక్తికి, దాని ఇచ్ఛానుసారం అన్నీ జరగనీయడమే శరణాగతి" (స.201). అదే పరాభక్తి. అట్లా జరిగితే, కేవల 'సత్'లో సంస్థితమవుతాం. అందువల్లే ఉపదేశసారం 9వ శ్లోకంలో శ్రీభగవాన్ ఇట్లా అంటారు.

"భావబలంబుచే భావనాతీత
భావస్థితి మునులు పరభక్తియనిరి"

శ్రీభగవాన్‌ని ఒకరిట్లా అడిగారు: "శరణాగతి అంటే భక్తి కదా, కాని శ్రీభగవాన్ ఆత్మ విచారణే ఆమోదిస్తారు. వినే వారికి గందరగోళంగా ఉంటుంది". దానికి శ్రీభగవాన్ ఇచ్చిన సమాధానమిది.

"చేస్తున్నదేమిటో పరిపూర్ణంగా అర్థమయిన తరువాతనే శరణాగతి సాధ్యమవుతుంది. ఆ జ్ఞానం ఆత్మ విచారణ వల్ల లభిస్తుంది, ఆ తరువాత శరణాగతితో అంతమవుతుంది" (3.41). స్వేచ్ఛాయుతులమవడానికి రెండే మార్గాలున్నాయంటారు శ్రీభగవాన్. ఒకటి:

పట్టుకొని, దాన్ని తీర్మానించుకుంటూ, విశ్లేషణ చేసుకుంటూండక, 'నేననుభావము' లేక, నేననే ఎరుక పైన దృష్టి పెడుతుంది. దానితో బుద్ధి అహంభావంలో కలిసిపోతుంది. చైతన్యమే అయిన 'నేను'అనేది రెండు ఆలోచనల నడుమనో లేక రెండు అవస్థల నడుమనో వున్న వ్యవధిగా అనుభవసిద్ధమవుతుంది. రెండు అవస్థల నడుమ అంటే సుషుప్తికీ మేల్కొడానికీ నడుమ, మేల్కొంటుండగా ఆలోచనారహితమైన స్థితిలో ఉండేది. అది నిర్మలమైన 'నేన'న్నమాట (నిష్కళంకమైన అహం). మనం చేయాల్సిందల్లా శుద్ధమైన ఆ 'నేను' అన్నదానినే అంటిపెట్టుకొని ఉండాలి. దానిపై ధ్యాసపెట్టడం వల్ల దాని జన్మస్థలం కనుక్కోగలుగుతాం.

ఒక భావం ఉదయించగానే అప్రమత్తంగా ఉండాలంటారు శ్రీభగవాన్. ఆ ఆలోచనని సాగనీయకూడదు. 'ఎవరికీ ఆలోచన వస్తోంది' అని విచారించాలి. ఈ ప్రశ్న వేయగానే ఆ ఆలోచన నుండి మన ధ్యాస మరలిపోతుంది. ఆ ప్రశ్నకి సమాధానం "నాకు" అని వస్తుంది. అప్పుడు మన దృష్టి లోపలికి అంటే "నేనున్నాను" వైపు వెళ్తుంది. ఆ తరువాత 'ఎవరునేను' అని ప్రశ్నించుకోవాలి. అప్పుడు ప్రశ్నించే వాడు కేవలం వైయక్తికం కాని 'నేను'గా అంటే చైతన్యంగా మిగిలిపోతాడు. ఈ 'నేనే', 'నేనున్నాననే' మన నిజమైనఉనికి. 'నేనెవరు' అనే విచారణ జరుగుతున్నంతసేపూ అది అవిచ్ఛిన్నంగా మనధ్యాసను మనస్సు మీద నుంచి అంటే మనను పరిమితులను చేసే ఆలోచనల మీద నుంచి 'నేను' అనే ఎరుకమీదకు మళ్ళిస్తుంది. దీని మూలాన్ని కనుక్కోవడం మనధ్యేయం. అంటే ఆత్మ విచారణ యొక్క ముఖ్యోద్దేశం అవధానాన్ని మూలమైన ఆత్మవైపు మళ్ళించడమే. ఆ ఆత్మనే కనుగొని అందులో విలీనమైపోవటం.

నేనున్నాననే ఎరుక తెలియని వారెవ్వరూ లేరు. దానిని గుర్తించాలంటే కళ్ళు మూసుకొని 'నేను బ్రతికి ఉన్నట్టు నాకెట్లా తెలుసు' అని ప్రశ్నించుకుంటే సరి. ఉన్నట్లు వెంటనే తెలుస్తుంది కదా. మొదట్లో ఈ ఎరుక మిగిలిన వాటితో అంటే శ్వాసతో, స్పర్శతో మొదలైన ఇంద్రియజ్ఞానంతో కలిసివుండవచ్చు. కాని 'నేనున్నాను' అన్న ఎరుక పై దృష్టిని నిలిపితే ఇటువంటి జ్ఞానం వెనక్కిపోయి 'నేనున్నాను' అన్నఎరుకే ముందుకు

వస్తుంది. అది సూక్ష్మమైనది. అక్కడ ఇంద్రియ జనితమైన జ్ఞానముండదు.

ఆత్మ విచారణ మార్గంలో ఒక చిత్రముంది. సూర్యకాంతి, సౌరమండలమంతా వ్యాపిస్తుంది. ఈ మండలంలోని గ్రహాలన్నీ సూర్యకాంతి వల్ల కనబడుతాయి. సూర్యకాంతిని నేను కూడా అనుభవించాలని సూర్యుడనగలడా ?లేదా? సూర్యకాంతి సూర్యుణ్ణి తెలుసుకోవాలనగలదా? విచారణ కూడా ఇటువంటిదే. మనమే చైతన్యం. సూర్యకాంతి వలె చైతన్యం దేహమంతా వ్యాపిస్తుంది. ఇట్టి రూపమే మనం. అటువంటప్పుడు నేనేమిటో తెలుసుకోవాలని ఎట్లా అనిపిస్తుంది? అందువల్ల నేనున్నాను అనే ఎరుకలో ఆ ఎరుకనే అనుభవించే వారెవ్వరూ ఉండరు. మనమేదో, అది అవటానికే ప్రయత్నిస్తున్నామన్నమాట. ఎరుకని అనుభవానికి తెచ్చుకునే ప్రయత్నాలు విరమించి కేవలం ఎరుకగా వుండటమే సత్వర కార్యం. విచారణలో 'నేనెవరిని' అని ప్రశ్నించుకున్నప్పుడు మనం ఎరుకగా వుంటాము . అందులోనే సంస్థితమైతే సరి. ఏ ఆలోచన వల్లా చెదరిపోకుండా, మూలంపైనే లగ్నమై ఉంటే మనం ఆత్మలో మగ్నమై, కేవలం సంస్థితమవుతాం. అదే ఆత్మానుభూతికి దారితీస్తుంది.

చైతన్యం ఎప్పుడూ దేహంతోగాని, మనస్సుతోగాని ఏకమై లేదంటారు శ్రీ భగవాన్ (2.08). అంటే సూర్యకాంతి భూమితో ఏకం కానట్టు. విచారణ చేయకపోవడం వల్లనే అది (అంటే చైతన్యం) ఆలోచనలని పట్టుకొని పరిమితంగా ఉన్నట్టు అనిపిస్తుంది. ఒక ఆలోచనపై దృష్టి పెట్టినప్పుడల్లా అది వర్థిల్లుతుంది. అవధానమే చైతన్యం అసలు. ఆ అవధానం, ఆలోచన నుండి ఉపసంహరింపబడితే ఆలోచన సమసిపోతుంది. అది చేసినప్పుడు చైతన్యం, జడపదార్థం నుండి విడిపోతుంది. ఈ అభ్యాసం వాసనలని దగ్ధం చేస్తుందంటారు శ్రీభగవాన్. అవి ఉదయించినప్పుడల్లా మనకి ఆ ఎరుక ఉంటుంది. ఆత్మ విచారణ వల్ల మన అవధానం వాటిమీద లేకపోతే అవి చనిపోతాయి. చిట్టచివరికి మనిషి విషయాలతో సంయోగం లేకుండా సద్వస్తువులో అంటే వర్తమానంలో, స్వచ్ఛమైన 'నేనున్నాను'గా ఉండిపోతాడు.

ఆత్మ విచారణ కొనసాగుతున్నప్పుడు, చైతన్యపు ఉనికి కొంత అనుభవమైన తరువాత

'ఎవరికీ ఆలోచన వచ్చింది' అని మాటలలో ప్రశ్నించు కోవడం అనవసరమౌతుంది. 'నేనున్నాను' అనే ఎరుకతో ఉండటమే చాలు. ఏదైనా ఆలోచన లేచినప్పుడు దానిని పట్టించుకోకపోతే ఆ ఆలోచన పట్ల వైరాగ్యమున్నట్లే. కాని ఆ ఆలోచన వైపు మనస్సు మళ్లగానే జాగురూకతతో వెంటనే 'నేనున్నాను' అనే ఎరుకపై ధ్యాస మళ్లించగలిగితే ఆ లేచిన ఆలోచన సమసి పోతుంది. ఇది జరిగితే మనలో ఇంకా ఆ ఆలోచన పట్ల మమకారమున్నట్లనిపించినా, దాని నుండి త్రిప్పేసుకున్నప్పుడు దాని పట్ల వైరాగ్యముందని అర్థం. ఆలోచనపై మమకారమెక్కువగా ఉంటే, అది వాసనల బలం వల్లనే. అది 'నేనున్నాను' అనే ఎరుకని భంగపరుస్తుంది. భావాల వరదలో కొట్టుకుపోకుండా ఉండాలంటే ఎంతో అప్రమత్తంగా ఉండాలి. ఒకే ఆలోచన పదే పదే ఉదయిస్తూంటే దానిపట్ల మన మమకారాన్ని గమనించి దానిని అధిగమించడానికి ప్రయత్నించాలి. ఈ గమనింపూ, అధిగమనమూ కూడా అనుగ్రహం వల్లనే సాధ్యమవుతాయి. 'నేనున్నాను' అనే ఎరుకగా వుండటానికి మళ్లీ మళ్లీ ప్రయత్నిస్తూనే ఉండాలి.

ఆత్మ విచారణ ద్వారా 'నేనున్నాను' అనే ఎరుక దేహం నుండి విడివడితే, అంతకు పూర్వపు 'నేను', 'ఇతరములూ' అనే విభజన పోయి అంతా ఏకమవుతుంది. ఆత్మ విచారణ పురోగమిస్తున్న కొద్దీ అంతకు పూర్వం మనస్సు నిండా క్రిక్కిరిసిపోయిన ఆలోచనలూ, విషయాలూ, అభిప్రాయాలూ తగ్గుతాయి. మన ఉనికి గురించి నిజమైన ఎరుక కలుగుతుంది. 'నేను దేహాన్ని' అనే భావమూ, దేశకాలాల భ్రమా తగ్గుతాయి. చివరిగా బాహ్యవస్తుజాలపు జ్ఞానం పోయి శుద్ధమనస్సే మిగులుతుంది. అదే ఎరుక అంటే. ఆలోచనలు తగ్గడమే పురోగతికి సూచన అంటారు శ్రీభగవాన్. ఆత్మ విచారణ పురోగమిస్తున్న కొద్దీ పసివాని లక్షణాలు మళ్లీ వస్తాయి (1.16)

"చిత్తైకాగ్రత సాధనాపద్ధతులలో ఒకటా" అని ఒక భక్తుడు శ్రీభగవాన్‌ని అడిగారు. దానికి మహర్షి ఇచ్చిన సమాధానమిది: "ఏకాగ్రత అంటే ఏదో ఒకదాని గురించే ఆలోచించటం కాదు. అది మన సహజస్థితిని చూడటానికి ఆటంకాలయ్యే, మిగిలిన మన ఆలోచనలన్నిటినీ నిరోధించడమే. ఈ అవిద్యని తొలగించడంకోసమే

ప్రయత్నాలన్నీను. ఆలోచనలు అణచటం కష్టంగా అనిపిస్తుందిప్పుడు. జ్ఞానోదయమైన తరువాత ఆలోచనని వెలికితీయడమే కష్టంగా అనిపిస్తుంది. అప్పుడు చింతించ దగ్గ విషయాలంటూ ఏమైనా ఉంటాయా అసలు? ఉన్నదల్లా ఆత్మే. ఏమైనా విషయాలుంటేనే ఆలోచనలు పని చేయగలవు. విషయాలే లేనప్పుడు ఇంక ఆలోచనలెట్లా ఉదయిస్తాయి. బాగా అలవాటైపోవడం వల్ల, ఆలోచనలే లేకుండా ఉండటం కష్టమనిపిస్తుంది. ఈ తప్పుని గ్రహిస్తే వ్యర్థపుటాలోచనలతో శ్రమపడటం మూర్ఖత్వమే అవుతుంది" (స.398)

**ఆత్మ విచారణ మార్గాన్ని "ఎక్కడ్నుంచి ఈ 'నేను' ఉదయిస్తోంది"గా వర్ణించడం ఇంకా సముచితమంటారు శ్రీభగవాన్. "అట్లా అన్నప్పుడు, 'ఎవరిని నేను' అని ప్రశ్నించుకొని నేనీ దేహాన్ని కాను, ఇంద్రియాలను వగైరాలన్నీకాను అంటూ ఒక్కొక్క దానినే త్రోసిపుచ్చి చివరికి అసలు సత్యాన్ని చేరటం కాక, మనలో ఈ 'నేను' అనే భావం ఎక్కడ్నుంచి వస్తోందని కనుక్కోవడానికి ప్రయత్నిస్తాం. ఈ మార్గంలో ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా, శ్వాసని గమనించడం జరుగుతుంది. అన్ని భావాలకీ మూలమైన 'నేను' అనే భావం ఎక్కడ్నుంచి ఉదయిస్తోందని గమనించినప్పుడు శ్వాస యొక్క మూలాన్ని కూడ గమనిస్తాం. శ్వాసా, 'నేను' అనే భావమూ ఒకే చోట నుంచి ఉదయిస్తాయి కాబట్టి" అని అంటారు శ్రీభగవాన్ (3.44).**

పాల్‌బ్రంటన్, 'నేను' ఎక్కడ్నుంచి ఉదయిస్తోందని చేసిన అన్వేషణ ఆయన అనుభవాన్ని తెలియజేస్తుంది. కాని, గమ్యాన్ని చేరటానికి ఎవరి మార్గం వారిదే. పాల్‌బ్రంటన్ అనుభవం ఇట్లా ఉంది ("రహస్య భారతంలో అన్వేషణ' అనే పాల్‌బ్రంటన్ పుస్తకం నుండి గ్రహించిన 'మహర్షీ, వారి ఉపదేశమూ' అన్న గ్రంథంలోని భాగం).

"నేనెవరిని అనే అన్వేషణని నిర్విరామంగా కొనసాగనీ. నీ మానసిక స్థితినంతా విశ్లేషించుకో. 'నేను' అనే భావం ఎక్కడ్నుంచి ఉదయిస్తుందో కనుగొనటానికి ప్రయత్నించి, ధ్యానాన్ని కొనసాగిస్తూనే ఉండు. అంతర్ముఖమవుతూండు. ఏదో ఒకనాడు ఆలోచనాభ్రమణం ఆగిపోతుంది, సద్యఃస్ఫూర్తి తెలియకుండా ఉదయిస్తుంది. ఆ సద్యఃస్ఫూర్తినే అనుసరించు, ఆలోచనలు ఆగిపోనీ, అంతిమంగా గమ్యానికి అదే

దారి చూపుతుంది.

"రోజూ నా ఆలోచనలతో కుస్తీ పడ్తూనే ఉంటాను. వాటిని ఛేదించుకుని నా అంతరాంతరాల్లోకి వెళ్లటం మొదలుపెట్టాను.

"కప్పివేయబడిన ఆ ఆలయపు పవిత్ర అంతరాలలో తిరగటం ఆపేసి, సాయం సమయంలో జరిగే ధ్యానం కోసం హాలులోకి ప్రవేశించాను. అప్పటికే సగం ధ్యాన సమయం అయిపోయింది. మెల్లగా నేలమీద కూర్చుని వెంటనే నా ధ్యానాసనం వేసుకొని, మామూలు ధ్యానం మొదలు పెట్టాను. కొద్దిసేపట్లో స్థిమితపడి, చెదిరిపోతూండే నా ఆలోచనలన్నిటినీ ఒక కేంద్రం వద్దకు తెచ్చాను. కళ్లు మూసుకోగానే ప్రగాఢమైన చైతన్యపు అంతర్ముఖత్వం కలిగింది.

"నా మనోనేత్రం ముందు ఆసీనులై ఉన్న మహర్షి రూపం స్పష్టంగా విహరిస్తుంది. వారి ఉపదేశాన్ననుసరించి, ఆ మనోదృశ్యాన్ని ఛేదించడానికి ప్రయత్నించాను. ఆ విధంగా వారి నిజస్వరూపాన్నీ, అంతర్నైజాన్నీ, వారి అంతరంగాన్నే చేరుదామని. ఆ ప్రయత్నం వెంటనే ఫలించిందని ఆశ్చర్యపోతూండగానే ఆ దృశ్యం మాయమైంది. నాకు మిగిలిందల్లా గాఢమైన సన్నిహిత సాన్నిధ్యమే.

"నా ధ్యానంలో అంతకు పూర్వం ఏవేవో ప్రశ్నలు కలుగుతూనే ఉండేవి. అవి తగ్గిపోయాయి. **భౌతికంగా, ఆవేశపరంగా, మానసికంగా నాకు కలిగే స్పందనలను మళ్లీ మళ్లీ ప్రశ్నించుకున్నాను. కాని ఆత్మాన్వేషణ విషయంలో అసంతృప్తుడనై వాటిని విడిచేశాను. ఆ తరువాత నా దృష్టినంతా చైతన్యం యొక్క కేంద్రంపైనే పెట్టాను. అదెక్కడ్నుంచి ఉదయిస్తుందో కనుగోవాలని కృషి చేశాను.** పరమమైన తుది గడియ వచ్చింది. ఏకాగ్రమైన ఆ నిశ్చలతలో మనస్సు తనలోకి తానే వెళ్లిపోయింది. సుపరిచితమైన ప్రపంచం నీడలలోకి జారుకుంది. శూన్యత చుట్టూ ఆవరించుకుంది. మానసికంగా ఒక గోడ అడ్డుతగిలినట్లయింది. ఆ అవధానం నిలుపుకోవడానికి ఎంతో అప్రమత్తత కావాలి. ఉపరితలపు మన జీవితం పట్ల అనురక్తిని విడచి, సూదిమొనపై ఏకాగ్రమవడం ఎంతో కష్టం కదా!

"ఇంకోసారి ఆ కేంద్రాన్ని ఒక్కతృటిలో చేరాను. నిరంతరం ప్రవహించే ఆలోచనలతో ఎక్కువ సేపు పోరాడవలసిన అవసరం లేకపోయింది. ఏదో నూతన శక్తి, అతి బలంగా నా అంతర్జగత్తులోకి వచ్చి నన్ను అతివేగంగా లోపలికి మోసుకుపోయింది. మొదటి మహాసంగ్రామం నేనొక దెబ్బైనా వేయకుండా ముగిసింది. ఏదో సుఖమయమూ, ఆనందమయమూ అయిన అనుభూతి అంతకు పూర్వపు తీక్షణతను అధిగమిస్తుంది. ఆ తరువాతి దశలో బుద్ధికతీతుడనై ఆ బుద్ధినే గమనించసాగాను. అది ఆలోచిస్తోందని గమనించాను. కాని అది కేవలం ఒక సాధనం మాత్రమేనన్నీ నా అంతరంగంలో తెలుస్తోంది. ఈ ఆలోచనలనన్నిటినీ విచిత్రమైన మమతారాహిత్యంతో గమనించసాగాను. చింతించగలగటం ఒకప్పుడు గర్వకారణం, కాని దాని నుండి పలాయనమవ్వాల్సిన స్థితి ఏర్పడింది. అంతకు పూర్వం దానికి బందీనై ఉండే వాడినని విస్తుబోయాను. బుద్ధికి బయట నిలబడి ఊరికే ఉండాలన్న కోరిక బలీయమైపోయింది. ఆలోచన కన్నా లోతుగా ఉన్న స్థలంలోకి దూకాలనిపించింది. మెదడుకి బానిసత్వం పోతే ఎట్లా ఉంటుందో తెలుసుకోవాలని పించింది. అట్లా చేస్తున్నా అవధానాన్నీ, అప్రమత్తతనీ వీడకుండా ఉండాలని కూడా అనిపించింది.

"కాని యుగయుగాలుగా సాగుతున్న ఆలోచనల నిరంకుశత్వం నుండి విడిపోవడమెట్లా? ఆలోచనలని బలవంతంగా ఆపడానికి ప్రయత్నించవద్దని మహర్షి చెప్పడం గుర్తుంది- **"ఆలోచన యొక్క జన్మస్థలం ఆరా తీయి, ఆత్మని తనంతటతానే తేటతెల్లమవనీ, అప్పుడే నీ ఆలోచనలు వాటంతట అవే సమసిపోతాయి"** అని. మహర్షి చెప్పిన ఆలోచన యొక్క జన్మస్థలాన్ని కనుగొన్నాననిపించి, ఈ కేంద్రానికి నన్ను తీసుకువచ్చిన బలీయమైన వైఖరిని విడిచి, ఊరికే ఉండటానికి అంకితమైపోయాను. అయినా పాము తన ఆహారం కోసం మెలకువతో ఉన్నట్టు నేను కూడా ఎంతో అప్రమత్తంగా ఉన్నాను. ఈ ప్రశాంత స్థితి మహర్షి ముందు చెప్పినది సరియైనదే అని గ్రహించేంత వరకూ నిలిచింది. ఆలోచనల వెల్లువ తగ్గడం మొదలైంది. తార్కికమైన చింతన శూన్యమైపోయే స్థితికి వచ్చింది. ఇక ఏదో కొత్త అనుభవం నన్ను వశపరచుకొంది. నా సద్యఃస్ఫూర్తి

అతీతస్థితి దిశగా వెళ్తూంటే కాలమే గిర్రున తిరిగిపోతున్నట్లనిపించింది. ఇంద్రియాలిచ్చే సూచనలు నాకేమీ పట్టలేదు. ఏ క్షణాన్నైనా అన్నిటికీ వెలుపల, ప్రపంచపునిగూఢ రహస్యాల అంచులలో నిలుచుంటాననిపించింది.

"చివరికి అది జరిగింది. ఆర్పేసిన క్రొవ్వొత్తి వల్లే ఆలోచన అనేది సమసిపోయింది. ఏ ఆలోచనల అడ్డూ లేకుండా, బుద్ధి తన స్వస్థలమైన చైతన్యంలోకి వెళ్లిపోయింది. మనస్సు సర్వాతీతమైన మూలం నుండే వస్తుందని నేను ఊహించినదీ, మహర్షి గట్టిగా చెప్పినదీ నిజమేనని గ్రహించాను. సుషుప్తిలో ఉన్నట్టు మనస్సు పూర్తిగా అణగిపోయింది. అయినా చైతన్యమేమీ తగ్గలేదు. అతి ప్రశాంతంగా ఉన్నాను, నేనెవరినో, ఏమి జరుగుతుందో కూడా తెలుస్తూనే ఉంది. పృథక్ భావపు సంకుచితత్వం నుండి నా ఎరుక బయటకు విస్తరించింది, అన్నిటినీ తన కౌగిట్లోకి తీసుకొనేటంతటి ఔన్నత్యాన్ని సంతరించుకుంది. ఆత్మ అట్లాగే ఉంది, కాని అది మార్పుచెంది ప్రకాశమానంగా ఉంది. నేను అనే అప్రధానమైన వ్యక్తిత్వం నుండి, అంతకన్నా గంభీరమైన, దైవికమైనది చైతన్యంలోకి ప్రవేశించి, నేనైంది. దాని రాకతో ఒక అద్భుత నూతన స్వేచ్ఛానుభూతి కూడా కలిగింది. ఆలోచన అనేది అటూ- ఇటూ తిరుగుతూండే నేతపగ్గం వంటిది, ఇటువంటి నిరంకుశత్వపు కదలిక నుండి విమోచనం లభించడమంటే ఖైదు నుండి విడుదలయ్యి బయటిగాలిలోకి వచ్చినట్లే".

సాధన చేస్తున్నప్పుడు ఒక దశలో 'నేను' అనేది దేహంతో తన తాదాత్మ్యాన్ని కోల్పోతుంది. ఆ స్థితి ఉన్నంతకాలమూ పృథక్ భావముండదు. అప్పుడు సాధన అవసరం లేదు. సాధ్యం కూడా కాదు. శ్రీహరివంశ్ లాల్ పూంజా (ఈయననే పాపాజీ అంటారు) చెప్పే కథను బట్టి ఇది విశదమవుతుంది. పూంజాగారు, శ్రీభగవాన్ భక్తుడు.

పూంజాగారు వీలైనప్పుడల్లా తన సమయాన్ని కృష్ణ జపాలకు వినియోగించేవారు. కృష్ణ నామాన్ని రోజుకి రమారమీ 24000 సార్లు జపించేవారు. ఒకనాడు మాత్రం జపం చేయడానికి ప్రయత్నించినప్పుడు కృష్ణనామమే ఉచ్చరింపలేకపోయారు. వారి మనస్సు అందుకు సహకరించలేదు. రైలెక్కి తిరువణ్ణామలైలోని శ్రీరమణాశ్రమం

చేరారు. తాను ఇరవై సంవత్సరాలుగా కృష్ణనామ జపం చేస్తూండేవాడిననీ, ఇప్పుడు మాత్రం భగవంతునికి సంబంధించిన ఆలోచనలనే మనస్సు రానీయడం లేదని చెప్పారు. తానేం చేయాలో మహర్షి చెప్పాలని కోరాడు. మద్రాసు నుండి తిరువణ్ణామలైకి ఎట్లా వచ్చారని మహర్షి ఆయనని అడిగారు. తన సమస్యకీ ఈ ప్రశ్నకీ సంబంధమేమిటో అర్థంకాకపోయినా పూంజాగారు ఎంతో మర్యాదగానే సమాధానమిచ్చారు. 'రైలు'లో అంటూ. తిరువణ్ణామలై చేరగానే ఏమైందన్నారు మహర్షి ఒక ఎద్దు బండి తనని ఆశ్రమానికి చేర్చిందన్నారు. తాను చెప్పదలచుకున్నదేదో ఈ విధంగా శ్రీభగవాన్ వివరించారు: "రైలు మిమ్మల్ని మీ గమ్యానికి చేర్చింది. మీరు రైలు దిగారు, ఇంక దాని అవసరం లేదు కాబట్టి. అలాగే, ఎద్దు బండీను. ఇప్పుడు మీరిక్కడున్నారు. వాటి అవసరమింక లేదు. మీ సాధన విషయంలోనూ అంతే జరిగింది. మీ జపమూ, ధ్యానమూ మీ ఆధ్యాత్మిక గమ్యానికి మిమ్మల్ని చేర్చాయి. మీరు వాటిని వదులుకోకపోయినా, వాటంతట అవే తమ పని అయిపోయిందని తప్పుకున్నాయి. మీరు గమ్యాన్ని చేరారు". ఈ మాటలు అని పూంజా వైపు తీక్షణంగా చూచారు శ్రీభగవాన్. ఆ తరువాత జరిగిన దానిని పూంజా ఇట్లా చెప్పారు. "నిర్మలమైన జలాలతో నా దేహమూ, మనస్సూ క్షాళనమవుతున్నాయనిపించింది. శ్రీరమణుల మౌనవీక్షణం మంత్ర ముగ్ధులను చేస్తుంది. దానిలో నా దేహంలోని అణువణువూ క్షాళనమైపోయింది. ఒక కొత్త దేహం నాకోసం ఏర్పడుతోందనిపించింది. ఏదో మార్పు జరుగుతోంది- పాత శరీరం అణువణువూ క్రమంగా నశిస్తోంది. దాని స్థానంలో కొత్తది తయారవుతోంది. ఒక్కసారిగా అర్థం చేసుకున్నాను. నేను ఆత్మననే ఎరుక హఠాత్తుగా కలిగింది. ఆ పరిపూర్ణ స్థితిలో శాశ్వతంగా నిలిపివేసింది మహర్షి మౌనవీక్షణం. మహర్షి నాకెరుకపరిచిన ఆత్మ యొక్క ప్రత్యక్షానుభవం వల్ల అంతవరకూ బహిర్ముఖమైన 'నేను' నశించింది. ఆ అనుభవమేమిటో వర్ణించలేను, కాని నా ఆధ్యాత్మిక అన్వేషణ ముగిసిందని తెలిసింది. ఆ జ్ఞానానికి మూలం ఎప్పటికీ వర్ణనాతీతంగానే ఉంటుంది."

వాసనాక్షయమయ్యేవరకూ, "నేను" అనేది బయటివాటి వైపే మళ్లీ మళ్లీ వెళ్తూంటుంది.

అది పోయేదాకా ఆత్మ విచారం కొనసాగుతూనే ఉండాలి. చిజ్జడగ్రంధి శాశ్వతంగా తెగిపోయేదాకా. వాసనాక్షయమయిన తరువాతనే మనస్సు పరమాత్మే అయిన తన మూలంలో ఇంకి పోతుంది. అహంవృత్తి కరిగిపోతుంది, మళ్లీ తల ఎత్తదు. అంతిమంగా అదే విముక్తి. అదే సాక్షాత్కారం.

శ్రీభగవాన్ ఉన్నది నలుబది 30వ సూత్రంలో ఇట్లా అంటారు : 'నేనెవరిని' అని మనస్సులో వెదకి, హృదయాన్ని చేరితే 'నేను' అనేది తలవాల్చి, రాలిపోతుంది. వెంటనే 'నేను- నేను' అంటూ తానుగా ఒక వస్తువు వెల్లడి అవుతుంది. అట్లా వెల్లడి అయినా అది అహంభావం కాదు, అది పూర్ణ వస్తువు. అది కేవల ఆత్మ.

## యథార్థస్థితిని అంగీకరించి, శరణాగతి చెందిన తరువాత దుఃఖముంటుందా

కాన్సర్ వచ్చినప్పుడు దానినట్లాగే ఉండనిచ్చి శ్రీభగవాన్ దానిని నిరోధించలేదు. అట్లాగే శిలువపైన వేసినప్పుడు ఏసుప్రభువు ("నా ఇచ్ఛకాదు, నీ ఇచ్ఛనే నెరవేరనీ") అన్నారు- ఈ రెండూ అహంభావరహిత స్థితిలో, పరిపూర్ణంగా అర్పితమవడానికి పరమోదాహరణలు. ఎంతటి అనంగీకారమైన పరిస్థితిలోనైనా అడ్డుకోకుండా ఉండగలిగినప్పుడు, దుఃఖించే వాడంటూ ఎవ్వరూ ఉండరు. ఇంద్రియాలకి చైతన్యముండటం వల్ల నొప్పిని అవి గ్రహించగలుగుతాయి. నొప్పి తెలుస్తుంది. అయినా పరమాత్మ వల్ల కలిగే ప్రశాంతి దానిని కప్పేస్తుంది. బాధ పడుతున్న వారెవరైనా ఒక జ్ఞాని సన్నిధికి వెళ్తే ఆ జ్ఞాని విరజిమ్మే ప్రశాంతిలో మునిగిపోతారు. ఈ విధంగా దుఃఖ నివృత్తే జ్ఞాని యొక్క కరుణగా అనుభవమవుతుంది. మామూలు వ్యక్తి యొక్క బాధ అమరమైన ఆత్మ యొక్క ప్రశాంతిలో మునిగిపోతుంది. ఇంద్రియపరమైన నొప్పి ఉండవచ్చు, కాని గంభీరమైన ప్రశాంతే మిగులుతుంది. శారీరకమైన బాధ ఉపరితలానికే చెందిందనీ, అంత ముఖ్యం కాదనీ అనిపిస్తుంది.

## సాధన, సాధకుడూ అనే భావమే అహంభావం ఇంకా ఉండేట్లు చేస్తుంది

మనస్సనేదే ఒక భ్రమ అనీ, అదే కాలమనీ, దానికి గతంగాని భవితవ్యంగాని లేవనీ

చూశాం. సాధన చేసి భావి కాలంలోసాక్షాత్కారాన్ని పొందగలనని ఎవరైనా అనుకుంటే అపాయముంది. తను సాధకుణ్ణనీ, ముందెప్పుడో ఆత్మసాక్షాత్కారమవుతుందనీ భావిస్తే తనని అనాత్మ అయిన దేహంతో తాదాత్మ్యం చేసుకుంటున్నాడనే అర్థమంటారు శ్రీభగవాన్. 'నేనీ దేహాన్ని' అనే భావంగాని, దేశకాలాల భ్రమగాని క్షీణిస్తున్నా, పేరుకు పోయిన వాసనల వల్లా, అభిప్రాయాల వల్లా మళ్లీ మళ్లీ వాటివైపే వెళ్తాం. ఆత్మ విచారణ చేసినప్పుడల్లా మనిషి వర్తమానానికి (అంటే చైతన్యానికి) తీసుకురాబడతాడు- ఆత్మతో ఏకమవుతాడు. ఆలోచనలు (గతానికీ, భవితవ్యానికీ సంబంధించినవి) రాగానే విచారణ చేసి తిరిగి ఆత్మ స్థితికే వెళ్తూండాలి. అది అతని విధి.

ఆత్మ విచారణ ద్వారా ఏకాంతంగా ఉన్నప్పుడు ప్రశాంతి కలిగినా లౌకిక సంబంధాల వల్ల దానిని కోల్పోతారు. వాసనలు దగ్ధమై, ఆత్మ నిష్ఠలో ఉండగలిగేవరకూ, ఆత్మ విచారణ చేస్తూనే ఉండాలంటారు శ్రీభగవాన్.

అన్నిటికన్నా ముఖ్యమైన విషయమిదే. ఏవిధమైన సాధన చేసినా, స్వేచ్ఛగా ఉండటానికి ఎవరికైనా ఒక్క క్షణమే ఉంది. అదే ఈ క్షణం. నిశ్చలతలో ఉండగలగటమే సాధన యొక్క ఉద్దేశం. దీనినే శ్రీభగవాన్ "ఊరికే ఉండు" అని క్లుప్తంగా చెప్పారు.

పైన చెప్పిన విషయాలకి సంబంధించిన సంభాషణలు తరువాయి భాగంలో ఉన్నాయి.

# ఆత్మసాక్షాత్కార స్థితి అవగాహన- సాధన

## కొన్ని సంభాషణలు

ఈ భాగంలో 'ఆత్మసాక్షాత్కార స్థితి అవగాహన- సాధన' అను అంశము 'శ్రీరమణమహర్షితో సంభాషణములు' నుండి గ్రహించిన సంభాషణలతో విశదీకరింపబడింది.

### 3.01 ఆత్మ సిద్ధము, నిత్యజాగరూకము అయిన శాంతి స్థితి (స.295)

ఆత్మ, పరమాత్మ, సచ్చిదానందము ఒకే వస్తువును అనగా ఆత్మను తెలుపుతాయి. ఆత్మ నిత్యమూ సాక్షాత్కారమయ్యే వున్నది. అట్లాకాకపోతే దానిలో ఆనందము ఉండదు. శాశ్వతము కానిదానికి ఒక ఆరంభము వుండాలి. ఆరంభము వున్నదానికి అంతము గూడా వుంటుంది. కనుక అది తాత్కాలికము మాత్రమే. తాత్కాలిక వ్యవహారదశ కోసం ప్రయత్నించి వుపయోగంలేదు. **యథార్థము ఏమిటంటే, అది అయత్నసిద్ధము, ని త్యజాగరూకము అయిన శాంతిస్థితి. ఏ ప్రయత్నమూ లేక ఎరుకతో వుండటమే ఆనందస్థితి. అదే సాక్షాత్కారము.**

### 3.02 నీ సహజస్థితి, సుషుప్తిలో ఉన్న విధముగా, ఆనందస్థితి (స.321)

భ: దుఃఖములు జాగ్రద్దశలో అనుభవమునకు వస్తాయి. అసలు ఈ దుఃఖములు ఎందుకు రావాలి?

మ: నీవు నీ ఆత్మను చూస్తే, అవి నీకు కన్పించకుండా పోతాయి.

భ: నేను ఎవడను అని వెనుకకు మరలి చూస్తే, నాకేమీ కన్పించటం లేదు.

మ: నీ నిద్రలో నీవు ఎలా ఉన్నావు? అక్కడ 'నేను' తలపు లేదు. అందుచేత నీవు ఆనందముగా ఉన్నావు. **కాని జాగ్రద్దశలో 'నేను' అనే మూలమయిన మొదటితలపు లేచుటవలన, తక్కిన తలపులు విస్తరిస్తాయి.** అవి లోపల ఉన్న ఆనందాన్ని మరుగుపరుస్తాయి. ఆనందానికి అడ్డుగా నిలిచిన ఈ తలపులన్నింటినీ వదలించుకో. నీ సహజస్థితి ఆనందస్థితి. నిద్రలో ఆ విషయము స్పష్టమై ఉన్నది.

## 3.03 దేహ రహిత స్థితిలోనే ఆనందమున్నది (స.206)

**గాఢ నిద్రానుభవము, దేహరహిత స్థితిలోనే ఆనందమున్నదని స్పష్టముగా బోధిస్తున్నది. దేహమును వదలిన తరువాత మోక్షమును గురించి మాట్లాడుతూ జ్ఞానులు ఈ విషయాన్ని ధృవపరుస్తున్నారు. ఈ విధంగా జ్ఞాని దేహమును వదలి వేయటానికి నిరీక్షిస్తూంటాడు.** ఏవిధంగా ఒక కూలీవాడు కూలీకోసం తన తలమీద బరువును మోస్తూ, దాన్ని గమ్యానికి చేర్చి, బరువుదించుకుని, ఉపశమనాన్నీ, సంతోషాన్నీ పొందుతాడో , అదే విధంగా జ్ఞాని ఈ శరీరాన్ని మోస్తూ, విధినిర్ణయించిన, సరైన సమయంకోసం దాన్ని వదలడానికి నిరీక్షిస్తూంటాడు. నీవు ఇప్పుడు సగము బరువునుంచి అనగా, అర్థాంగి నుండి విముక్తి చేయబడినందుకు, కృతజ్ఞుడవై సంతోషింపవద్దా? అయినప్పటికీ, నీ దృక్పథము భౌతికమవడం వలన, నీ వట్లు వుండలేవు.

## 3.04 ఉనికి, లేక చైతన్యం మాత్రమే సద్వస్తువు (అ.ర. 11.1.1946, మధ్యాహ్నం)

కొలంబో నుండి వచ్చిన ఒక యువకుడు భగవాన్‌ను అడిగాడు : చైతన్యము యొక్క మూడు అవస్థలు నాలుగవ అవస్థకంటె, సద్వస్తువుకు సంబంధించి

నంతవరకు, ఏ మేరకు తక్కువ? ఈ మూడు అవస్థలకూ, తురీయావస్థకూ గల సంబంధము ఏమిటి?

భ: **ఉన్న స్థితి ఒకటే. అది చైతన్యము, లేక ఎరుక, లేక ఉనికి.** జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు సత్యమైనవి కావు. అవి వస్తుంటాయి, పోతుంటాయి. **సత్యము అనేది ఎప్పుడూ నిలిచి ఉంటుంది. 'నేను' లేక ఉనికి మూడు అవస్థలలోనూ విడువక ఉంటుంది కనుక అదే సత్యము.** మిగిలిన మూడు అవస్థలూ సత్యములు కావు. అందుచేత, అవి ఫలానా మేరకు సత్యత్వమును కలిగియున్నాయని చెప్పటానికి సాధ్యం కాదు. స్థూలంగా మనము దీనిని యిలా చెప్పవచ్చును.

**ఉనికి, లేక చైతన్యం మాత్రమే సద్వస్తువు.**

మెలకువ = చైతన్యం + మెలకువ

నిద్ర = చైతన్యం + నిద్ర

కల = చైతన్యం + కల

**చైతన్యము అనేది ఒక తెర. తెర మీద చిత్రములు వస్తుంటాయి, పోతుంటాయి. తెర సత్యము; దాని మీది చిత్రములు, ఛాయామాత్రములు.** బహుకాలముగా ఉన్న అలవాటు కారణంగా ఈ మూడు అవస్థలనూ మనము సత్యమైనవిగా భావిస్తున్నాము కాబట్టి చిన్మాత్రస్థితిని (కేవలము ఎరుకగా ఉన్న దశను) నాలుగవ అవస్థగా పేర్కొంటున్నాము. నిజానికి నాలుగవ దశ అంటూ ఏదీ లేదు. ఉన్నది ఒకే ఒక దశ. ఈ సందర్భంగా భగవాన్ తాయుమానవర్ వ్రాసిన దాని నుండి 386వ పద్యమును ఉదహరించారు. **తురీయావస్థ జాగ్రత్ సుషుప్తి లేక సుషుప్త జాగ్రత్తు** అని వర్ణింపబడింది. అంటే అర్థము **జగత్తు విషయంలో సుషుప్తి, ఆత్మ విషయంలో జాగ్రత్తు.**

## 3.05 అవస్థా త్రయము ఆత్మ అనే తెరపై దృశ్యమాత్రములు (స.353)

భ: తురీయము అంటే ఏమిటి?

మ: మూడు అవస్థలు మాత్రమే ఉన్నాయి, జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి. తురీయము అంటే నాలుగవది అని అర్థము కాదు. ఈ మూడు అవస్థలకూ ఆధారముగా తురీయము వాని యందు అంతర్లీనమై ఉన్నట్టిది. కాని జనులు దీనిని సులభముగా గ్రహించలేరు. అందుచేత ఇది తురీయావస్థ అనీ, ఇదే సద్వస్తువు అనీ చెప్పటం జరుగుతుంది. నిజానికి అది దేనికీ భిన్నమైనదికాదు. అది **సమస్త సంఘటనలకు ఆధారమై ఉంది. అది ఏకమాత్రమయిన సత్యము. అది నీ స్వరూపము. మూడు అవస్థలూ దానిమీద క్షణిక దృశ్యములుగా గోచరించి, అందులోనే అణగిపోతుంటాయి. అందుచేత అవి మిథ్యామాత్రములు.**

సినిమా ప్రదర్శనలో చిత్రములు తెరపై సాగిపోతున్న నీడలు మాత్రమే. అవి కన్పిస్తాయి, ముందుకూ వెనుకకూ కదలుతుంటాయి, ఒక దాని నుండి మరియొకటిగా మారుతుంటాయి. అందుచేత అవి మిథ్యారూపములు. కాని తెర మొదటి నుండి తుదివరకూ మారకుండా అలాగే నిలిచి ఉంటుంది. వర్ణ చిత్రముల సంగతి కూడా అలాంటిదే. బొమ్మలు మిథ్యారూపములు, కాన్వాసు సద్రూపము. మన విషయమూ అలాంటిదే. లోపల, బయట తోచే జగద్దృశ్యములన్నీ వచ్చిపోయే దృశ్యమాత్రములు. అవి ఆత్మను వీడి స్వతంత్రముగా ఉండగలిగేవి కావు. వానిని సత్యమైనవిగా చూస్తూ, అవి మన వెలుపల నిలిచి ఉన్నాయని భావిస్తూ ఉండటం మనకు అలవాటై ఉన్నది. మన సత్స్వరూపాన్ని మరుగుపరచి, ఇతర విషయములను గోచరింపచేయుటకు ఆ అలవాటే కారణము. నిత్యసిద్ధము, ఏకమాత్ర సద్వస్తువు అయిన ఆత్మను దర్శిస్తే, తదితరములయిన మిథ్యా విషయములన్నీ కన్పించకుండా పోతాయి. తద్వారా అవి అన్నీ ఆత్మ కంటె వేరు కావు అన్న జ్ఞానము నిలిచి ఉంటుంది.

తురీయము అనేది ఆత్మకున్న మరియొక పేరు. మనకు జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు తెలుసు. కాని మన ఆత్మను గురించి మనకు తెలియని స్థితిలో ఉన్నాము. అయినప్పటికీ ఆత్మ ఇప్పుడే ఇక్కడే ఉన్నది. అదే ఏకమాత్ర సద్రూపము. మరియొకటి ఏదీ లేదు. దేహముతో తాదాత్మ్యభావము ఉన్నంతకాలమూ, ఈ జగత్తు మనకు బయట ఎక్కడో ఉన్నట్లు తోస్తుంది. ఆత్మను సాక్షాత్కరింపజేసుకో. ఇక అవి ఉండవు.

## 3.06 ఆత్మ స్వయంప్రకాశకము, పరప్రకాశకము (అ.ర. 26.6.1946)

ఖన్నా అడిగాడు : చిత్ప్రకాశము+మనస్సు = జీవాత్మ. చిత్ప్రకాశము మాత్రమే అయితే అది పరమాత్మ. ఇది సరియేనా?

భగవాన్ అంగీకరించారు. అంతట వారు తమ తువ్వాలును చూపుతూ, ఇలా చెప్పారు : "మనము దీనిని తెల్లని గుడ్డ అంటున్నాము. కాని గుడ్డనూ, దాని యొక్క తెల్లదనాన్నీ వేరు చేయలేము. చిత్ప్రకాశము, మనస్సు - వీని కలయిక వలన ఏర్పడే అహంత విషయము కూడా అంతే." అంతట వారు ఇంకా ఇలా చెప్పారు : "శాస్త్రాలలో తరచు చెప్పబడే ఈ క్రింది దృష్టాంతము కూడ మీకు ఉపయోగపడగలదు. **నాటకరంగములో ఉండే దీపము పరబ్రహ్మము లేదా నీవు చెప్పినట్లుగా చిత్ప్రకాశము, చిజ్జ్యోతి. అది తనను తాను ప్రకాశింపజేసుకొంటుంది. అలాగే రంగస్థలాన్నీ, అందులోని నటులనూ కూడా ప్రకాశింపజేస్తుంది. మనము ఆ దీపపు కాంతిలో రంగస్థలాన్ని చూస్తాము, నటులను చూస్తాము. దాని వెలుతురు నాటకము ముగిసిన తరువాత కూడా అలాగే నిలిచి ఉంటుంది.** ఇనుప గుండు యొక్క మరియొక దృష్టాంతం ఉంది. ఇనుప గుండు మనస్సుతో పోల్చబడింది. అగ్ని దానితో చేరుతుంది. అది ఎఱ్ఱగా, వేడిగా ఉంటుంది. అది ప్రకాశిస్తుంటుంది. వస్తువులను కాల్చుతుంది. అగ్ని చేసే పనులన్నీ చేస్తుంది. కాని దానికొక నిర్ణీతమయిన రూపము ఉంది. అగ్నికి అట్టి రూపమేదీ లేదు. దానిపై సమ్మెటతో

కొడితే, ఇనుపగుండుకు దెబ్బ తగులుతుంది. అగ్నికి ఏ దెబ్బ తగులదు. ఆ ఇనుప గుండు జీవాత్మ. అగ్ని ఆత్మ, లేక పరమాత్మ."

## 3.07 ఆత్మ చైతన్యముగావుంది. దానికి కర్మలతో సంబంధము లేదు (ప్ర. 313)

భ: నేను జాగ్రత్త తీసుకొననిచో పని దెబ్బతిన వచ్చును.

మ: నువ్వు దేహంతో తాదాత్మ్యం చెందుతున్నావు గనుక, పని నీ చేత చేయబడుతోందని అనుకుంటున్నావు. కానీ, శరీరము, దాని కార్యకలాపాలు, పనితో సహా, ఆత్మకన్నవేరుకావు. నువ్వు పనిని శ్రద్ధతో చేసినా, చెయ్యకపోయినా అయ్యేదేమిటి? నువ్వు ఒక చోటునుంచి మరొక చోటుకి నడుస్తున్నావనుకో. నువ్వు వేసే ప్రతి అడుగును గమనించవు గదా కొంత సమయం తరువాత గమ్యస్థానంలో వుంటావు. పని, అంటే నడక, నీవు శ్రద్ధచూపక పోయినా ఎల్లా కొనసాగిందో గమనించు. ఇతర విధాలయిన పనులతో గూడ అంతే.

భ: అట్లాగయితే అది నిద్రలో నడవటం వంటిది.

మ: సరిగ్గా అంతే. పిల్లవాడు గాఢనిద్రలో వున్నప్పుడు, అతని తల్లి అతనికి నిద్రలోనే అహారమిస్తుంది. పిల్లవాడు మెలకువలో ఉన్నప్పుడు ఎట్లా ఆహారాన్ని తింటాడో అట్లాగే తింటాడు. కాని మరునాడు వుదయం, 'అమ్మా, నేను నిన్నరాత్రి అన్నంతినలేదు' అంటాడు. అతను అన్నము తిన్నట్లు తల్లికి, మిగిలిన వారికీ తెలుసు. కానీ అతను తాను తినలేదని అంటాడు. అతనికి తెలియకపోయినా పని కొనసాగిపోయింది. ఈ విధమైన పనికి నిద్రలో నడక నిజంగా చక్కని పోలిక.

మరొక ఉదాహరణ తీసుకో: ఒక బాటసారి బండిలో నిద్ర బోయినాడు. బండికి కట్టిన ఎద్దులు ముందుకు పోతుంటాయి, ఆగుతుంటాయి, లేదా బండి నుండి విడువబడతాయి. ప్రయాణ సమయంలో ఇవి యేవి జరిగినా, ఆ బాటసారికి

తెలియదు. అతడు మేల్కొనే సమయానికి తాను వేరొక చోట ఉన్నట్లు తెలుసుకుంటాడు. త్రోవలో జరిగిన సంఘటనలను గురించి అతనికి తెలియనే తెలియదు. కాని అతని ప్రయాణము మాత్రము పూర్తి అయింది. మనిషి యొక్క ఆత్మ విషయము కూడా అంతే. అతడు దేహంలో నిద్రిస్తూ ఉన్నాడు. ఎద్దులు ముందుకుపోవటం జాగ్రదవస్థ. ఎద్దులు కదలక నిలిచి ఉండటం సమాధ్యవస్థ. (సమాధి అంటే జాగ్రత్ సుషుప్తి). అంటే **అతనికి ఎరుక ఉంటుంది, కాని కర్మలతో సంబంధము ఉండదు.** ఎద్దులు బండికి కట్టబడి ఉన్నా, కదలక నిల్చి ఉంటాయి. నిద్రపోవటం అంటే ఎద్దులను బండి నుండి విప్పటం. ఆ స్థితిలో క్రియాకలాపములన్నీ స్తంభించిపోతాయి. కాడి నుండి ఎద్దులను విప్పినట్లుగా నన్నమాట.

## 3.08 దేహము శవము మాత్రమే, చైతన్యమే దానిని సజీవమొనరిస్తున్నది (స.386)

భ: శ్రీరామకృష్ణ పరమహంస జీవితంలో ఒక రామ్‌లాల్ విగ్రహం, చైతన్యవంత మయినట్లు చెప్పబడింది.

మ: ఈ శరీరము చైతన్యవంతమెలా అయిందో నీవు వివరింపగలవా? శరీరము యొక్క కదలిక కంటె విగ్రహము యొక్క కదలిక ఆశ్చర్యకరమా?

భ: లోహము తనంతటి అది కదలదు కదా?

మ: **ఈ శరీరము ఒక శవము కాదా? ఒక శవము కదలితే బహుశా నీవు వింతగా భావిస్తావు. అవునా?**

## 3.09 సమాధి మనస్సుకీ వాక్కుకీ అతీతమైనది (స.110)

ఒక అమెరికన్ వనిత భగవాన్‌ని, ఆయన సమాధి అనుభవాలు ఎట్టివని అడిగింది. ఆమె తన అనుభవాలగురించి చెప్పి, అవి సరైనవో కావో తెలిసికోవటం సబబని

చెప్పగా, ఆమె, భగవాన్ అనుభవాలు సరి అయినవి అయితీరాలి గనుక అవి తెలుసు కోదగినవనీ, తన అనుభవాలు ముఖ్యంకాదనీ అంది. శ్రీ భగవాన్‌కి తమ దేహము సమాధిలో వేడిగా వున్నట్లు అనిపించిందా చల్లగా వున్నట్లు అనిపించిందా, వారు తిరువణ్ణామలైలో తమ మొదటి మూడున్నర సంవత్సరాలు ప్రార్థనలో గడిపారా, అన్న వాటి గురించి ఆమె తెలుసుకోగోరింది.

మ: సమాధి మనస్సుకీ వాక్కుకీ అతీతమైనది గనుక వర్ణించటానికి వీలులేనిది. ఉదాహరణకు, గాఢనిద్రని వర్ణించలేము. సమాధి స్థితిని వర్ణించడం అంతకన్నా కష్టం.

భ: అయినా, అది ఎటువంటిదో మీరు చెప్పవచ్చు

మ: నీవు సమాధిలో వున్నప్పుడే అదినీకు తెలుస్తుంది.

### జాగ్రదవస్థ, స్వప్నావస్థ

శ్రీ భగవాన్ (3.04, అ.ర.11.1.46)) ప్రసంగిస్తూ ఇలా చెప్పారు :

మెలకువ = చైతన్యము + మెలకువ

కల = చైతన్యము + కల

## 3.10 మనస్సు పుట్టి, లయమయ్యే కేంద్రము హృదయము (స.474)

ఉపనిషత్తులలో హృదయము యొక్క వివరణ ఇలా ఉన్నది ; హృత్ + అయం అనగా ఇది కేంద్రము. **అనగా మనస్సు ఆవిర్భవించి అణగే చోటు హృదయము. అది ఆత్మానుభవ స్థానము.** అదే ఆత్మ అని నేను చెప్పినప్పుడు అది శరీరములో ఉన్నదని జనులు భావిస్తున్నారు. నిద్రలో ఆత్మ ఎక్కడ ఉన్నదని నేను అడిగితే, అది శరీరము లోపల ఉన్నదనీ, ఒక చీకటి గదిలో బంధింపబడిన మనిషి మాదిరిగా దానికి దేహముగాని, చుట్టూ ఉండే పరిసరాలుగాని తెలియవనీ వారు

తలుచుచున్నట్లుగా అనిపిస్తుంది. అట్టి వారికి ఆత్మానుభవస్థానము దేహములోపల ఒకానొక చోట ఉన్నదని చెప్పవలసి ఉంటుంది. ఆ కేంద్రము యొక్క పేరు హృదయము. కాని దానిని మాంసపిండమయిన గుండెగా భ్రమిస్తున్నారు.

ఒక మనిషి నిద్రించేటప్పుడు తనను (అనగా అహంతను, ద్రష్టను) అలాగే తన చుట్టూ ఉండే పరిసరములను సృష్టించుకుంటాడు. అవి అన్నీ తరువాత అతనిలోనే అణగిపోతున్నాయి. **ఒకడు అనేకము (స్వప్న ద్రష్టతో సహా) అయినాడు. అదే విధముగానే, జాగ్రద్దశలో కూడా ఒకడు అనేకము అవుతాడు. దృశ్య ప్రపంచము వాస్తవానికి దృక్‌రూపమే.** ఒక ఖగోళ శాస్త్రజ్ఞుడు అనంత దూరములో ఉన్న ఒకానొక నక్షత్రమును కనుగొని, ఆ నక్షత్ర కాంతి భూమిని చేరాలంటే వేలాది కాంతి సంవత్సరములు పడుతుందని ప్రకటిస్తాడు. బాగుగానే ఉన్నది కాని, నిజానికి ఆ నక్షత్రము ఎక్కడ ఉన్నది? అది ఆ చూచే వాడిలో (ద్రష్టలో) లేదా? కాని జనులు ఆశ్చర్యపడుతుంటారు. అంత మహా దూరమున ఉన్న ఒక పెద్ద గోళము, సూర్యగోళము కంటె పెద్దది, మానవుని అల్పమయిన మెదడులోని అరలలో ఎలా ఇముడుతుంది? **ఆకాశము, అపారమయిన ఆయామములు, ఈ విరోధాభాసము - ఇవి అన్నీ ఉన్నది మనస్సులోనే.** అవి అక్కడ ఎలా ఉన్నాయి? నీవు వానిని తెలుసుకుంటున్నావు కదా! అంటే తెలుసుకొనేందుకు వానిని ప్రకాశింపజేసే ఒక వెలుగు ఉండవలయునని నీవు అంగీకరించాలి. **ఈ తలపులన్నీ నిద్రలో లేవు. నిద్ర నుండి మేల్కొనగానే ఇవి అన్నీ పైకి లేస్తున్నాయి. అంటే ఈ వెలుగుకు ఆద్యంతములు ఉన్నాయి. అందువల్ల అది అశాశ్వతమైనట్టిది.** కాని 'నేను' **చైతన్యము శాశ్వతము, అవిచ్ఛిన్నము.** కాబట్టి ఇది పైన పేర్కొన్న కాంతి కాదు. అది భిన్నమైనట్టిది, అయితే స్వతంత్ర అస్తిత్వము లేనట్టిది. కాబట్టి దానిని ఆభాసము (ప్రతిబింబిత కాంతి) అనాలి. మెదడులోని వెలుగు ఈ విధముగా ఆభాస సంవిత్తు లేదా ఆభాససత్తు. సంవిత్తు గాని, సత్తు కాని హృదయము అనబడే కేంద్రములో ఉన్నది. నిద్ర నుండి మనిషి మేల్కొనగానే అది శిరస్సులో ప్రతిబింబిస్తుంది. అందుచేత శిరస్సు వ్రాలి ఉండక పైకి లేస్తుంది. అక్కడి నుండి చైతన్యము

దేహమంతటిలో వ్యాపిస్తుంది. అంతట అధ్యారోపితమైన 'నేను' జాగ్రతత్త్వముగా వ్యవహరిస్తుంది.

మెదడులోని శుద్ధకాంతి శుద్ధమనస్సు. అది తరువాత కలుషితమయి మలినమనస్సు అవుతుంది. అదే మామూలుగా మనస్సుగా తెలియబడుతుంది. ఇవి అన్నీ ఆత్మలో నిలిచి ఉన్నాయి. శరీరము, దాని ప్రతిరూపములు – అన్నీ ఆత్మయందే ఉన్నాయి. ఆత్మ శరీరములో బంధింపబడిలేదు. అలా సాధారణంగా భావింపబడుతుంది, అంతే.

## 3.11 ఆత్మ చేత ప్రకాశితమైనప్పుడు మనస్సు జగత్తును తెలుసుకుంటుంది; అలా ప్రకాశింపజేయబడనప్పుడు అది జగత్తును ఎరుగదు (స.98)

శ్రీ భగవాన్ ఇంకా యిలా వివరించారు : ఆత్మ హృదయమే. ఆత్మ స్వయంప్రకాశము, స్వయంజ్యోతి. హృదయము నుండి జ్యోతి పైకి లేచి, మెదడుకు చేరుతుంది. మెదడు మనఃస్థానము. **జగత్తును మనస్సు చూస్తుంది; అంటే ఆత్మ యొక్క ప్రతిబింబిత కాంతితో చూస్తుంది.** మనస్సు యొక్క సాయముతో జగత్తు కన్పిస్తుందన్నమాట. **మనస్సు ప్రకాశితమైనప్పుడు, దానికి జగత్తు గోచరిస్తుంది. అనగా దానికి జగత్తు యొక్క ఎరుక ఉంటుంది. మనస్సు ఆ విధంగా ప్రకాశితము కాకపోతే, దానికి జగత్తును గూర్చిన ఎరుక ఉండదు.** ఆ ప్రకాశము యొక్క (జ్యోతి యొక్క) మూలము వైపు, అనగా లోనికి మనస్సును మరల్చినచో, విషయజ్ఞానము నశించి, ఆత్మయే హృదయముగా వెలుగుతుంది.

చంద్రుడు సూర్యుని యొక్క ప్రతిబింబిత కాంతిలో వెలుగుతున్నాడు. సూర్యుడు అస్తమించినప్పుడు, వస్తువులు కన్పించేందుకు, చంద్రుని కాంతి ఉపయోగపడుతుంది. సూర్యుడు ఉదయించగానే, చంద్రుని యొక్క అవసరం ఎవరికీ ఉండదు. ఆకాశంలో వెలవెలబోతున్న చంద్రబింబము కన్పిస్తుంది.

మనస్సు, హృదయము – వీని సంగతి కూడా అంతే. దాని ప్రతిబింబిత కాంతి వలన మనస్సు ఉపయోగకరంగా ఉంటుంది. వస్తువులను చూడటానికి అది పనికివస్తుంది. కాని ఆ మనస్సు అంతర్ముఖమైతే, ప్రకాశమునకు మూలము దాని అంతట అదే వెలుగుతుంది. మనస్సు మసకమసకగా, పగటి పూట (ఆకాశంలో కన్పించే) చంద్రునిలాగా, ఉంటుంది.

## 3.12 విశ్వచైతన్య మంటే అభేదస్థితి (స.510)

ఉల్లము అంటే శుద్ధ మనస్సు, లేక శుద్ధ సద్రూపముగా నున్న మనస్సు, అనగా తలపులు ఏవీ లేనట్టి మనస్సు. అది తలపులచే క్రిక్కిరిసి ఉండనట్టి మానసాకాశమును పోలిన మనోవ్యోమము. మనిషి నిద్ర నుండి మేల్కొనప్పుడు శిరస్సుపైకి లేస్తుంది. అప్పుడు చిజ్జ్యోతి మాత్రమే ఉంటుంది. ఆ జ్యోతి అప్పటికే హృదయములో ఉన్నది. అది తరువాత మెదడుపై ప్రతిబింబితమై చైతన్యముగా గోచరిస్తుంది. ఇది యింకా పరిమితమై ఉండదు. అహంకారము ప్రవేశించే దాకా ఈ స్థితి ఉంటుంది. ఈ అభేదస్థితిలో అది విశ్వమూర్తిగా (విశ్వ మానసము గా లేక విశ్వచైతన్యముగా) ఉంటుంది. ఈ స్థితి మామూలుగా ఒక నిమిషముసేపు ఉండి అటు పిమ్మట తెలియకుండానే తొలగిపోతుంది. ఇంతలో అహంకారము చొరబడటంతో, అది ఉపాధిగతమయి, ఒకానొక శరీరానికి ప్రత్యేకమవుతుంది. అప్పుడు మనిషి 'నేను' అంటాడు. ఈ 'నేను' ఎప్పుడూ ఒకానొక తత్త్వముతో (ఇక్కడ దేహముతో) ముడిబడి ఉంటుంది. అప్పుడే దేహముతో 'నేను' తాదాత్మ్యము చెందుతుంది. ఇక మిగిలినదంతా దాన్ని అనుసరించుకొని వస్తుంది. ఉల్లము ప్రతిబింబిత కాంతి కనుక దానిని చంద్రుడు అని చెప్పటం జరుగుతోంది. ఆద్యకాంతి హృదయములో ఉంది. దానిని సూర్యుడు అని చెబుతారు.

**3.13 జగత్తు యొక్క సృష్టి, లయము - ఇవి సాలీడు దారపు గూటిని సృష్టించి మరల తనలోకి లాగుకొన్నట్లుంటాయి (స.25)**

భ: మనస్సుకూ, విషయమునకూ నడుమ గల సంబంధం ఎటువంటిది? మనస్సు తనకు భిన్నమయిన దానిని, అనగా జగత్తును, గ్రహిస్తున్నదా?

మ: జగత్తు జాగ్రత్ స్వప్నదశలతో గ్రహింపబడుతోంది, లేక అది ఇంద్రియగోచరము, భావగోచరము అయిన విషయముగా ఉంటోంది. ఈ రెండూ మనోవ్యాపారములే. జాగ్రత్, స్వప్న, రూపమైన తలపులు లేకపోతే, ప్రపంచ గ్రహణము గాని ప్రపంచమును గూర్చిన జ్ఞప్తిగాని ఉండవు. సుషుప్తిలో అట్టి వ్యాపారమేదీ లేదు. విషయములు, జగత్తు సుషుప్తిలో మనకు ఉండవు. కనుక సుషుప్తి దశనుండి వెలికి వచ్చిన అహంతచే 'జగత్తు సత్యము' అనెడి భావము కల్పింపబడవచ్చు, ఆ జగత్తు సత్యమను భావన, సుషుప్తిలో మనస్సు మరల తన నిజస్వరూపమును పొందుట చేత మ్రింగి వేయబడవచ్చు, లేదా అదృశ్యము కావచ్చును. **ప్రపంచము యొక్క ఆవిర్భావము, అంతర్ధానములు, సాలీడు సున్నితమైన దారపు గూటిని సృష్టించి దానిని మరల తనలో లయము చేసుకొనుట వలె ఉంటాయి. ఇక్కడ సాలీడు జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి అవస్థాత్రయమునకు ఆధారముగా, వాని యందు అంతర్లీనముగా ఉంది; మనిషిలో ఆ సాలీడు ఆత్మ అని పేర్కొనబడుతుంది.** అదే ఆత్మ ప్రపంచపరముగా (ప్రపంచము సూర్యుని నుండి పుట్టినదని చెబుతారు) బ్రహ్మము అని పేర్కొనబడుతుంది.

**3.14 'నేను', ఈ జగత్తు - ఇవి జాగ్రత్ స్వప్నములలోనే గ్రహింపబడుతున్నాయి, సుషుప్తిలో గ్రహింపబడటం లేదు (స.641)**

సద్విద్యయందలి మొదటి పద్యభావమును వివరించుచు శ్రీ భగవాన్ ఇలా చెప్పారు: జగత్తు ఎల్లప్పుడూ ప్రతివానికీ గోచరిస్తూనే ఉంది. 'నేను, ఈ జగత్తు ఉన్నాము', అని అందరూ తెలుసుకోవాల్సిందే. అయితే విచారణ చేసి చూసినప్పుడు, 'ఇవి

ఎల్లప్పుడూ ఉంటున్నాయా?' అంతేకాకుండా, "అవి సత్యములే అయితే దేశ కాలములకు, విభేదములకు ఎట్టి సంబంధము లేకుండానే అవి ఉండవలయును కదా! అలా ఉంటున్నాయా?" జాగ్రత్ స్వప్నావస్థలలోనే అవి గోచరిస్తున్నాయి కాని, సుషుప్తిలో గోచరించటం లేదు అనే విషయము స్పష్టమే. అందుచేత, 'నేను' **మరియు ఈ జగత్తు** కొన్ని సమయాల్లో కన్పిస్తున్నాయి, **అదృశ్యమవుతున్నాయి. అవి పుదుతున్నాయి,** (కొంతకాలం) ఉంటున్నాయి, ఆ తరువాత గిదుతున్నాయి. అవి ఎక్కడి నుండి వస్తున్నాయి? అవి దేనిలో నిలిచియున్నాయి? కన్పించకుండా పోయినప్పుడు అవి ఎక్కడికి పోతున్నాయి? ఇటువంటి దృశ్యజగత్తు సత్యమని అంగీకరించ వీలుందా? అంతే కాకుండా, **నేను, జగత్తు, జగద్విషయములు,** వాని **పోషణము, సంహారము - అవి అన్నీ జాగ్రత్‌స్వప్నములయందు మాత్రమే గోచరిస్తున్నాయి కాని, సుషుప్తి దశలో గోచరించటం లేదు.** మిగిలిన రెండు దశలకంటె సుషుప్తి దశ ఏవిధముగా భిన్నము? **సుషుప్తిలో ఏ తలపులూ లేవు, తక్కిన రెండు దశలలోను తలపులు ఉన్నాయి. కనుక అక్కడ 'నేను' కూ జగత్తుకూ మూలముగా తలపులు ఉన్నాయని చెప్పాలి.** ఇక తలపుల సంగతి యేమిటి? అవి సహజసిద్ధముగా ఉన్నవి కావు. అదే కాకపోతే, అవి ఒకసారి ఉండి మరొకసారి లేకుండా పోతాయా? ఆ తలపులు ఎక్కడి నుండి పుదుతున్నాయి? **వానికి మూలముగా ఉన్న తత్త్వము నిత్యసిద్ధముగా, ఎట్టి మార్పులకులోను కానట్టిదిగా ఉండాలన్న** విషయం **అంగీకరించాలి. అది శాశ్వతస్థితి అయి ఉండాలి.** ఉపదేశమంత్రములో ఇదే కదా చెప్పబడింది : "సకల భూతములు దేనియందుండి కల్గినవో, కల్గినవి దేనియందు జీవించియున్నవో, నశించునపుడు దేనియందు లయమగునో."

## 3.15 స్వరూపస్థితియే జ్ఞానము (స.363)

భ: అహంత ఎలా పుట్టింది?

మ: అహంత అనేది అసలు లేదు. అలా కాకపోతే, నీవు రెండు ఆత్మలు ఉన్నవని

ఒప్పుకుంటావా? అహంతయే లేకపోతే, అవిద్య ఎక్కడి నుండి వస్తుంది? నీవు విచారణ చేయటం మొదలుపెడితే, లేని అవిద్య లేనట్లుగా తెలుస్తుంది లేదా, అది మాయమైపోయిందని నీవు చెబుతావు. అజ్ఞానము అహంతకు సంబంధించినట్టిది. నీవు అహంతను గూర్చి ఆలోచించటం ఎందుకు, దుఃఖించటం ఎందుకు? అయినా అజ్ఞానము అంటే ఏమిటి అసలు? అది మాయ. ఏది లేదో అది మాయ. అయినప్పటికీ, ప్రాపంచిక జీవితంలో అవిద్య అనే ప్రతిపాదన అవసరమే. అవిద్య అంటే మన అజ్ఞానమే, అంతకు మించి మరేమీ లేదు. అది **అజ్ఞానము లేక ఆత్మవిస్మృతి.** సూర్యుడి ముందు చీకటి ఉంటుందా? అలాగే స్వతస్సిద్ధము, స్వయంప్రకాశము అయిన ఆత్మ ఎదుట అజ్ఞానము నిలిచి ఉండగలదా? నీవు ఆత్మను తెలుసుకుంటే, చీకటి ఉండదు, అజ్ఞానము ఉండదు, దుఃఖము ఉండదు. కష్టములు, దుఃఖములు మొదలయినవన్నీ భావించేది మనస్సే. చీకటి అనేది రాదు, పోదు. సూర్యుణ్ణి చూడు, ఇక చీకటి ఉండదు. అలాగే ఆత్మను చూడు, అవిద్య లేనేలేదని తెలుస్తుంది.

భ: శ్రీ రామకృష్ణాదులు ధ్యానాభ్యాసము చేశారు.

మ: ధ్యానము తదితర సాధనలు అజ్ఞానము లేదని గుర్తించేందుకే ఉద్దేశింపబడ్డాయి. తన ఉనికిని ఎవ్వరూ నిరాకరించలేరు. **ఉనికియే ఎరుక, జ్ఞానము.** ఎరుక అజ్ఞానము లేకపోవడాన్ని సూచిస్తుంది. అందుచేత ప్రతివాడూ సహజంగానే అజ్ఞానము యొక్క లేమిని అంగీకరిస్తాడు. అయినా ఇంకా అతడు ఎందుకు దుఃఖించటం? ఎందుకంటే – అతడు 'నేను ఇది', లేక 'నేను అది' అని అనుకుంటుంటాడు. అది పొరపాటు. **'నేను ఉన్నాను' అనేదే ఉన్నది. 'నేను ఫలానా' లేక 'నేను అట్టివాడను, ఇట్టివాడను' అనేది లేదు. ఉనికి దేనితోనూ కలసి ఉండనప్పుడు అది ఒప్పు. ఉపాధితో కలసి వున్నప్పుడు తప్పు.** ఉన్న యథార్థమంతా ఇది మాత్రమే. ప్రతివాడూ ఎలా 'నేను ఉన్నాను' అని అంగీకరిస్తాడో చూడు. 'నేను ఉన్నాను' అని తెలుసుకొనే నిమిత్తం అతడు అద్దంలో చూసుకోవాలా? **అతని ఎరుకయే అతని ఉనికిని, స్వరూపమును అంగీకరించేట్లు చేస్తున్నది. కాని అతడు దానిని దేహము, ఇత్యాదులుగా భ్రాంతి**

పొందుతున్నాడు. అతడు అలా ఎందుకు చేయటం? తన దేహము గూర్చి అతనికి నిద్రలో తెలుసా? లేదే! అయినా నిద్రలో అతడు లేకుండా పోయినాడా? దేహము లేకపోయినా అతడు అక్కడ ఉండనే ఉన్నాడు కదా! నిద్రలో తాను ఉన్నట్లు అతనికి ఎలా తెలిసింది? తన స్వరూపమిది అని తెలియజేసేందుకు అతడు అద్దంలో చూసుకోవాలా? కేవలం ఎరుకతో ఉండు, నీ ఎరుకలో నీ స్వరూపము స్పష్టమై ఉన్నది.

భ: ఆత్మను తెలుసుకోవటం ఎలా?

మ: **"ఆత్మగా ఉండటమే' 'ఆత్మను తెలుసుకోవటం'.** 'ఆత్మను నేను ఎరుగను' అని నీవు చెప్పగలవా? నీ కళ్లను నీవు చూడలేకపోయినప్పటికీ చూచుకోవటానికి, నీకు అద్దాన్ని యివ్వకపోయినప్పటికీ, నీకు కళ్లు ఉన్నాయన్న సత్యాన్ని నిరాకరించగలవా? అదే విధంగా ఆత్మను అన్య వస్తువువలే చూడక పోయినా, ఆత్మను నీవు ఎరుగుదువు. లేక అది అన్య వస్తువుగా చూడబడటంలేదు కనుక, నీ ఆత్మ లేదు అంటావా? 'నేను ఆత్మను తెలుసుకోలేను' అని నీవు చెప్పినప్పుడు దాని అర్థము సాపేక్షజ్ఞానము* లేకపోవటమే. నీవు అంతగా సాపేక్ష జ్ఞానమునకు అలవాటుపడి పోయి, దానితో తాదాత్మ్యం చెంది ఉండటమే దానికి కారణము. ఆత్మను అన్య వస్తువు వలె తెలుసుకొనుట కుదరదు కనుక, అట్లా గుర్తించే ఈ తప్పిదం వలన స్పష్టమై ఉన్న ఆత్మ తెలియటం లేదు అనే కష్టం వచ్చిపడింది. అందుచేత నీవు' 'ఆత్మను తెలుసుకోవటం ఎలా?' అని అడుగుతున్నావు. నీ కష్టం **అంతా 'ఎలా?' అనే దానిపై నిలిచి ఉంది. ఆత్మను తెలుసుకోవలసింది ఎవరు? దానిని దేహము తెలుసుకోగలదా? దానికి దేహమే జవాబు చెప్పనీ. ఈ దేహం కన్పిస్తున్నది అని చెప్పేది ఎవరు?** ఇట్టి అజ్ఞానమును తృప్తి పరచేందుకు శాస్త్రాలలో భగవంతుని లీల అనీ, క్రీడ అనీ ఒక సిద్ధాంతం రూపొందించబడింది. భగవంతుడు మనస్సుగా. ఇంద్రియములుగా, దేహముగా ఆవిర్భవించాడనీ, వాని ద్వారా

---

* అన్య వస్తువును చూచుటకు ఉపయోగపడు ఇంద్రియ జ్ఞానము.

క్రీడిస్తున్నాడనీ చెప్పబడింది. ఈ నాటకము అంతా నీకు బాధాకరముగా ఉన్నదని భగవంతుని చర్యలను ప్రశ్నించేందుకు నీవు ఎవరు? ఉండుటయే నీ కర్తవ్యము: ఇదిగానో అదిగానో ఉండటం కాదు. 'నేను ఆ నేను-ఉన్నాను,' అనేది సత్యమునంతటినీ సంక్షేపించి చెబుతున్నది. ఆ విధానము యొక్క సారాంశము 'నిశ్చలముగా ఉండు' అన్న వాక్యములో చెప్పబడింది. 'నిశ్చలత్వము' అంటే ఏమిటి? 'నిన్ను నీవు నశింప జేసుకో' అని దాని అర్థం. ఎందుకంటే ఏ రూపమైనప్పటికీ, ఏ ఆకారము అయిన ప్పటికీ, అది కష్టదాయకమే అవుతుంది. 'నేను ఫలానా' అనే అభిప్రాయమును వదలిపెట్టు. 'అహమితి స్ఫురతి' (అది 'నేను' అని స్ఫురించుచున్నది) అని శాస్త్రములలో చెప్పబడింది.

భ: స్ఫురణ అంటే ఏమిటి?

మ: 'నేను' - 'నేను' (అహం అహం) అనేది ఆత్మ; "నేను ఇది" లేక "నేను అది" (అహం ఇదం) అనేది అహంత. స్ఫురణ ఎప్పుడూ ఉన్నది. అహంత నశ్వరమైనట్టిది. **'నేను'గా మాత్రమే 'నేను' నిలిచి ఉంటే, అదే ఆత్మ. అది దారి మళ్లి 'ఇది' అని అంటే, అది అహంత.**

భ: ఈశ్వరుడు ఆత్మకంటె వేరుగా ఉన్నాడా?

మ: ఆత్మయే ఈశ్వరుడు - 'నేను ఉన్నాను' అన్నది ఈశ్వరుడు. 'నేను ఆత్మను ఓ గుడాకేశ!' (అహమాత్మా గుడాకేశ). నీవు జీవాత్మను పట్టుకొని ఉంటున్నావు కనుక ఈ ప్రశ్న తలెత్తుతున్నది. నీవు సత్యాత్మను పట్టుకుంటే ఈ ప్రశ్నయే రాదు. **ఎందుకంటే - సత్యాత్మ దేనిని గురించి అడుగదు, అడుగలేదు. ఈశ్వరుడు ఆత్మకంటె వేరు అయితే అప్పుడు ఆయన ఆత్మ లేని ఈశ్వరుడు అవుతాడు. అది అసంబద్ధము కాదా!**

## 3.16 ఒకే ఒక చైతన్యము ఉన్నది, అదే జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలలో అధిష్ఠానంగా ఉంటుంది (స.43)

భ: స్వామిజీ, బ్రంటన్ వ్రాసిన 'రహస్య భారతంలో అన్వేషణ' అన్న గ్రంథాన్ని చదివాను. ముఖ్యముగా అందులోని చివరి అధ్యాయము నన్ను ముగ్ధుణ్ణి చేసింది. తలపులు లేకుండా ఎరుకతో ఉండటం సాధ్యమే అని అతడు అందులో చెప్పారు. శరీరాన్ని మరచిపోయి, మనిషి తలపులతో ఉండగలడని నాకు తెలుసు. కాని మనస్సు లేకుండా మనిషి ఆలోచన చేయగలడా? తలపులకు అతీతమయిన ఆ ఎరుకను (చైతన్యమును) పొందటం సాధ్యమవుతుందా?

మ: అవును, **ఒకే చైతన్యము ఉన్నది; అది జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థల యందు అధిష్ఠానంగా యుంటుంది.** సుషుప్తిలో 'నేను' లేదు. మేల్కొనగానే 'నేను' తలపు ఆవిర్భవిస్తుంది. అంతట జగత్తు గోచరిస్తుంది. సుషుప్తిలో ఈ 'నేను' ఎక్కడ ఉంది? అసలు అది అక్కడ ఉన్నదా, లేదా? అది అక్కడ కూడాఉండి తీరాలి. అయితే ఇప్పుడు నీవు భావిస్తున్నట్లు మాత్రం కాదు. **ఇప్పుడు ఉన్నది 'నేను' తలపు మాత్రమే. కాని సుషుప్తిలోని 'నేను' అసలు 'నేను'. అది అన్ని దశలలోనూ ఉంటుంది. అదే చైతన్యము, ఎరుక,** దానిని తెలుసుకుంటే, అది తలపుల కతీతమైనదని నీవు గ్రహిస్తావు.

## 3.17 తలపులు ఆత్మనుండి ఆవిర్భవిస్తున్నాయని తెలుసుకోవటమే అహంత నాశనమునకు మార్గము (స.80)

మంచి భక్తిపరుడు, సరళస్వభావుడు అయిన ఒక భక్తుడు, మూడేండ్ల వయస్సు గల తన ఏకైక పుత్రుని కోల్పోయినాడు. మర్నాడు తన కుటుంబముతో సహా ఆశ్రమమునకు వచ్చాడు. అతనిని ఉద్దేశంలో పెట్టుకొని, భగవాన్ ఇలా చెప్పారు: "మనస్సుకు తగిన శిక్షణ యిస్తే, అది దుఃఖములను, వియోగములను ధైర్యముతో తట్టుకొనేందుకు సాయపడుతుంది. మనిషికి దుఃఖములన్నిటిలోను సంతాన నష్టము

మిక్కిలి బాధాకరమైనట్టిది. మనిషి తనకొక నిశ్చితమయిన రూపము ఉన్నవాడనని భావించినంతకాలము దుఃఖము ఉంటూనే ఉంటుంది. రూపభావమును అధిగమిస్తే ఆత్మ శాశ్వతమైన తత్త్వము అని మనిషి తెలుసుకుంటాడు. మరణమూ లేదు, జననమూ లేదు. పుట్టేది శరీరమే. శరీరము అహంత కల్పించినట్టిది. **కాని మామూలుగా అహంత శరీరము లేకుండా గోచరించదు.** అది ఎల్లప్పుడూ దేహముతో తాదాత్మ్యము చెంది ఉంటుంది. తలపే ప్రధానమైనట్టిది. సుషుప్తిలో తనకు తన దేహము యొక్క ఎరుక ఉన్నదా అని వివేకం గల మనిషి ఆలోచించి చూడాలి. జాగ్రద్దశలోనే అతనికి దేహము యొక్క ఎరుక ఉంటున్నదే, ఎందుచేత? కాని సుషుప్తిలో దేహము యొక్క ఎరుక లేకపోయినప్పటికీ, అప్పుడు అక్కడ ఆత్మ లేదా? సుషుప్తిలో అతడు ఏ రీతిగా ఉన్నాడు? మేల్కొనియున్నప్పుడు ఎలా ఉన్నాడు? రెండు దశలలోనూ ఉన్న భేదమేమిటి? అహంత పైకి లేస్తుంది. అది మెలకువ. అహంతతో బాటే తలపులు పైకి లేస్తాయి. ఈ **తలపులు ఎవరికి అని అతడు కనుగొనాలి. అవి ఎక్కడి నుండి ఆవిర్భవిస్తున్నాయి? అవి చైతన్యాత్మ నుండి ఆవిర్భవించాలి. దీనిని చూచాయిగా గ్రహించినప్పటికీ, అట్టిగ్రహింపు అహంతా నాశమునకు దోహదపడుతుంది.** తరువాత కేవలము, అనంతము అయిన 'సత్' యొక్క సాక్షాత్కారం సాధ్యపడుతుంది. ఆ స్థితిలో శాశ్వత ఉనికి కంటె వేరుగా ఉండే జీవులు ఉండరు. అందుచేత అక్కడ మరణము యొక్క మరణ దుఃఖము యొక్క తలపు ఉండదు.

### 3.18 శిరస్సు 'నేను' యొక్క స్థానమా? (స.336)

భ: నాకు ఆత్మసాక్షాత్కారం ఎలా కలుగుతుంది?

మ: 'నేను' అనేది ఎవరు? కనుక్కో

భ: అవును. 'నేను' అని నేను చెబుతున్నాను.

మ: ఈ 'నేను' ఎవరు? అది దేహమా లేక దేహము కంటె మరొకటియా?

భ: అది దేహము కాదు. దేహము కంటె ఎవరో వేరొకరు.

మ: దానిని కనుక్కో

భ: దానిని నేను కనుక్కోలేకపోతున్నాను. దానిని నేను కనుగొనేది ఎలా?

మ: ఇప్పుడు నీకు దేహము యొక్క ఎరుక ఉన్నది. సుషుప్తిలో నీకు దేహము యొక్క ఎరుక లేదు. అయినా సుషుప్తిలో నీవు ఉన్నావు. మేల్కొన్న పిదప, నీవు దేహమును గ్రహించి, 'నేను ఆత్మను తెలుసుకోలేకపోతున్నాను,' అని చెబుతున్నావు. నీ నిద్రలో నీవు అలా చెప్పావా? నీ వప్పుడు అఖండముగా ఉన్నావు కనుక, అలా చెప్పలేదు. ఇప్పుడు నీవు దేహమాత్ర పరిమితునిగా కుంచించుకొనిపోయి నాకు సాక్షాత్కారము కాలేదు' అంటున్నావు. నీవు నీ ఆత్మను పరిమితము చేయుట ఎందుకు, దుఃఖించుట ఎందుకు? నీవు నీ సత్యస్వరూపముతో ఉండు, ఆనందముగా ఉండు. నీవు నిద్రలో 'నేను' అని అనలేదు; ఇప్పుడు అంటున్నావు. ఎందుచేత? ఎందుచేత నంటే - నీవు దేహమును గ్రహించియున్నావు. ఈ 'నేను' ఎక్కడి నుండి వస్తున్నదో కనుక్కో అప్పుడు ఆత్మ సాక్షాత్కారమవుతుంది. శరీరము జడము అయినందువల్ల 'నేను' అనదు. ఆత్మ అనంతము అయినందువల్ల 'నేను' అనదు. ఇక 'నేను' అని చెప్పేది ఎవరు?

భ: ఇప్పటికీ నాకు అవగతం కావటం లేదు. 'నేను'ను కనుక్కోవటం ఎలా?

మ: ఈ 'నేను' ఎక్కడ నుండి పుడుతున్నదో కనుక్కో అప్పుడు ఈ 'నేను' లేకుండా పోయి, అనంతాత్మ మిగులుతుంది. ఈ 'నేను' చిత్ - జడముల నడుమనున్న గ్రంథి. శరీరము 'నేను' కాదు. ఆత్మ 'నేను' కాదు. మరి ఈ 'నేను' ఎవరు? అది ఎక్కడి నుండి పుడుతున్నది?

భ: అది ఎక్కడి నుండి పుడుతున్నది?

మ: కనుక్కో

భ: నాకు తెలియదు. దయతో వివరించవలసినదిగా ప్రార్థన.

మ: అది వెలుపలి నుండి మాత్రము కాదు. అది లోపలి నుండే. అయితే అది ఎక్కడి నుండి వస్తున్నది? మరెక్కడో అయితే అక్కడికి నీకు దారిచూపవచ్చు. అది నీలోనే కనుక, దానిని నీ అంతట నీవే కనుక్కోవలసి ఉంది.

భ: శిరస్సు నుండియా?

మ: 'శిరస్సు' అనెడి భావము 'నేను' పుట్టిన తరువాత లేస్తున్నదా, లేక శిరస్సు నుండి 'నేను' పుడుతున్నదా? 'నేను' శిరస్సులోనే ఉంటే, నిద్ర ముంచుకొని వచ్చినప్పుడు శిరస్సు వంగిపోతుంది. ఎందుచేత? 'నేను' ఎల్లప్పుడూ నిలకడగా ఉంటుంది. దాని యొక్క స్థానము కూడా నిలకడగా ఉండాలి. శిరస్సు ఒక పర్యాయము వంగి, మరొక పర్యాయము నిటారుగా ఉంటే, అది 'నేను' యొక్క స్థానము ఎలా అవుతుంది? నిద్రించేటప్పుడు నీ శిరస్సు వాలిపోయి ఉంటుంది; మేల్కొన్నప్పుడు అది పైకి లేస్తుంది. అట్టిది 'నేను' అవుతుందా?

భ: అయితే అది ఏమిటి?

మ: 'నేను' లోపలి నుండి వస్తుంది. నిద్రలో 'నేను' లేదు. మేల్కొనుటకు సరిగా ముందు 'నేను' తలపు ఉన్నది.

### 3.19 ఆధారమైన ఆత్మనుండి మనస్సు ఉదయిస్తుంది, అందులో లయమౌతుంది (స.381)

బెంగాలీ ఇంజనీరు అయిన శ్రీ బోస్ 'ఆత్మ విద్య'లోని చివరి పద్యమునకు అర్థము చెప్పవలసిందని అడిగాడు. భగవాన్ ఈ క్రింది విధంగా వివరించారు :

జగత్తు గోచరిస్తోంది. ఆ గోచరించటం మిథ్యా మాత్రమే. జగత్తు ఉండాలంటే ఒక స్థలము కావాలి, వెలుగు కావాలి. అట్టి ఉనికి, వెలుగు – ఇవి మనస్సు

పుట్టిన సమయంలోనే, ఏకకాలంలో పుడతాయి. కాబట్టి భౌతికమయిన ఉనికి, ప్రకాశము - ఇవి మనస్సు యొక్క ఉనికి, ప్రకాశములోని భాగములు. అయితే మనస్సు అవిచ్ఛిన్నము కాదు; అది ఉదయించి అస్తమిస్తుంది. మనస్సుకు ఆధారము ఆత్మలో ఉన్నది. ఆత్మ స్వతస్సిద్ధము, అనగా దాని ఉనికి, స్వయంప్రకాశము - ఇవి సహజ సిద్ధమై ఉన్నాయి. అది అఖండ సత్స్థితి; అనగా జాగ్రత్స్వప్నసుషుప్తులలో అది అవిచ్ఛిన్నముగా ఉంటుంది. జగత్తులో నానాత్వమున్నది. నానాత్వము మనోవ్యాపారము. మనస్సు ప్రతిబింబిత కాంతితో, అనగా ఆత్మ నుండి ప్రతిఫలించిన కాంతితో ప్రకాశిస్తుంది.

సినిమా ప్రదర్శనలో చిత్రములు మసక కాంతిలోనే కన్పిస్తాయి గాని, కటిక చీకటిలోగాని పూర్తివెలుగులోగాని కన్పించవు. అదే విధంగా, అవిద్య అనే అంధకారంలో నుంచి ప్రతిబింబితమయిన (విస్తరించిన) ఆత్మకాంతిలో మాత్రమే జగచ్చిత్రములు గోచరిస్తాయి. నిద్రలో మాదిరిగా కేవల అజ్ఞానములో గాని, ఆత్మ సాక్షాత్కారములో మాదిరిగా శుద్ధ ఆత్మకాంతిలో గాని జగత్తు గోచరింపదు. నానాత్వమునకు అవిద్యయే కారణ మవుతున్నది.

## 3.20 మనస్సు తనంతట తను ఏమీ చేయలేదు :(అ.ర. 28.6.1946, 3.06 గూడ చూడవలెను)

ఖన్నా భార్య తన విన్నపమును భగవాన్‌కు వ్రాతపూర్వకంగా తెలిపింది: 'నేను శాస్త్రములు చదివియుండలేదు. ఆత్మ విచారమార్గము నాకు చాలా కఠినముయినదిగా తోస్తున్నది. నాకు ఏడుగురు సంతానము. ఇంటి బాధ్యతలతో సతమతమవుతున్నాను. ధ్యానమునకు నాకు తీరికయే లభించటం లేదు. నాకు సరళము, సులభము అయిన మరో మార్గాన్ని బోధించవలసిందిగా భగవాన్‌ను ప్రార్థిస్తున్నాను."

మ: **ఆత్మను తెలుసుకొనేందుకు ఏ శాస్త్రాలనూ నేర్వనక్కరలేదు. అందుకు శాస్త్ర**

**జ్ఞానావశ్యకత లేదు. అన్ని విద్యలనూ నేర్చుకోవటం ఎందుకంటే, అవి అన్నీ అనాత్మ అనిగ్రహించి చివరకు వదలిపెట్టటానికే. దీనిని గ్రహించవలసి ఉంది.** తనను తాను చూచుకొనేందుకు ఎవరికైనా అద్దం కావాలా? గృహకృత్యములను నిర్వహించటం గాని, పిల్లలను చూసుకోవటం గాని ఆటంకములు కానక్కరలేదు. **నీవు ఇంకేమీ చేయలేకపోతే, కనీసం మనస్సులో 'నేను', 'నేను' అని అనుకుంటూ ఉండు, ఎల్లప్పుడూ అలా చేస్తూ ఉండు. 'నేనెవడను?'లో ఈ విధానము సూచింపబడిఉన్నది. నీవు ఏ పని చేస్తున్నా, కూర్చున్నా, నిలుచున్నా, నడుస్తున్నా ఇదే విధంగా 'నేను', 'నేను' అని అనుకుంటుంటే చాలును. 'నేను' భగవంతుని నామము. మంత్రములలోకెల్ల అది మొదటి మంత్రము, అత్యుత్తమ మంత్రము. ఓంకారము కూడా దాని తరువాతదే.**

ఖన్నా : జీవుడు అంటే మనస్సు + చిత్ప్రకాశము అని చెప్పబడింది. ఆత్మసాక్షాత్కారమును కోరేది ఏది? ఆత్మసాక్షాత్కారమార్గానికి అడ్డుపడేది ఏది? మనస్సు అడ్డగిస్తుందనీ చిత్ప్రకాశము సహాయం చేస్తుందనీ చెప్పబడింది.

**మ:** జీవుడు అంటే మనస్సు + ఆత్మ యొక్క ప్రతిబింబిత కాంతి అని వర్ణించినప్పటికీ, ఆచరణలో జీవితంలో, నీవు ఆ రెంటినీ విడదీయలేవు. నిన్న మనం ఒక దృష్టాంతాన్ని చెప్పుకున్నాము. తెల్లని గుడ్డలో నీవు తెల్లదనాన్నీ, గుడ్డనూ విడదీయలేవు. అలాగే బాగా ఎఱ్ఱగా కాలిన ఇనుప గుండు నుండి అగ్నిని, ఇనుమునూ వేరు చేయలేము. **మనస్సు తానుగా ఏమీ చేయలేదు. అది చిత్ప్రకాశముతో కలిసే పైకి వస్తుంది. చిత్ప్రకాశము లేకుండా అది ఏ పనీ - అది మంచిది గానీ, చెడ్డది గానీ - చేయలేదు.** ప్రకాశము ఎల్లప్పుడు అక్కడ ఉండబట్టే, మనస్సు పనులు చేస్తుంది, అవి మంచివో చెడ్డవో, ఎట్టివైనా గానీ. అయితే, ఆ పనుల వల్ల కలిగే సుఖదుఃఖాలను మాత్రం ప్రకాశము అనుభవించదు. కాలిన ఇనుప గుండుపై వేసిన సమ్మెట వ్రేటుకు దెబ్బ తగిలేది నిప్పుకు కాదు, ఇనుముకే కదా?

భక్తుని : ప్రారబ్ధము అంటే ఏమిటి? ప్రారబ్ధం ఎలా ఉంటే అలా జరుగుతుందని చెబితే, ఇక ప్రార్థనల వల్ల, పురుష ప్రయత్నం వల్ల ఏమి ప్రయోజనం ఉంటుంది? లేక మనము ఏమీ చేయకుండా మిన్నక ఉండాలా?

మ: ప్రారబ్ధాన్ని జయించాలంటే, లేక ప్రారబ్ధానికిలోను కాకుండా ఉండాలంటే, రెండే రెండు మార్గాలు ఉన్నాయి. ఒకటి - ఈ ప్రారబ్ధం ఎవరికి అనివిచారించి, **అహంతయే ప్రారబ్ధానికి బద్ధమై ఉన్నది కాని, ఆత్మకాదనీ, అహంత అనేది అసలు లేనేలేదనీ కనుగొనటం. రెండు - తన నిస్సహాయతను తెలుసుకొని, ఎల్లవేళలా "ఓ ఈశ్వరా, నేను కాదు, నీవే", అని అనుకుంటూ ఉండటం,** 'నేను' 'నాది' అన్న భావములను త్యజించటం, ఈశ్వరేచ్ఛానుసారమే జరుగగలదని సర్వభారములను ఈశ్వరునిపై వేయటం, ఆ విధంగా **ఈశ్వరునికి సంపూర్ణ శరణాగతి జెంది, అహంతను నశింపజేయటం, 'నాకిది కావాలి', 'నాకది కావాలి',** అని భగవంతుణ్ణి అర్థించినంత కాలమూ, అది సంపూర్ణ శరణాగతి అని అనిపించుకోదు. భగవంతుని యందు ఉండే ప్రేమ, ప్రేమ కోసమే; అది మోక్షం కోసం కూడా కాదు - ఈ స్థితి మాత్రమే నిజమైన శరణాగతి అవుతుంది. మరో మాటలో, ప్రారబ్ధాన్ని **జయించాలంటే, అహంకారం సమూలంగా నశించిపోవటం అవసరం;** ఈ అహంకార నాశము ఆత్మవిచారణ ద్వారా కావచ్చు, భక్తి మార్గము ద్వారా కావచ్చు.

## 3.21 మనస్సు, లేదా 'సూక్ష్మశరీరము' చిత్తు, జడము - ఈ రెండూ (స.392)

భ: హృదయము అంతఃకరణములకు మూలమని మేము భావించవచ్చునా?

మ: అంతఃకరణములు ఐదు విధములుగా వర్గీకరింపబడ్డాయి. 1. జ్ఞానము 2. మనస్సు 3. బుద్ధి, 4. చిత్తము, 5. అహంకారము. ఇతరులు అవి రెండు మాత్రమే అని అంటున్నారు. 1. మనస్సు, 2. అహంకారము. ఇంకా కొందరు చివరి

నాలుగు మాత్రమే అంటున్నారు. అంతఃకరణము ఒక్కటే అనీ, దాని వివిధ వ్యాపారములు దానిని భిన్నమైనదిగా కన్పించేట్లు చేస్తున్నాయనీ, అందువల్ల దానికి వేరు వేరు పేర్లు ఏర్పడ్డాయని చెబుతున్నారు. ఈ విధంగా అంతఃకరణములకు మూలము హృదయమే. జడమైన దేహము ఉన్నది. నిత్యము, స్వయం ప్రకాశము అయిన ఆత్మ ఉన్నది. ఈ రెండింటి నడుమ ఒక అతిశయ శక్తిగా అహంత ఆవిర్భవించింది. దానికే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, శక్తి, ప్రాణము మొదలయిన వివిధ నామములు ఉన్నాయి. నీ మూలమును అన్వేషించు. ఆ అన్వేషణ నిన్ను అప్రయత్నముగా హృదయమునకు తీసుకొని పోతుంది. అంతః కరణములు సూక్ష్మశరీరమును వివరించు కల్పనలు మాత్రమే. **భౌతికశరీరము పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూతములతో చేయబడింది. అది జడము. ఆత్మశుద్ధము, స్వయంప్రకాశము, స్వతస్సిద్ధము. పంచ భూతముల సూక్ష్మాంశములతోను, ఆత్మ యొక్క ప్రతిబింబితకాంతితోను ఏర్పడిన సూక్ష్మశరీరమును ఒక దానిని ఊహించి, (భౌతికశరీరము, ఆత్మ) వీని యొక్క సంబంధము నెలకొల్పుటకు ప్రయత్నము చేయబడింది. ఈ విధముగా సూక్ష్మశరీరము, జడము, చేతనము కూడా అయి, మనస్సు అను పేరిట, ఆభాస రూపముగా ఉన్నది.** అలాగే పంచభూతములపై సత్త్వగుణ వ్యాపారమువలన, వాని కాంతి (సత్త్వాంశము) మనస్సుగా జ్ఞానేంద్రియములుగా వ్యక్తమవుతుంది. రజోగుణవ్యాపారము వలన, వాని క్రియాశక్తి (రజోదశ) ప్రాణముగా, కర్మేంద్రియములుగా వ్యక్తమవుతున్నది; తమోగుణ వ్యాపారము వలన, వాని జడత్వము (తమో దశ) శరీరము యొక్క స్థూలవిషయములు ఇత్యాదులుగా వ్యక్తమవుతున్నది.

### 3.22 శుద్ధమనస్సు ఆకాశమే (స.451)

మద్రాసు విశ్వవిద్యాలయము, వేదాంతశాఖలో రీడరుగా పని చేసే శ్రీ యస్.యన్.సూర్యనారాయణ శాస్త్రి, శ్రీ లక్ష్మణశర్మ 'ఆత్మబోధ'కు వ్రాసిన వ్యాఖ్య

[illegible] తరువాత, తనకు గల సందేహము తీరినదని చెప్పారు.

జగత్తు ఒక ఊహగానీ, ఒక తలపుగానీ ఎలా కాగలదు? తలపు అనేది మనోవ్యాపారము. ఆ మనస్సు మెదడులో ఉంది. మెదడు మనిషి పుఱ్ఱెలో ఉంది. మనిషి ఈ విశ్వంలో ఒక అత్యంత సూక్ష్మాంశము. అలాంటి అప్పుడు, మనిషి మెదడులోని అరలలో ఈ విశాలవిశ్వము ఎలా ఇముడుతుంది?

శ్రీ భగవాన్ ఇలా సమాధానం చెప్పారు : పైన వర్ణించిన విధంగా ఒక వస్తువు అని మనస్సును భావించినంతకాలము, ఆ సందేహము ఉంటూనే ఉంటుంది. కాని మనస్సు అంటే ఏమిటి? దానిని గురించి మనం ఆలోచించవలసి ఉంది. నిద్ర నుండి మేల్కొనగానే మనిషి ప్రపంచాన్ని చూస్తున్నాడు. ప్రపంచము 'నేను - తలపు' వచ్చిన తరువాత గోచరిస్తోంది. అప్పుడే తల పైకి లేస్తుంది; మనస్సు క్రియాశీలమవుతుంది. అసలు జగత్తు అంటే ఏమిటి? అది ఆకాశములో వ్యాపించి యున్న విషయములతో కూడి ఉన్నట్టిది. ఆ జగత్తును తెలుసుకుంటున్నది ఎవరు? మనస్సు. అంటే ఆకాశమును తెలుసుకుంటున్న మనస్సే ఆకాశము కాదా? ఆకాశము భూతాకాశము. మనసు చిత్తాకాశము (మానసాకాశము). చిత్తాకాశము చిదాకాశములో ఉంది. ఆ విధంగా మనస్సు ఆకాశతత్త్వము. అది జ్ఞానతత్త్వం కావటం చేత తత్త్వశాస్త్రంలో దానిని ఆకాశము అని చెప్పారు. మనస్సును ఆకాశముగా భావించినప్పుడు ప్రశ్నలోని పొంతన లేనట్లు కనిపించేవానిని సమన్వయం చేసుకోవడం కష్టం కాదు. శుద్ధ మనస్సు ఆకాశమే. మనస్సు యొక్క రజస్తమోదశలు స్థూలవిషయములు ఇత్యాదులుగా వ్యవహరిస్తాయి. ఆ రకంగా విశ్వము యావత్తూ మనోమయమే.

అలాగే స్వప్నమును చూస్తున్న ఒక మనిషి సంగతి ఆలోచించు. నిద్రపోయేటప్పుడు ఏదీ వచ్చి పడకుండా ఉండాలని, అతడు తలుపులు మూసుకొని గదిలో నిద్రకు ఉపక్రమిస్తాడు; ఏ వస్తువులను చూడకుండాఉండాలని, అతడు తన కళ్లు మూసుకొని పడుకుంటాడు. అయినా కూడా, అతడు తన స్వప్నములో ఒక లోకమంతటినీ

**చూస్తాడు; దానిలో మనుషులు జీవిస్తుంటారు; వాళ్ల అటూ ఇటూ తిరుగుతుంటారు; వారిలో తాను కూడా ఒకడుగా ఉంటాడు.** నలువైపులా కన్పించే ఈ విశాలదృశ్యము తలుపులు బ్రద్దలు కొట్టుకొని లోపలికి వచ్చిందా? అదంతా అతని మెదడు చేతనే వికసింప బడిందా? లేక అది కలను చూస్తున్నవాని మెదడులో ఉన్నదా? అది నిద్రితుని మెదడులో ఉంది. ఆ మెదడు యొక్క చిన్న చిన్న అరలలో ఇంతటి విశాల ప్రదేశము ఎలా పట్టింది? **ఈ విశ్వము యావత్తూ కేవలం ఒక తలపు అనీ లేక తలపుల పరంపర అనీ తరచు చెప్పే మాటను ఇది వివరిస్తుంది.**

ఒక స్వామి అడిగాడు : నేను పంటి నొప్పితో బాధపడుతున్నాను. అది తలపు మాత్రమేనా?

మ: అవును

భ: నాకు పంటి నొప్పి లేదు అని భావించి, ఆ విధంగా ఆ నొప్పిని మాన్పుకోలేకపోతున్నానే, ఎందుచేత?

మ: ఇతర ఆలోచనలలో మునిగి ఉన్నప్పుడు మనిషికి పంటినొప్పి తెలియదు. అలాగే నిద్రబోయేటప్పుడు కూడా పంటినొప్పి యొక్క స్ఫురణ ఉండదు.

భ: అయినప్పటికీ పంటినొప్పి అన్నది ఉండనే ఉంది.

**మ: జగత్తు సత్యము అనే నిశ్చయం అంతలోతుగా పాతుకొని పోయి ఉంది. దానిని తొలగించుకోవటం అంత సులభం కాదు. ఆ కారణం వల్ల, జగత్తు మనిషి కంటె ఎక్కువ యథార్థమైనది కాజాలదు.**

భ: ఇప్పుడు చైనా – జపాను యుద్ధం జరుగుతున్నది. అది కేవలం ఒక ఊహ మాత్రమే అయితే, శ్రీ భగవాన్ దానికి విరుద్ధముగా ఊహించి, ఆ యుద్ధాన్ని అంతం చేస్తారా, చేయగలరా?

మ: ఈ పృచ్ఛకుని భగవాన్ సైతం, చైనా - జపాను యుద్ధములాగానే ఒక ఊహ మాత్రమే. (నవ్వు)

### 3.23 దేశకాలములు 'నేను-తలపు' పుట్టిన తరువాత పుట్టే కల్పనలు (స.311)

సుషుప్తిలో దేశకాలములు లేవు. అవి 'నేను - తలపు' పుట్టిన తరువాత పుట్టే కల్పనలు. 'నేను - తలపు' పుట్టక ముందు ఈ కల్పనలు లేవు. అందుచేత నీవు దేశకాలాతీతుడవు. 'నేను-తలపు' అల్పమయిన నేను. అసలు 'నేను' అనంతమయిన నేను. అది సర్వతోముఖము, దేశకాలాతీతము. దేశకాలములు సుషుప్తిలో లేవు. **నిద్ర నుండి మేల్కొన్న క్షణంలో - అంటే విషయప్రపంచాన్ని యింకా చూడకముందు - ఒక జ్ఞానస్థితి ఉంది. అదే నీ శుద్ధాత్మ. దానిని తెలుసుకోవాలి.**

### 3.24 దేశకాలములు మనోవ్యాపారములు. తలపులు పుట్టకపోతే, భవిష్యత్తు అనేది ఉండదు (స.480)

భ: ఈ భూమి యొక్క భవిష్యత్తు ఎలా ఉంటుందని మీ అభిప్రాయం?

మ: ఈ ప్రశ్నకు సమాధానము రెండవ కాగితంలో ఉంది. 'నిశ్చలంగా ఉండు. 'నేను' దేవుడు అని తెలుసుకో', 'నిశ్చలత్వము' అంటే 'తలపులు లేకుండా ఉండటం'.

భ: ఇది ప్రశ్నకు సమాధానము కాదు. ఈ భూమండలానికి ఒక భవిష్యత్తు ఉంది. అది ఎలా ఉంటుంది?

మ: దేశకాలములు మనోవ్యాపారములు. తలపులు పుట్టకపోతే, భవిష్యత్తూ లేదు, ఈ భూమీ లేదు.

భ: మనము వానిని గురించి ఆలోచించకపోయినప్పటికీ దేశ కాలములు ఉండనే ఉంటాయి.

మ: మేము ఉన్నాము' అని అవి వచ్చి నీతో చెబుతున్నాయా? నీవు నిద్రపోయే సమయంలో వాని స్ఫురణ నీకు ఉన్నదా?

భ: నిద్రలో నేను ఎరుకతో లేను.

మ: అయినా నీవు నీ నిద్రలో ఉన్నావు.

## 3.25 మనస్సును వినియోగించకపోతే కాలము యొక్క కల్పన ఉండదు. (స. 601)

కాలము అంటే ఏమిటి? అది ఒక స్థితిని, ఆ స్థితిని గూర్చి మనిషి కుండే గుర్తింపును, దానిని ప్రభావితం చేసే మార్పులను ప్రతిపాదిస్తుంది. రెండు స్థితుల నడుమనున్న విరామమును 'కాలము' అని చెబుతారు. ఏ స్థితి అయినా 'ఉండుట' ఎలా సంభవము అవుతుంది? మనస్సు దాని ఉనికిని గుర్తింపులోనికి తెచ్చుకొంటేనే, అది ఉంటుంది. **మనస్సుఆత్మను పట్టుకోవాలి. మనస్సును వినియోగంలోనికి తీసుకొని రాకపోతే, కాలము యొక్క కల్పనయే ఉండదు. దేశ కాలములు మనస్సులో ఉన్నాయి. కాని మనిషి యొక్క నిజస్థితి మనస్సుకు అతీతమయినట్టిది.** తన నిజస్థితిలో నెలకొనియున్న వానికి కాలము అనే ప్రశ్న తలయెత్తదు.

## 3.26 దేశకాలములు ఎప్పుడూ మారుతూనే ఉంటాయి. కాని శాశ్వతమై, ఎట్టి మార్పు లేని తత్త్వము ఒకానొకటి ఉన్నది (అ.ర. 18.3.1946)

కాలము సత్యము అని నేను భావించటం లేదు. అందువల్ల ఇలాంటి విషయాలపట్ల నేను ఆసక్తి చూపను. గతాన్ని గురించి గాని, గతంలో ఉన్న యుగములను గురించి గాని మనకేమీ తెలియదు. అలాగే భవిష్యత్తును గురించి కూడా మన కేమీ తెలియదు. కాని మనకు వర్తమానము ఉన్నదని మాత్రం తెలుసు. మొదట అది యేమిటో తెలుసుకుందాము. అప్పుడు సమస్తమయిన సందేహాలు ఆగిపోతాయి. కొంతసేపు ఆగి, శ్రీ భగవాన్ ఇలా అన్నారు; "దేశ కాలములు ఎప్పుడూ మార్పు

వెందుతూనే ఉంటాయి. కాని శాశ్వతమైన, ఎట్టి మార్పులకు లోనుకాని తత్త్వము ఒకానొకటి ఉన్నది. ఉదాహరణకు, మనము నిద్రిస్తున్నప్పుడు, మనకు జగత్తు లేదు, భూతకాలము లేదు, భవిష్యత్కాలము లేదు. కాని మనము ఉన్నాము. కాబట్టి మారనిదీ, ఎప్పుడూ ఉండేదీ అయినది యేదో దానిని తెలుసుకుందాము.

**3.27 వర్తమానము యొక్క నిజతత్త్వాన్నీ, నిత్యవర్తమానముగా ఉండే సత్‌స్థితినీ కనుక్కో (అ. ర. 3.1.1946)**

నేను హాలులోకి ప్రవేశించేటప్పటికీ భగవాన్ ఒక ప్రశ్నకు జవాబు చెబుతున్నారు. "పరిణామ వాదము సత్యమేనా?" అనేది ఆప్రశ్న అని అడిగి తెలుసుకున్నాను. భగవాన్ ఇలా చెప్పారు : "మనతో వచ్చిన తంటా ఇదే. మన గతము ఏమిటి, అప్పుడు మనము ఎలా ఉన్నాము, అలాగే భవిష్యత్తులో మనము ఎలా ఉండబోతున్నాము – వీనిని గురించి తెలుసుకోవాలని మనకుంటుంది. నిజానికి మన గతాన్ని గూర్చిమనకు తెలియదు, భవిష్యత్తును గూర్చి తెలియదు. మనకు వర్తమానమును గురించి మాత్రము తెలుసు; మనము ఇప్పుడు ఉన్నామనే విషయం తెలుసు. నిన్న, రేపు – ఇవి 'నేడు'ను బట్టి మాత్రమే ఉన్నాయి. నిన్న అనేది దాని కాలములో అది 'నేడు' అని పిలువబడింది. 'రేపు' అనే దానిని రేపటిరోజున మనం 'నేడు' అనే పిలుస్తాము. 'నేడు' అనునది నిత్యమూ ఉండేటటువంటిది. ఎప్పుడూ ఉండేది శుద్ధసత్‌స్థితి. దానికి గతము లేదు, భవిష్యత్తు లేదు. వర్తమానము యొక్క సత్యస్థితినీ, నిత్యవర్తమానమైన సత్‌స్థితినీ మనము ప్రయత్నించి కనుగొనవచ్చును కదా!

**3.28 మనము సుషుప్తిలో, మనశ్శరీరముల యొక్క సంసర్గము లేకుండా ఉన్నాము (స.286)**

శ్రీ భగవాన్ ఇలా చెప్పారు (3.04, అ.ర. 11.1.1946)

నిద్ర = చైతన్యము + నిద్ర

భ: సాక్షాత్కారము ఎలా సాధ్య పడుతుంది?

మ: అగ్ని నుండి అగ్నికణము వలె అనంతమయిన ఆత్మ నుండి ఒక కణము బయలుదేరుతుంది. ఆ కణమే అహంత. **అజ్ఞానిలో ఆ అహంత పుట్టిన వెంటనే ఏదో ఒక విషయముతో ఏకీభావమును పొందుతుంది.** వస్తు సంసర్గ రహితముగా **స్వతంత్రముగా అది ఉండజాలదు.** ఈ సంసర్గమే అజ్ఞానము. మన ప్రయత్నము లన్నింటి యొక్క లక్ష్యము ఈ అజ్ఞాన నాశమే. **అహంత యొక్క ఈ విషయములతో తాదాత్మ్యం చెందే లక్షణము నశింపజేసినట్లయితే, అది శుద్ధముగా ఉండి, తన మూలములో విలీనమై పోతుంది.** దేహముతో గల దాని మిథ్యాతాదాత్మ్యమే దేహాత్మబుద్ధి. సత్ఫలితాలు రావాలంటే ఇది నశించాలి.

భ: అహంతను నిర్మూలించటం ఎలా?

మ: **మనశ్శరీరములతోటి సంసర్గము లేకుండా మనము సుషుప్తిలో ఉంటున్నాము.** కాని మిగిలిన రెండు అవస్థలలో వానితో సంసర్గము కలిగియున్నాము. దేహమే మనము అయి ఉంటే, సుషుప్తిలో దేహము లేకుండా మనం ఎలా ఉండగలము? మనకు ఏదైతే వెలుపల ఉంటుందో దాని నుండి మాత్రమే మనల్ని మనము వేరు చేసుకోగలము. కాని మనకు అన్యము కాని దాని నుండి మనము విడివడగలమా? **కనుక అహంత దేహముతో ఒకటి కాదు.** ఈ సత్యమును జాగ్రదవస్థలో అనుభవములోనికి తెచ్చుకోవాలి. ఈ దృష్టిని సంపాదించటం కోసమే జాగ్రత్ స్వప్నసుషుప్త్యవస్థలనెడి అవస్థాత్రయమును అధ్యయనము చేయాలి. **అహంత శుద్ధరూపములో రెండు అవస్థలకు నడుమ, రెండు తలపులకు నడుమ ఉండే విరామములో అనుభవములోనికి వస్తుంది.** అహంత గొంగళి పురుగు వంటిది. గొంగళి పురుగు మరొక ఆధారమును గ్రహించనిదే, పూర్వమున్న ఆధారమును విడిచి పెట్టదు. అహంత కూడా అలాగే ఏదో ఒక ఆధారమును గ్రహించియే ఉంటుంది. **అది విషయములతోనో, తలపులతోనో సంపర్కములేకుండా ఉన్నప్పుడే** దాని నిజమైన స్వరూపమును కనుగొనుటకు అవకాశము ఉంటుంది.

చైతన్యముయొక్క మూడుదశలయిన అవస్థాత్రయ అధ్యయనము ద్వారా పొందినట్టి నిశ్చయముతో ఈ విరామమును సాక్షాత్కరింపజేసుకో.

భ: మనము ఎలా నిద్రిస్తాము, ఎలా మేల్కొంటాము?

మ: రాత్రి కాగానే తల్లి కోడి కూత కూస్తుంది. కోడిపిల్లలు వెళ్లి తల్లికోడి రెక్కలక్రింద దాక్కుంటాయి. కోడిపిల్లలను తన రక్షణలో ఉంచుకొని, తల్లి కోడి తన గూటికి పోతుంది. తెల్లవారగానే కోడిపిల్లలు బయటకు వస్తాయి. అట్లాగే తల్లి కోడి కూడా వస్తుంది. తల్లి కోడి అహంతకు ప్రతీక. అహంత తలపులన్నింటినీ ప్రోగు చేసుకొని నిద్రపోతుంది. సూర్యోదయము కాగానే సూర్యకిరణములు పైకి వస్తాయి, సూర్యాస్తమయము కాగానే అవి అన్నీ ఉపసంహరింపబడతాయి. అలాగే అహంత పైకి రాగానే, దానితో బాటే దాని సాధన సంపత్తి అంతా వెలువడుతుంది. అది లయము కాగానే, అంతా అదృశ్యమయిపోతుంది.

## 3.29 సుషుప్తిలో ఉన్న చైతన్యమే జాగ్రత్తులోనూ ఉన్నది (స.13)

భ: సాక్షాత్కారమునకు సహకారులైనవేవి?

మ: వేద, శాస్త్రవాక్యములు, జ్ఞానులు చేయు ఉపదేశములు.

భ: అట్టి ఉపదేశములు చర్చలుగా, ఉపన్యాసములుగా, ధ్యానములుగా ఉండవచ్చునా?

మ: ఉండవచ్చు. అయితే ఇవి అన్నీ ద్వితీయ శ్రేణి ఉపకరణాలు. గుర్వనుగ్రహమే అత్యంత ప్రధానమైనట్టిది.

భ: అది ఎంత కాలమునకు లభిస్తుంది?

మ: నీవు ఎందుకు తెలుసుకోగోరుతున్నావు?

భ: నాకు నమ్మకము కలిగేందుకు.

మ: అట్టి కోరిక కూడ ఒక ఆటంకమే. **ఆత్మ నిత్యమూ ఉన్నది. అది లేకుండా ఏదీ లేదు.** ఆత్మగా ఉండు. ఇక కోరికలు, సందేహములు లేకుండా పోతాయి. **జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి ఉనికి యొక్క దశలకు ఆ ఆత్మసాక్షిగా ఉన్నది.** ఈ దశలు అహంతకు సంబంధించినట్టివి. ఆత్మ అహంకారమునకు కూడ అతీతమైనది. నీవు నిద్రలో లేవా? నీవు నిద్రించితిని అని గానీ, నీకు జగత్తును గూర్చిన ఎరుక లేదనీగానీ అప్పుడు నీవు ఎరుగుదువా? జాగ్రదవస్థలో మాత్రమే నీ నిద్రానుభవమును నీవు వర్ణిస్తున్నావు; అందుచేత, **నిద్రిస్తున్నప్పుడు ఏ చైతన్యమైతే ఉన్నదో అదే చైతన్యము మెలకువతో ఉన్నప్పుడు కూడా ఉంది.** ఈ జాగ్రచ్చైతన్యము అనేది ఏమిటో నీవు తెలుసుకొంటే, మూడు అవస్థలకు సాక్షిగా ఉన్న చైతన్యస్వరూపమేమిటో నీవు తెలుసుకోగలవు. **చైతన్యము సుషుప్తిలో ఏ విధముగా ఉన్నదో అన్వేషించి తెలుసుకొనటం వల్ల అట్టి చైతన్యము యొక్క స్వరూపమును కనుగొనవచ్చు.**

## 3.30 సుషుప్తి అంటే సకల భేద విస్మృతి అని అర్థం (స.207)

**సుషుప్తి అద్వైతస్థితియే. జీవాత్మ, పరమాత్మ, వీని నడుమ ఉండే భేదము అక్కడ నిలువగలదా? సుషుప్తి అంటే సకల భేదవిస్మృతి అని అర్థము. అది మాత్రమే ఆనందస్వరూపముగా ఉంటుంది.** ఆ ఆనందాన్ని పొందేందుకే జనులు బహు జాగ్రత్తగా తమ తమ శయ్యలను ఏర్పాటు చేసుకుంటారు. మెత్తటి పరుపులు, దిండ్లు, తదితరములైనవన్నీ నిద్ర గాఢంగా పట్టేందుకే ఉద్దేశించబడ్డాయి. అంటే మెలకువను పోగొట్టుకోవటానికే నన్నమాట. అయినప్పటికీ ఈ మెత్తని పాన్పులు మొదలయినవన్నీ గాఢ నిద్రలో ఉన్నప్పుడు నిరుపయోగములు. దీని అర్థం ఒకటే. **అజ్ఞాననివారణమునకే సకల ప్రయత్నములూ ఉద్దేశించబడ్డాయి. జ్ఞానసిద్ధి అయిన తరువాత వాని వలన ఏ ప్రయోజనమూ ఉండదు.**

## 3.31 సుషుప్తిలో ద్రష్టకు కేవల అజ్ఞానము యొక్క ఎరుక ఉంటుంది

(స.286)

భ: సుషుప్తి యొక్క స్వరూపము ఎలా ఉంటుంది?

మ: **చీకటి రాత్రివేళ, మేఘములు దట్టముగా ఆవరించి ఉన్నప్పుడు వస్తువులను విడివిడిగా గుర్తించటం సాధ్యం కాదు. ద్రష్ట బాగా కళ్ళు తెరచి చూస్తున్నప్పటికీ, ఏమీ కన్పించదు, అంతా చిమ్మచీకటిగా ఉంటుంది. అలాగే సుషుప్తిలో ద్రష్టకు కేవలం అజ్ఞానం యొక్క ఎరుక ఉంటుంది.**

## 3.32 ఈ పంచేంద్రియముల ద్వారా పని చేసే శక్తి ఒకటి ఉన్నది. ఆ శక్తి యొక్క ఉనికిని నీవు ఎలా నిరాకరించగలవు? (స.363)

శ్రీ శామన్న : 'నేను ఉన్నాను', అని తెలుసుకునేందుకు ఆరవ ఇంద్రియం ఏదైనా ఉన్నదా?

మ: అది నిద్రలో నీకు ఉన్నదా? పంచేంద్రియముల ద్వారా పని చేసే సత్త ఒక్కటే ఉన్నది. అలా కాక, ప్రతి ఇంద్రియము ఆత్మతో సంబంధం లేకుండా స్వతంత్రంగా ఉన్నదనీ, అందుచేత ఐదు ఆత్మలు ఉన్నవనీ, వానిని నియమించేందుకు ఆరవ ఆత్మ ఇంకొకటి ఉన్నదనీ నీ అభిప్రాయమా? **ఈ పంచేంద్రియముల ద్వారా పని చేసే శక్తి ఒకటి ఉన్నది. అట్టి శక్తి యొక్క ఉనికిని నీవు నిరాకరించగలవా?** శరీరము గోచరము కానట్టి సుషుప్తిలో కూడా నీవు నిలిచే ఉన్నావు కదా? లేవా? **అదే 'నేను' ఇప్పుడు కూడా కొనసాగుతున్నది.** కాబట్టి, దేహము ఉండనీ లేక దేహము లేకపోనీ, మన ఉనికిని మాత్రము మనము అంగీకరిస్తూనే ఉన్నాము. **ఇంద్రియములు నియమిత కాలములలో పని చేస్తాయి. వాని వ్యాపారములకు ఆద్యంతములు ఉన్నాయి. వాని క్రియాకలాపములు దేనిని ఆధారముగా చేసుకొని నడుస్తున్నాయో ఆ అధిష్ఠానము ఒకటి ఉండి తీరాలి.** అవి ఎక్కడ పుట్టి, ఎక్కడ

గిడుతున్నాయి? అట్టి అధిష్ఠానమైన ఏకైక తత్త్వము కన్పించటం లేదని చెబితే, ఆ చెప్పటమే అది ఏకైక తత్త్వము అని అంగీకరించినట్లు అవుతున్నది. ఎందుకంటే, **దానిని తెలుసుకొనేందుకు రెండవది ఏదీ లేదని నీవే** చెబుతున్నావు కదా! ఈ చర్చలన్నీ అజ్ఞాననివారణార్థమే ఉద్దేశింపబడ్డాయి. ఆ అజ్ఞానము నివారింపబడితే, సర్వమూ స్పష్టమవుతుంది. ఇది యోగ్యతకు, పరిపక్వతకు సంబంధించినట్టి విషయము.

## 3.33 స్థూలదేహముతో నీ తాదాత్మ్యభావమే ఆత్మసాక్షాత్కారమంటే ఏమిటి అన్న ప్రశ్న యొక్క మూలములో ఉన్నది (స.444)

దర్శించుటకు వచ్చిన ఒక న్యాయవాది : మనస్సు ఇంద్రియముల ద్వారా జగత్తును తెలుసుకొంటోంది. ఇంద్రియములు క్రియాశీలములుగా ఉన్నప్పుడు, జగత్తు యొక్క ఉనికిని మనిషి కాదనలేడు. శుద్ధమయిన ఎరుకను కలిగియుండేందుకు కర్మ యోగము ఏమైనా ప్రయోజనకరముగా ఉంటుందా?

మ: మనస్సు ఇంద్రియముల ద్వారా జగత్తును చూస్తోంది. అంటే అది మనస్సుకు సంబంధించినట్టిది. ద్రష్ట, మనస్సునూ ఇంద్రియములనూ, ఆత్మ యందు ఉన్న వానినిగా చూస్తాడు గాని, ఆత్మ కంటె భిన్నమయినవిగా చూడడు. కర్త కర్మల చేత బాధింపబడకుండా ఉంటూ చిత్తశుద్ధిని పొందుతాడు. ఆత్మసాక్షాత్కార పర్యంతము ఇది కొనసాగుతుంది.

భ: ఆత్మసాక్షాత్కారమంటే ఏమిటి?

మ: నీవే ఆత్మవు. ఆ సాక్షాత్ కూడా నీవే (ఇక్కడే ఇప్పుడే). దానిలో 'కారము'నకు ఇక తావు ఎక్కడిది? **నిన్ను నీవు అనాత్మగా భావించుకుంటున్నావని ఈ ప్రశ్న వలన తెలుస్తోంది.** లేదా ఒక ఆత్మ రెండవ ఆత్మను తెలుసుకునేందుకు రెండు ఆత్మలున్నాయని నీవు భావిస్తున్నావా? అదే అయితే, అది అసంగతము. నీ **స్థూలదేహముతో నీ తాదాత్మ్యభావమే** ఈ నీ ప్రశ్నకు **మూలము.** సరే. ఈ ప్రశ్న

ఇప్పుడు పుడుతోంది. అది నిద్రలో నీకు పుట్టిందా? అప్పుడు నీవు లేవా? నిశ్చయంగా నీవు నిద్రలో ఉన్నావు. ఈ ప్రశ్న నిద్రలో పుట్టకుండా, ఇప్పుడు పుట్టింది కదా. అయితే ఈ రెండు దశలకూ నడుమ ఉన్న వ్యత్యాసం ఏమిటి? ఇప్పుడు ఈ దేహమే నీవు అని భావిస్తున్నావు. నీవు నీచుట్టూ ఉన్న వస్తువులను చూస్తున్నావు. అదే విధంగా నీ ఆత్మను కూడా నీవు చూడాలనుకుంటున్నావు. అలవాటు కున్న శక్తి అట్టిది. ఇంద్రియములు కేవలం జ్ఞానోపకరణములు. నీవు ద్రష్టవు. ద్రష్టగానే ఉండు. చూడటానికి వేరే ఏమున్నది? సుషుప్తి దశ అట్టిదే.

## 3.34 ఉపాధులను చూడటమే జీవాత్మ పరమాత్మల నడుమగల వ్యత్యాసానికి కారణం (స.153)

పెషావరు నుండి కొందరు వచ్చారు. వారిలో ఒక జుడిషియల్ కమీషనర్, మరియొకరు బాగా చదువుకొన్న జిజ్ఞాసువు అయిన ఒక యువకుడు. ఆ యువకునికి జీవాత్మకు పరమాత్మకు నడుమ భేదము ఉన్నదన్న దృఢ విశ్వాసం ఉన్నది. అతడు కొన్ని ప్రశ్నలు అడిగాడు. శ్రీ భగవాన్ ఒక్క వ్యాక్యముతో అతనిసందే హము లన్నింటినీ పరిష్కరించారు. **'ఆత్మ నుండి 'జీవ' 'పరమ' అనే ఉపాధులను తొలగించి, అప్పుడు ఇంకా ఏమైనా భేదములు కన్పిస్తున్నాయేమో చెప్పు.** తరువాత ఇంకా ఈ సందేహములు పట్టుకొని నిన్ను వీడకపోతే, 'సందేహించేవాడు ఎవరు? ఆలోచించేవాడు ఎవరు? అని నిన్ను నీవు ప్రశ్నించుకో. వానిని కనుక్కో సందేహములన్నీ సమసిపోతాయి.

## 3.35 జగత్తు మిథ్య అని తెలిసిన తర్వాత కూడా అది కనిపిస్తూనే ఉంటుంది (స.315)

ఎండమావి అని తెలిసిన తరువాత కూడా ఎండమావి అదృశ్యము కాదు. ఆ దృశ్యము అలాగే ఉంటుంది. కాని మనిషి నీటి కోసం దాని వద్దకు పరుగెత్తి

పోదు. జగత్తు మిథ్య. అది మిథ్య అని తెలుసుకొన్న తరువాత కూడా అది కన్పిస్తూనే ఉంటుంది. దానిని బ్రహ్మముగా తెలుసుకోవాలి, దానికన్న వేరుగా కాదు. జగత్తు కన్పిస్తున్నది సరే, అయినా అది ఎవరికి కన్పిస్తున్నది? ఆయన ఇట్లు ప్రశ్నిస్తాడు. దానికి నీ జవాబు ఏమిటి? 'ఆత్మ'కు అని నీవు జవాబు చెప్పాలి. కాదంటే, గ్రహించే ఆత్మ లేకుండా, గ్రహింపబడే జగత్తు గోచరిస్తుందా? కాబట్టి ఆత్మయే సత్యము. దృశ్యముగా గోచరిస్తున్నదంతా ఆత్మగా సత్యము, ఆత్మ కంటే వేరుగా చూస్తే మిథ్యా మాత్రము.

## 3.36 ఆత్మానుభవము (అ. ర. 17.6.1946)

టెన్నిసన్‌ను గురించి సంభాషణ కొనసాగింది. ఉపదేశసారము యొక్క ఇంగ్లీషు అనువాదములోని ఒక అదనపు వివరణలో సంబంధిత గ్రంథభాగము లభ్యమయింది. అది ఒక పద్యములో లేదు; బి.పి.బ్లడ్‌కు వ్రాసిన ఒక లేఖలో ఉంది. భగవాన్ దానిని చదవవలసిందని నన్ను అడిగారు. నేను చదివాను. "నేను ఏకాంతంగా ఉన్న క్షణాలలో, బాల్యం నుండి కూడా, నాకు తరచు ఒకానొక వింత అనుభవం కలుగుతుండేది. దానిని **జాగ్రత్ సమాధి** అనవచ్చు నేమో. నా పేరును నాలో నేను ఒకటి రెండు పర్యాయములు స్మరించుకోగానే, ఒక్కసారిగా, **నాలో వ్యక్తిగత చైతన్యం కేంద్రీకృతమై జీవభావం విడివడి ఒక అమేయసత్ స్వరూపంలో విలీనమై పోయినట్లు తోచేది. అదియేదో ఒక మిథ్యానుభవం కాదు, భ్రాంతికాదు; స్పష్టాతిస్పష్టము, శుద్ధము, బుద్ధమై, పరమ యథార్థము నిత్యము ముక్తమై, అధిమానుషము, పరమాద్భుతమై, వర్ణింప అలవి కాని స్థితి అది. అక్కడ మృత్యుచ్ఛాయలే లేవు, ఆ చోట మృత్యువన్న మాటే హాస్యాస్పదంగా, అసంభవంగా తోస్తుంది. జీవత్వనాశము (అది అలాంటిదే అయితే) నాశముగా తోచక, అమరమైనట్టి సత్యజీవముగా తోస్తుంది."**

భగవాన్ అన్నారు : **ఆ స్థితిని ఆత్మ నిష్ఠ అని పేర్కొంటారు.**

## 8.37 మనో నిశ్చలతతో కూడిన చైతన్యమే సాక్షాత్కార స్థితి (స.348)

కొన్ని కొన్ని సమయాలలో మనుషులు, వస్తువులు అస్పష్టంగా, పారదర్శకంగా ఉన్నట్లు తోచే రూపాలతో, అంటే స్వప్నంలో మాదిరిగా కన్పించటం ఉన్నది. వానిని వెలుపలి నుండి చూస్తున్నట్లుగా ఉండదు. అలా చూడటం ఆగిపోతుంది. ఊరక వానియొక్క ఉనికిని గురించిన సాక్షిమాత్రమయిన ఎరుక ఉంటుంది; ఎట్టి ఆత్మతత్త్వానుభవ జ్ఞానమూ ఉండదు. మనస్సులో మాత్రము గంభీరమయిన నిశ్చలత నెలకొని ఉంటుంది. అట్టి సమయాలలో అది ఆత్మలో మునుగుటకు ఉద్యుక్తమయి ఉన్నదని చెప్పవచ్చునా? లేక అది ఆత్మ సమ్మోహనక్రియా ఫలముగా ఏర్పడిన దుర్బలస్థితియా? తాత్కాలిక శాంతిని పొందుటకు సాధనముగా దానిని ప్రేరేపించవలయునా?

మ: మనస్సులో నైశ్చల్యముతో బాటు చైతన్యము ఉన్నది. లక్ష్యముగా పెట్టుకొనవలసిన స్థితి సరిగా ఇదే. అయితే అది ఆత్మయే అని గ్రహించకుండా, ఈ అంశం మీద ప్రశ్నను లేవనెత్తటం చూస్తే, ఆ స్థితి నిలుకడ లేనట్టిదనీ, యాదృచ్ఛికంగా వచ్చినట్టిదేననీ తెలుస్తోంది.

మనస్సును మరల్చి, వెనుకకు త్రిప్పి, బాహ్యాకారముల క్రిందికి మునుగునట్లు చేసేటప్పుడు, బహిర్ముఖవృత్తులకు 'మునుగుట' అనే పదం ఉచితంగానే ఉంటుంది. కాని గంభీరమగు నైశ్చల్యము నెలకొనియుండి, (ఆత్మ) చైతన్యమును అడ్డగింపకుండా ఉన్నప్పుడు, మునుగవలసిన అగత్యము ఏమున్నది? ఆ స్థితి ఆత్మ అని అనుభూతము కానప్పుడు, అట్లు అనుభవగోచరము కావించుకొనుటకొరకు చేసే ప్రయత్నమును 'మునుగుట' అని పిలువవచ్చు. ఆ విధంగా ఆ స్థితి సాక్షాత్కారమునకు, లేక 'మునుగుట'కు అనుకూలమయినట్టి స్థితి అని చెప్పవచ్చు. ఆ రీతిగా ఆ చివరి రెండు ప్రశ్నలు అనావశ్యకములు.

## 3.38 ఆత్మ నిస్సంగము, శుద్ధము అయిన సద్వస్తువు (స.196)

భ: 'నేను' ను అన్వేషించినచో చూడబడేవి ఏమీలేదు.

మ: నువ్వు నిన్ను దేహంగాను, దృష్టిని కనులతోను, గుర్తించటానికి అలవాటు పడ్డావు గనక, నీకు ఏమీకనిపించదు. చూడటానికి అక్కడ ఏమున్నది? చూసేవాడెవరు? చూడటమెట్లా? ఒకే ఒక ఎరుక, అహంభావముగా ప్రకటమై, దేహంతో తాదాత్మ్యం చెంది, కనులద్వారా ప్రసరించి చుట్టూవున్న విషయాలను చూస్తుంది. వ్యక్తి జాగ్రదావస్థలో పరిమితుడై, భిన్నమైనది ఏమైనా చూడాలను కొంటాడు. ఇంద్రియాలకు తెలుస్తున్నదే అధికార ముద్ర. కానీ 'చూసేవాడు, చూపు, చూడబడే దృశ్యము' 'నేను-నేను' అను ఒకే చైతన్యము నుంచి ఆవిర్భవించాయని అతను ఒప్పుకోడు. ఆత్మ దృశ్యంగా వుండాలన్న భ్రమని తొలగించడానికి ధ్యానము సహాయకారి అవుతుంది. సత్యమేమిటంటే, చూసేందుకు ఏమీలేదు. ఇప్పుడు నీకు 'నేను' ఏవిధంగా అనుభవమౌతోంది. నువ్వు వున్నావని తెలియటానికి అద్దం ముందర పెట్టుకోవాలా? ఎరుకయే 'నేను'. దానిని అనుభవ పూర్వకంగా తెలిసికో. అదే సత్యము

భ: ఆలోచనలకు మూలాన్ని అన్వేషించేటప్పుడు, నేను యొక్క అనుభవం కలుగుతుంది. కానీ, అదినాకు సంతృప్తికరంగా లేదు.

మ: అవును నిజమే. 'నేను' యొక్క గ్రహింపు ఒక రూపంతో, బహుశా శరీరంతో కలసి వుండవచ్చు. శుద్ధమైన ఆత్మతో ఏదీ కలిసివుండరాదు. ఆత్మ దేనితోనూ కలియని శుద్ధమైన సత్. దాని వెలుగులోనే దేహము, అహంభావము మొదలయినవన్నీ ప్రకాశిస్తున్నాయి. తలపులన్నిటినీ నిశ్చలమొనరిస్తే శుద్ధమైన ఎరుకయే మిగిలి వుంటుంది.

## 3.39 ఆత్మసాక్షాత్కారము నిద్రవంటి సహజస్థితి (స.413)

దర్శనార్థము వచ్చిన ఒక వ్యక్తి ఇలా అడిగాడు : నామ జపము చేసేటప్పుడు,

దానిని ఒక గంట గానీ, అంతకుమించిగానీ కొనసాగించినప్పుడు, నేను నిద్ర వంటి స్థితిలోనికి జారిపోతున్నాను. మరల స్పృహలోకిరాగానే, జపము ఆగిపోయిందని గుర్తుకు తెచ్చుకుంటాను. మరల జపం కొనసాగిస్తాను.

మ: 'నిద్ర వంటిది **అనే మాట సరియైనదే. అదే సహజస్థితి.** నీవు ఇప్పుడు అహంతతో కూడి యున్న కారణముగా, సహజస్థితిని నీ పనులకు ఆటంకము కలిగించెడి ఒకానొక దశగా నీవు భావిస్తున్నావు. అది **నీ సహజస్థితి అని అనుభవగోచరము కావాలి. అంతవరకు నీవు ఆ అనుభవమును మరల మరల పొందాలి.** అప్పుడు జపము మొదలైన వన్నీ నీకు బాహ్యములయినట్టివనీ తెలిసివస్తుంది. అయినా, అది అప్రయత్నంగా కొనసాగుతూనే ఉంటుంది. నీ ఇప్పటి సందేహానికి కారణం నీ మిథ్యా తాదాత్మ్యమే. జపము అంటే ఇతరములయిన తలపుల నన్నింటినీ వదలిపెట్టి, ఒకే ఒక తలపుకు అంటిపెట్టుకొని ఉండటం. జపము యొక్క ప్రయోజనము అదే. అది ధ్యానమునకు దారి తీస్తుంది. ధ్యానము సాక్షాత్కారముగా పరిణమిస్తుంది.

**3.40 సుషుప్తిలో జ్ఞాని స్పృహలేకుండా ఉండదు, ఆత్మలో పూర్తి మెలకువతో ఉంటాడు. జ్ఞాని యొక్క స్థితి నిద్ర కాని నిద్ర. (అ. ర. 21.11.1945, మధ్యాహ్నం)**

డా॥ శ్రీనివాసరావు భగవాన్‌ను అడిగాడు : "నిద్ర కాని నిద్ర అంటే ఏమిటి?"

మ: అది జ్ఞాని యొక్క స్థితి. నిద్రలో మన అహంత అణగి ఉంటుంది. మన జ్ఞానేంద్రియములు క్రియాశీలముగా ఉండవు. జ్ఞానిలో అహంకారం నశిస్తుంది; అతడు తనకు తానుగా (స్వయముగా) గాని లేక తాను కర్తను అనే భావనతో గాని ఇంద్రియవ్యాపార నిమగ్నుడు కాడు. కనుక అతడు నిద్రలో ఉన్నట్లే. అదే సమయంలో నిద్రలో మాదిరిగా అతడు స్పృహ లేకుండా ఉండదు, ఆత్మ యందు పూర్తి మెలకువతో ఉంటాడు. అందుచేత అతని స్థితి నిద్ర కాని స్థితి. ఈ నిద్ర

కాని నిద్ర, మెలకువతోటి నిద్ర, మరేదేమైనా కానీ, ఆత్మ యొక్క తురీయస్థితి. ఆ తురీయావస్థ అనే తెరమీద జాగ్రత్‌స్వప్న సుషుప్తులు అనే మూడు అవస్థలూ వచ్చిపోతుంటాయి. వాని వల్ల తెర ఏ మాత్రమూ బాధింపబడదు. **ఏదైతే ఉన్నదో దానిని పట్టుకొని ఉండక, మనం అలా లేని దాని కోసం వెంపరలాడుతున్నాము. మనం గతాన్ని గురించి, భవిష్యత్తును గురించి దిగులుపడుతున్నాము; వర్తమానము యొక్క సత్యస్థితిని సాక్షాత్కరించుకొనలేకపోతున్నాము.** మనకు మొదలు తెలియదు, తుది తెలియదు, మధ్యనున్నది మాత్రమే తెలుసు. ఆ మధ్యనున్న దాని సత్యాన్ని తెలుసుకుంటే మనకు మొదలూ తెలుస్తుంది, తుది కూడా తెలుస్తుంది.

భగవాన్ భగవద్గీత శ్లోకాన్ని ఉదహరించారు : "సర్వప్రాణుల హృదయమునందు నేను ఉన్నాను. వాని ఆది మధ్యాంతములు నేనే".

## 3.41 శరణాగతికీ, విచారణకూ గల పరస్పర సంబంధము (స.462)

భ: శరణాగతిని 'భక్తి' అని చెప్పారు. కాని శ్రీ భగవాన్ ఆత్మ విచారము వైపు మొగ్గు చూపుతారన్నది విదితమే. ఈ విధముగా ఈ శ్రోతలో సంభ్రమము ఉంది.

**మ: సంపూర్ణ జ్ఞానముతో చేసినప్పుడే శరణాగతి సఫలీకృతమవుతుంది. అట్టి జ్ఞానము విచారణ ద్వారా లభిస్తుంది. అది శరణాగతిగా పరిణమిస్తుంది.**

భ: జీవాత్మను అధిగమించినప్పుడే పరమాత్మ జ్ఞానము కలుగుతుంది. అదే జ్ఞానస్థితి. ఇక శరణాగతి యొక్క ఆవశ్యకత యేముంది?

మ: నిజమే. జ్ఞానానికీ, శరణాగతికీ భేదమే లేదు. (నవ్వు)

## 3.42 బుద్ధి తన నిస్సహాయతను తెలుసుకొని, తన వ్యాపారములను ఉజ్జగిస్తే, సాక్షాత్కారము సిద్ధిస్తుంది (స.502)

భ: మనస్సును స్థిరముగా సన్మార్గములో నిలుపటం ఎలా?

వా: సకల ప్రాణులకు తమ పరిసరముల యొక్క జ్ఞానము ఉన్నది. అందువలన వానిలో బుద్ధి ఉన్నట్లు ఊహించాలి. అయితే మనిషి బుద్ధికీ, జంతువుల బుద్ధికీ నడుమ వ్యత్యాసం ఉంది. ఎందువల్లనంటే, మనిషి జగత్తును ఉన్నదానిని ఉన్నట్లు చూస్తాడు; దానికి అనుగుణంగా నడుచుకుంటాడు; అంతే కాకుండా, తన కోరికలను తీర్చుకొనేందుకు ప్రయత్నిస్తాడు; ఉన్న పరిస్థితులతో తృప్తి పడడు. తన కోరికలను తీర్చుకొనే ప్రయత్నంలో, అతడు తన దృష్టిని బహుదూరపర్యంతము విస్తరింపజేసుకుంటాడు. అయినా గాని, అతనికి సంతృప్తి అనేదే ఉండదు. అసంతృప్తితో అతడు వెనుకకు మరలి, ఆలోచించటం తర్కించటం ఆరంభిస్తాడు.

సుఖశాంతులు శాశ్వతంగా ఉండాలన్న అతని కోరికయే అతని నిజస్వరూపములోని శాశ్వతత్వమును తెలియజేస్తున్నది. అందువలన అతడు తన స్వస్వరూపమయిన ఆత్మను కనుగొని, తిరిగి పొందాలని ఆకాంక్షిస్తాడు, ప్రయత్నిస్తాడు. దానిని కనుగొంటే సమస్తాన్నీ కనుగొన్నట్లే అవుతుంది. ఇట్టి అంతరాన్వేషణమే మనిషి బుద్ధి చేత పొందదగినట్టి మార్గం. నిరంతరాభ్యాసానంతరము తాను ఒకానొక మహాశక్తి యొక్క ప్రేరణతో పనిచేయగల్గుతున్నట్లు బుద్ధి తెలుసుకొంటుంది. ఆ శక్తిని బుద్ధి స్వయముగా చేరుకోలేదు. అందువల్ల అది ఒక దశ తరువాత తన వ్యాపారానికి స్వస్తి చెబుతుంది. అది అలా నిర్వ్యాపారముగా ఉన్నప్పుడు ఇంకా ఆ పరమశక్తి అక్కడ ఏకైకముగా మిగిలే ఉంటుంది. అదే సాక్షాత్కారము, అదే తుది మెట్టు, అదే అంతిమ ధ్యేయము. అంటే తాను ఒక పరమ శక్తిపై ఆధాపడి ఉన్నాననీ, ఆశక్తిని చేరుకొనటానికి తాను అసమర్థుడను అని తెలుసుకొనుటయే బుద్ధి యొక్క ప్రయోజనం. అంటే అది ధ్యేయ ప్రాప్తికి ముందు తనను తాను నశింపచేసుకోవాలన్నమాట.

సద్బుద్ధి అంటే బుద్ధి అని తన అభిప్రాయము కాదని శ్రీ జె.బి. స్పష్టం చేయటానికి ప్రయత్నించాడు. సద్బుద్ధి అంటే మేలుచేసేది, ధర్మబద్ధమయినది అని భావించి, ఎన్నుకున్న మార్గాన్ని దృఢంగా అవలంబించే బుద్ధి అని తన అభిప్రాయము అన్నాడు. అట్టి నిశ్చలబుద్ధిని ఎలా పొందగలనని అతడు అడిగాడు.

మ: సకల ప్రాణులకు తమ పరిసరముల యొక్క జ్ఞానము ఉన్నది. అందువలన వానిలో బుద్ధి ఉన్నట్లు ఊహించాలి. అయితే మనిషి బుద్ధికీ, జంతువుల బుద్ధికీ నడుమ వ్యత్యాసం ఉంది. ఎందువల్లనంటే, **మనిషి జగత్తును ఉన్నదానిని ఉన్నట్లు చూస్తాడు; దానికి అనుగుణంగా నడుచుకుంటాడు; అంతే కాకుండా, తన కోరికలను తీర్చుకొనేందుకు ప్రయత్నిస్తాడు; ఉన్న పరిస్థితులతో తృప్తి పడదు.** తన కోరికలను తీర్చుకొనే ప్రయత్నంలో, అతడు తన దృష్టిని బహుదూరపర్యంతము విస్తరింపజేసుకుంటాడు. అయినా గాని, అతనికి సంతృప్తి అనేదే ఉండదు. అసంతృప్తితో అతడు వెనుకకు మరలి, ఆలోచించటం తర్కించటం ఆరంభిస్తాడు.

సుఖశాంతులు శాశ్వతంగా ఉండాలన్న అతని కోరికయే అతని నిజస్వరూపములోని శాశ్వతత్వమును తెలియజేస్తున్నది. అందువలన అతడు తన స్వస్వరూపమయిన ఆత్మను కనుగొని, తిరిగి పొందాలని ఆకాంక్షిస్తాడు, ప్రయత్నిస్తాడు. దానిని కనుగొంటే సమస్తాన్నీ కనుగొన్నట్లే అవుతుంది. ఇట్టి అంతరాన్వేషణమే మనిషి బుద్ధి చేత పొందదగినట్టి మార్గం. **నిరంతరాభ్యాసానంతరము తాను ఒకానొక మహాశక్తి యొక్క ప్రేరణతో పనిచేయగల్గుతున్నట్లు బుద్ధి తెలుసుకొంటుంది. ఆ శక్తిని బుద్ధి స్వయముగా చేరుకోలేదు. అందువల్ల అది ఒక దశ తరువాత తన వ్యాపారానికి స్వస్తి చెబుతుంది. అది అలా నిర్వ్యాపారముగా ఉన్నప్పుడు ఇంకా ఆ పరమశక్తి అక్కడ ఏకైకముగా మిగిలే ఉంటుంది. అదే సాక్షాత్కారము, అదే తుది మెట్టు, అదే అంతిమ ధ్యేయము. అంటే తాను ఒక పరమ శక్తిపై ఆధాపడి ఉన్నాననీ, ఆశక్తిని చేరుకొనటానికి తాను అసమర్థుడను అని తెలుసుకొనుటయే బుద్ధి యొక్క ప్రయోజనం. అంటే అది ధ్యేయ ప్రాప్తికి ముందు తననుతాను నశింపచేసుకోవాలన్నమాట.**

సద్బుద్ధి అంటే బుద్ధి అని తన అభిప్రాయము కాదని శ్రీ జె.బి. స్పష్టం చేయటానికి ప్రయత్నించాడు. సద్బుద్ధి అంటే మేలుచేసేది, ధర్మబద్ధమయినది అని భావించి, ఎన్నుకున్న మార్గాన్ని దృఢంగా అవలంబించే బుద్ధి అని తన అభిప్రాయము అన్నాడు. అట్టి నిశ్చలబుద్ధిని ఎలా పొందగలనని అతడు అడిగాడు.

మ: అత్యున్నతమయిన లక్ష్యాన్ని చేరుకోవాలంటే వ్యక్తిత్వనాశనము అవసరము. బుద్ధి వ్యక్తిత్వభావముతో పాటే కలిసి ఉంటుంది. బుద్ధి - అది మంచిదైనా, చెడ్డదైనా - నశించినప్పుడు మాత్రమే వ్యక్తిత్వము నశిస్తుంది. కనుక ఆ ప్రశ్నయే తలెత్తదు.

## 3.43 నువ్వు 'నేనెవడను?', అని ప్రశ్నించుకుని, 'నేను' యొక్క మూలాన్ని కనుక్కో (స.197)

అహమ్మదాబాద్ నుంచి వచ్చిన గుల్ మరియు షరీన్‌బైరాంజీ అనే ఇద్దరు పార్శీ స్త్రీలు మహర్షితో మాట్లాడారు: భగవాన్, మేము మా చిన్నతనం నుంచీ ఆధ్యాత్మికతపై ఆసక్తి కలిగి వున్నాము. మేము తత్వశాస్త్రానికి సంబంధించిన ఎన్నో గ్రంధాలను చదివాము. వేదాంతముచే ఆకర్షితులమయ్యాము. కనుక మేము ఉపనిషత్తులు, యోగవాశిష్టము, భగవద్గీత మొదలయిన గ్రంథాలు చదివాము. మేము ధ్యానం చెయ్యటానికి ప్రయత్నిస్తాము గాని మా ధ్యానంలో పురోగతి లేదు. సాక్షాత్కారాన్ని పొందటమెట్లాగో మాకు అవగతం కాలేదు. సాక్షాత్కారానికి మీరు దయతో మాకు సహాయ పడగలరా?

మ: మీరు ధ్యానమెలా చేస్తారు?

భ: నేను 'నేనెవరని' నన్ను ప్రశ్నించు కోవడంతో మొదలు పెట్టి, దేహము, నేనుకాదు. శ్వాస నేనుకాదు. మనస్సునేను కాదని తోసివేస్తాను. ఆపైన ముందుకు వెళ్ళలేక పోతున్నాను.

మ: సరి, బుద్ధి పోగలిగింది అంతవరకే. మీ పద్ధతి కేవలము బుద్ధికి సంబంధించినదే. సత్యాన్ని తెలుసుకోదలచిన సాధకుడికి దారి చూపడానికి శాస్త్రాలన్నీ ఈ పద్ధతిని చెబుతాయి. సత్యం సూటిగా చూపటానికి సాధ్యముకానిది. కనుకనే ఇది బుద్ధికి అవగతమయే పద్ధతి. 'నేను' కన్న ఇతరమైనవాటిని నిరాకరించేవాడు, 'నేను' ని

గోచరించలేదని గమనించ గలవు. ఇది 'నేను' కాదు, అది'నేను' కాదు అని చెప్పే 'నేను' **అహంభావము లేదా 'నేను తలపు' (అహంవృత్తి).** ఈ 'నేను తలపు' ఉదయించిన తరువాతే మిగిలిన ఆలోచనలన్నీ ఉదయిస్తాయి. కనుక ఈ 'నేను-తలపు' మూల తలపు. ఈ మూలాన్ని పెకిలిస్తే మిగిలినవన్నీ గూడా దానితోపాటు నిర్మూలింపబడతాయి. కనుక ఈ 'నేను' కి మూలాన్ని వెదుకు, నిన్ను నువ్వు **"ఎవరునేను" అని ప్రశ్నించుకో, మూలాన్ని కనుక్కో.** అప్పుడు ఇవన్నీ అదృశ్యమై శుద్ధమైన ఆత్మ మిగులు తుంది.

భ: అది చేయటం ఎట్లా?

మ: 'నేను' ఎల్లప్పుడూ వుంది – గాఢ నిద్రలోను, స్వప్నంలోను మరియు మెలకువలోను. గాఢ నిద్రలో వున్నవాడే ఇప్పుడు మాట్లాడుతున్నవాడు గూడా. 'నేను' అనుభూతి ఎల్లప్పుడూ వుంది. కాదంటే, నువ్వు నీ వునికిని నిరాకరిస్తావా? నిరాకరించవు. నువ్వు 'నేను వున్నాను' అంటావు. ఎవరు వున్నదీ కనుక్కో

భ: చేయవలసినది అదే అయినా నాకు అర్థంకాలేదు. 'నేను' మిథ్య'నేన'ని ఇప్పుడు మీరు చెబుతున్నారు. ఈమిథ్య 'నేను' ని ఎట్లాగ నిర్మూలించాలి?

మ: ఈ మిథ్య నేనుని నిర్మూలించనవసరంలేదు. **'నేను' తననితాను ఎల్లా నిర్మూలించుకోగలదు. నీవు చేయవలసిన దల్లా దాని పుట్టుక స్థానాన్ని కనుక్కొని అక్కడ స్థిరంగా వుండటమే.** నీ ప్రయత్నము **అంతవరకు మాత్రమే** సాగగలదు. ఆపైన అతీతమైనది తన స్వాస్థ్యత తను చూసుకోగలదు. **అక్కడ మనము నిస్సహాయులము.** ఏ ప్రయత్నమూ దానిని చేరలేదు.

భ: 'నేను' ఎల్లప్పుడూ ఇక్కడ ఇప్పుడు వున్నట్లయితే, నాకా విధంగా ఎందుకు అనిపించడంలేదు.

మ: అద్దది ! అట్లా అనిపించడంలేదని అంటున్నదెవరు? నిజమైన 'నేను' అంటోందా,

లేక మిథ్యా'నేను' అంటోందా? పరీక్షించు. అది అసత్యమైన 'నేను' అంటోందని నీకు తెలుస్తుంది. ఈ అసత్యమైన నేనుయే అడ్డంకి. నిజమైన 'నేను' మరుగున పడకుండా వుండాలంటే దానిని తొలగించాలి. ఆత్మానుభవానికి అడ్డంకి నీకు ఆత్మానుభవము కాలేదన్న భావమే. నిజానికి అది యిప్పటికే అనుభవ గోచరమయినది. ఇక అనుభవగోచరము కావలసినది ఏమీ లేదు. కాదంటే, ఆత్మానుభవము క్రొత్తగా అయినది అవుతుంది. ఇంతవరకు వుండనిది, ఇకముందు కావలసినది అవుతుంది. పుట్టినది ఏదైనా గిట్టవలసినదే! ఆత్మానుభూతి శాశ్వతము. అట్లా కానిదయితే అది పొంద తగినది కాదు. అందువలన మనము ప్రయత్నిస్తున్నది క్రొత్తగా జరుగవలసినదాని కోసంకాదు. అది నిజానికి శాశ్వతమైనది కాని, ఇప్పుడు అవరోధము వలన తెలియబడటం లేదు. దానినే మనం కోరుతున్నది. మనం చేయవలసినదల్లా అవరోధాలని తొలగించటమే. అజ్ఞానం వలన నిత్యము అయినది ఆ విధంగా అనుభవం కావడం లేదు. అజ్ఞానమే అవరోధము. 'నేను-తలపు'కు సదృశము. దాని మూలాన్ని కనుక్కుంటే అది అదృశ్యమవుతుంది.

'నేనుతలపు' ఒక దయ్యము వంటిది. అది స్పష్టంగా తెలిసేది కాకాపోయినా, దేహంతో పాటు ఉదయించి, వర్ధిల్లి దానితో అదృశ్యమవుతుంది. దేహాత్మభావన అసత్యమైన 'నేను'. ఈ దేహాత్మభావనని విడనాడు. అది నేను యొక్క మూలాన్ని వెదకటం ద్వారా చెయ్యవచ్చు. దేహము 'నేను' వున్నాను అని అనదు. 'నేను దేహాన్ని' అనేది నువ్వు. ఈ 'నేను' ఎవరో కనుక్కో 'నేను' మూలాన్ని వెదకితే అది అదృశ్యమవుతుంది.

భ: అప్పుడు పరమానందము వుంటుందా?

మ: పరమానందము, "సత్-చిత్" తో పాటు వుండేదే. శాశ్వత ఉనికి యొక్క ఆనందానికి సంబంధించిన వాదాలన్నీ ఆనందానికి గూడా వర్తిస్తాయి. నీ స్వభావమే ఆనందము. అజ్ఞానము ఇప్పుడు ఆ ఆనందాన్ని మరుగు పరుస్తోంది. అజ్ఞానాన్ని తొలగిస్తే ఆనందము వ్యక్తమవుతుంది

భ: మనం జగత్తు-జీవుడు - ఈశ్వరుల గురించిన అంతిమ సత్యాన్ని తెలుసుకోనవసరంలేదా?

మ: ఇవన్నీ 'నేను' యొక్క కల్పనలే. అవన్నీ 'నేను-తలపు' పుట్టిన తరువాతనే ఉదయిస్తాయి. నీవు నీ గాఢ నిద్రలో వున్నావు. అదే నువ్వు ఇప్పుడు మాట్లాడుతున్నావు. అవే సత్యమయితే, అవి నీ గాఢనిద్రలో గూడా వుండవద్దా? అవి 'నేను-తలపు' మీదనే ఆధారపడి వున్నాయి. మరల, ఈ ప్రపంచము 'నేను' ప్రపంచాన్ని' అని చెబుతోందా? శరీరము, 'నేను-శరీరాన్ని', అని అంటోందా? 'ఇదిప్రపంచము' 'ఇది శరీరము', అని నువ్వు అంటున్నావు? కనుక ఇవన్నీ నీ ఊహలే. **నీవెవరవో తెలుసుకో అప్పుడు నీ సందేహాలన్నీ తీరుతాయి.**

భ: ఆత్మానుభవం తరువాత దేహము ఏమవుతుంది? అది వుంటుందా, వుండదా? ఆత్మసాక్షాత్కారం పొందినవారు ఇతరుల లాగే ప్రవర్తించడాన్ని మేము చూస్తున్నాము.

మ: ఈ ప్రశ్న ఇప్పుడు ఉదయించనవసరంలేదు. అవసరమయితే, దాన్ని ఆత్మానుభవం తరువాత అడగవచ్చు. ఆత్మవిదులను వారి సంగతి వారిని చూసుకోనీ. వారిని గురించి నువ్వెందుకు చింతించాలి? నిజానికి, ఆత్మానుభవం తరువాత, శరీరమూ, మిగిలినదంతా గూడా ఆత్మకన్నా భిన్నంగా కనుపించదు.

## 3.44 శ్వాసని గమనించడం 'నేనెవరు?' అన్న విచారణలో అంతర్గతంగా జరుగుతుంది (అ.ర.1.12.45).

మహావీర్‌ప్రసాద్ 'మహాయోగము'లోని ఒక చిన్న భాగాన్ని వుద్దేశించి భగవాన్ని అడిగారు. 'నేనెవరు?' అన్న మానసిక అన్వేషణ ప్రారంభించేందుకు ముందర శ్వాసని గమనించడం అవసరమా? విధిగా చేయవలసినదా?

మ: అంతా మనిషి యొక్క పక్వత, అభిరుచి మరియు యోగ్యతమీద ఆధారపడి వుంటుంది. మనస్సుని ఏకాగ్రం చేసి లేదా నిగ్రహించి విచారణలోకి తీసుకు వెళ్ళగల

మనోబలం లేని వారికి శ్వాసని గమనించమని సలహా ఇవ్వబడింది. ఎందుకంటే శ్వాసని గమనించడంవల్ల సహజంగానూ, దానిపైన ధ్యాసవలన క్రమంగా ఆలోచనలు ఆగి, మనస్సును అదుపులోనికి తేవడానికి దారి తీస్తుంది.

శ్వాస, మనస్సు ఒకే స్థానం నుంచి ఉదయిస్తాయి. ఒకదానిని నియంత్రించినప్పుడు, రెండోదిగూడా నియంత్రించబడుతుంది. నిజానికి విచార మార్గాన్ని 'నేనెవరు?' అనటం కన్న "నేను ఎక్కడనుంచి?" అనటమే ఉచితం. దానిలో మనం నేను శరీరంకాదు, ఇంద్రియాలుకాదు అనుకుంటూ త్రోసిపుచ్చి చివరకు మిగిలే అంతిమ సత్యాన్ని చేరటంకాకుండా, 'నేను – తలపు' లేదా అహంభావము మనలో ఎక్కడ పుడుతుందో కనుక్కుంటాము. ఈ పద్ధతిలో కావాలని గమనించక పోయినా, అంతర్గతంగా శ్వాసని గమనించడం జరుగుతుంది. మనము అన్ని తలపులకు మూలమైన 'నేను–తలపు' పుట్టుక స్థానాన్ని గమనించినప్పుడు, శ్వాసయొక్క మూలాన్ని గూడా తప్పని సరిగా గమనించడం జరుగుతుంది, ఎందుకుంటే ఆ రెండూ ఒకే మూలం నుంచి ఉదయిస్తాయిగనుక.

## 3.45 నీవు ఆత్మవే అన్న దృఢ విశ్వాసము ఉండాలి. అదే కావలసిన దంతా! (స.406)

సంపూర్ణ జ్ఞానప్రాప్తికి సిద్ధమై ఉన్న మనిషి సాపేక్ష జ్ఞానాన్ని అంటిపెట్టుకుని ఎందుకు ఉండాలి?

మ: ప్రతిదీ అది జరుగవలసిన సమయంలో జరుగుతుంది. సంపూర్ణ జ్ఞానప్రాప్తికి అర్హుడై, అందుకు సిద్ధమై ఉన్న వాడే అయితే, అతడు ఏదో విధంగా దానిని గురించి వినటమూ, దానిని అనుసరించటమూ జరుగుతుంది; అట్టి అవకాశము అతనికిఏర్పడుతుంది. ఆత్మ విద్యయే సర్వోత్తమ ధర్మము అనీ, అదే మానవజీవన యాత్రాఫలమనీ అతడు తెలుసుకుంటాడు.

ఏవప బాహ్య నిర్వికల్పసమాధికీ, అంతర నిర్వికల్ప సమాధికీ గల భేదాన్ని తెలియజేయవలసిందని అభ్యర్థించగా, శ్రీ భగవాన్ ఇలా చెప్పారు :

జగత్తును సాక్షి మాత్రంగా చూస్తూ, దానికి అంతరంలో ఎట్టి ప్రతిస్పందన లేకుండా, సద్వస్తువునే ఆశ్రయించి ఉంటే, అది బాహ్య నిర్వికల్పసమాధి. అందులో అలలులేని సాగరము యొక్క నిశ్చలత్వము ఉంటుంది. అంతర నిర్వికల్ప సమాధిలో దేహస్పురణ ఉండదు.

భ: సహజసమాధి స్థితిని పొందటానికి ముందుగా శరీర జ్ఞానము నశించడం ఒక ఆవశ్యకతా?

మ: శరీరజ్ఞానం అంటే ఏమిటి? విశ్లేషించి చూడు. ఒక శరీరము, దానికి బద్ధమయి ఉన్న జ్ఞానము – ఈ రెండూ కలిసి శరీరజ్ఞానము అవుతుంది. కేవలము, **అబాధితము అయిన మరొక జ్ఞానము ఉండాలి. దానిని పట్టుకో. అదే సమాధి. దేహ చైతన్యము లేనప్పుడు అది ఉంటుంది; ఎందుకంటే శరీరజ్ఞానమునకు అది అతీతము. శరీరజ్ఞానము ఉన్నప్పుడు కూడ అది ఉంటుంది.** అంటే అది ఎప్పుడూ ఉంటుందని భావము. శరీరజ్ఞానము లేకుండా పోతేనేమి, శరీరజ్ఞానము ఉంటేనేమి, దానివల్ల ఏమయింది? శరీరజ్ఞానము లేనప్పుడు అది అంతరసమాధి. శరీరజ్ఞానం ఉన్నప్పుడు అది బాహ్య సమాధి. అంతే. మనిషి ఆరు రకాల సమాధులలో దేనిలోనో ఒక దానిలో ఎప్పుడూ ఉండాలి. దాని కారణంగా సహజసమాధి అతనికి సులభప్రాప్యము అయ్యే అవకాశం ఉంటుంది.

భ: **మనస్సు ఒక క్షణకాలం కూడా ఆ స్థితిలోనికి మునుగటం లేదు.**

మ: **'మనస్సుకూ దృశ్యజగత్తుకూ అతీతమయిన ఆత్మను నేను', అన్న దృఢ నిశ్చయము అవసరం.**

భ: అయినప్పటికీ మనస్సును అణచేందుకు చేసే ప్రయత్నాలకు వ్యతిరేకంగా ఆ మనస్సే ఒక పాశమై కూర్చుంటున్నది.

మ: మనస్సు క్రియాశీలంగా ఉంటే వచ్చిన నష్టం ఏమిటి? అది ఆత్మ ఆధారంగానే అలా ఉన్నది. మనోవ్యాపారాలలో కూడా దానిని పట్టుకొని ఉండు.

భ: నేను తగినంత లోతుకు పోలేకపోతున్నాను.

మ: అలా చెప్పటం తప్పు. ఆత్మలో కాక ఇప్పుడు నీవు ఎక్కడ ఉన్నావు? నీవు ఎక్కడకు పోవాలి? కావలసిన దంతా ఒక్కటే. నీవు ఆత్మవే అన్న దృఢ విశ్వాసం. కాకపోతే నీవు ఒకటి చెప్పవచ్చు. ఇతర కార్యకలాపాలు వచ్చి నిన్ను కప్పివేస్తున్నాయి అని చెప్పవచ్చు.

భ: అవును. అదే సత్యం.

మ: అంటే విశ్వాసము దృఢంగా లేదని అర్థం.

భ: 'నేను' అనేది కృత్రిమ మయినదని నాకు అర్థమయింది. అసలు 'నేను'ను సాక్షాత్కరింపజేసుకొనేందుకు నేను చేసే ప్రయత్నాలన్నీ వమ్ము అయిపోతున్నాయి; ఎందుకంటే అసలు 'నేను'ను తెలిసికొనటంలో మిథ్య 'నేను' రంగంలోనికి దించబడుతున్నది.

మ: వివేక చూడామణిలో ఇది స్పష్టీకరించబడింది : "కృత్రిమమయిన 'నేను' విజ్ఞానకోశమునకు సంబంధించినట్టిది. అది ఒక ప్రతిబింబము. అయితే దాని ద్వారానే యథార్థతత్త్వమయిన 'నేను' యొక్క వాచ్యార్థమును (విశిష్టార్థమును) తెలిసికోవలసి ఉంటుంది.

## 3.46 అఖండానందములో నిలుకడగా ఉండటానికి అవరోధాలను అధిగమించు (స.95)

భ: అఖండానందంలో స్థిరముగా ఉండటానికి ఆటంకములు ఏవి? వానిని తొలగించుకోవటం ఎలా?

మ: ఆ ఆటంకములు ఇవి :

1. తన శుద్ధ సత్ స్థితిని మరచిపోవుట అనెడి **అజ్ఞానము.**
2. కలిగిన అనుభవము ఆత్మానుభవమా?కాదా అనెడి **సంశయము.**
3. **'నేనుదేహము' అనుపొరపాటు మరియు జగత్తు సత్యము అని భావించడం.**

సత్యమును గూర్చిన శ్రవణ, మనన, నిదిధ్యాసనముల ద్వారా ఈ ఆటంకములను అధిగమించవచ్చు.

శ్రీ భగవాన్ తమ వివరణమును ఇలా కొనసాగించారు. అనుభవము తాత్కాలికమైనది కావచ్చు, శాశ్వతమైనది కావచ్చు. ప్రథమానుభవము తాత్కాలికముగా ఉంటుంది. ఏకాగ్రత ద్వారా దానిని శాశ్వతము చేసుకోవచ్చు. ప్రథమానుభవములో బంధము పూర్తిగా నశింపదు. అది సూక్ష్మముగా మిగిలి ఉండి, క్రమంగా నిలద్రొక్కుకుంటుంది. కాని శాశ్వతానుభవములో అది సమూలముగా నశించిపోతుంది, మరల తిరిగి యెన్నడూ తలెత్తదు. శ్రీ మద్భగవద్గీతలోని "యోగభ్రష్ట" ...... మొదటి తరగతికి చెందిన మనుషులకు వర్తిస్తుంది.

భ: అట్లయితే, తత్త్వశ్రవణము ఏ కొద్ది మందికో ఉద్దేశింపబడిందా?

మ: శ్రవణము రెండు రకాలుగా ఉంటుంది. గురువు వివరించి, వ్యాఖ్యానించిన దానిని వినుట సామాన్యశ్రవణము. కాని 'నేనెవడను?' అని తన్ను తాను ప్రశ్నించుకొని, అన్వేషించి, అఖండమైన 'నేను-నేను'గా తన లోపల సమాధానమును పొందుట సరియైన శ్రవణము. ఈ అనుభవమును మననము చేసుకొనుట రెండవ దశ. దానిలోనే ఏకాగ్రస్థితిలో నుండుట (నిదిధ్యాసనము) మూడవ దశ.

భ: తాత్కాలికానుభవమును 'సమాధి' అనవచ్చునా?

మ: అనరాదు. అది మూడవదశలోని భాగము.

భ: అలా అయితే, తత్త్వశ్రవణము కూడా కొద్దిమందికి మాత్రమే పరిమితమైనట్లు తోస్తున్నది.

మ: సాధకులలో రెండు తరగతుల వారు ఉన్నారు. కృతోపాసకులు, అకృతోపాసకులు. మొదటి తరగతికి చెందిన సాధకుడు నిశ్చలమయిన భక్తితో అంతకు పూర్వమే తన వాసనలను క్షీణింపజేసుకొన్నవాడు. అతని మనస్సు శుద్ధమై ఉంటుంది. అతనికేవో అనుభవములు కలిగిఉంటాయి. కాని వాని అర్థమును అతడు గ్రహింపలేక ఉంటాడు. సమర్థుడయిన గురువు ఉపదేశించిన వెంటనే అతనికి శాశ్వతమయిన అనుభూతి ప్రాప్తమవుతుంది. రెండవ తరగతికి చెందిన సాధకుడు లక్ష్యమును చేరుటకు మిక్కిలి ప్రయత్నము చేయవలసి యుంటుంది. శ్రవణ మనన నిదిధ్యాసనములు అతనికి ఎలా ఉపయోగపడతాయి? సత్యమునకు అత్యంత సన్నిహితముగా ఉండే ఉపాసనలో అవి (శ్రవణాదులు) అన్నీ ఇమిడి యుండి, అతని యొక్క ఆత్మసాక్షాత్కారముగా పరిణమిస్తాయి.

**3.47 ఆత్మ శాశ్వతము, స్వతఃసిద్ధము. అన్వేషణ శ్రమ విరమణానంతరము అది సాక్షాత్కరిస్తుంది (స.43)**

మ: సరే. కృష్ణుణ్ణి కనుక్కో. సమస్య పరిష్కారమవుతుంది.

భ: కృష్ణుడు సజీవుడుగా లేడు.

మ: నీవు గీత నుండి నేర్చుకొన్నది ఇదేనా? తాను శాశ్వతుడనని ఆయన చెప్పలేదా? నీవు దేనిని గురించి ఆలోచిస్తున్నావు? ఆయన దేహమును గురించియా?

భ: ఆయన జీవించి ఉండగా ఇతరులకు బోధించాడు. ఆయన చుట్టూ ఉన్నవారు ఆత్మ సాక్షాత్కారమును పొంది ఉండవచ్చు. నేను కూడా అటువంటి సజీవ గురువు కోసం అన్వేషిస్తున్నాను.

ప్ర: అయితే ఆయన తన దేహమును ఉపసంహరించుకొన్న తరువాత గీత నిరుపయోగమయిపోయిందా? ఆయన తన దేహమును కృష్ణుడు అని చెప్పాడా?

మ: "నత్వేవాహం జాతునాస....” (ఎప్పుడునూ నేను ఉండక పోవటం అనేది లేదు)

ప్ర: కాని, ప్రత్యక్షముగా సత్యాన్ని బోధించగల సజీవ గురువు నాకు కావాలి.

మ: ఆ గురువుకు కూడా కృష్ణునికి పట్టిన గతే పడుతుంది.

ఆ పృచ్ఛకుడు వెళ్లిపోయాడు. తరువాత శ్రీ భగవాన్ ఇలా చెప్పారు : దివ్య దృష్టి అంటే స్వయం ప్రకాశము. 'దివ్య' అనే పదం దానిని తెలుపుతోంది. ఆ పదం మొత్తానికి 'ఆత్మ' అని అర్థము. దివ్య చక్షువును ప్రసాదించేది ఎవరు. చూచేవాడు ఎవడు? అంతేకాక, జనులు, 'శ్రవణ మనన నిధిధ్యాసనములు ఆవశ్యకములు', అని గ్రంథాలలో చదువుతారు. **సాక్షాత్కారమునకు ముందు తాము సవికల్ప సమాధి, నిర్వికల్ప సమాధి అను వానిని పొందవలసి ఉంటుందని భావిస్తారు. అందుచేతనే ఈ ప్రశ్నలన్నీ వస్తాయి. ఈ విషవలయంలో వారు చిక్కుపడి పరిభ్రమించటం దేనికి? దీనివల్ల, చివరకు వారు సాధించేదేమిటి? అది కేవలం అన్వేషణ శ్రమను నివారించటమే. ఆత్మ శాశ్వతమైనది, స్వతః సిద్ధమైనదనీ వారు కనుగొంటారు. ఆ విశ్రాంతిని వారు ఈ క్షణమే ఎందుకు పొందగూడదు?**

చదువురాని ఒక మామూలు మనిషి జపముతోనో, పూజతోనో సంతృప్తి పడతాడు. జ్ఞాని అయిన వాడు ఎలాగూ తృప్తిని గాంచే ఉంటాడు. ఇబ్బంది అంతా పుస్తకాల పురుగులతోటే అనగా గ్రంథమాత్రజ్ఞులతోటే. సరి, సరి. వారికి కూడా దారి దొరుకుతుంది.

## 3.48 ఇంద్రియములు తమస్సులో విలీనమైతే అది సుషుప్తి వెలుగులో విలీనమైతే అది సమాధి (స.82)

**వివిధ సమాధులనడుమ ఉండే వ్యత్యాసమును గురించి ఒక ప్రశ్న అడుగబడింది.**

మ: **ఇంద్రియాలు తమస్సులో విలీనమైనప్పుడు, అది సుషుప్తి; ప్రకాశములో విలీనమైనప్పుడు అది సమాధి.** ప్రయాణం చేసే మనిషి, బండిలో నిద్రించేటప్పుడు ఆ బండి కదలికలు, ఆగుట, లేక గుఱ్ఱములను విప్పుట అనే వానిని ఎరుగని విధంగానే, సహజ సమాధిలో ఉన్న జ్ఞాని కూడా జరుగుతున్న సంఘటనలను, జాగ్రత్ స్వప్నసుషుప్తులను ఎరుగకుండా ఉంటాడు. ఇక్కడ సుషుప్తి గుఱ్ఱములను విప్పుటతో సమానము. సమాధి గుఱ్ఱములు ఆగుటతో సమానము ; గుఱ్ఱములు ఆగిన తరువాత కదలుటకు సిద్ధముగా ఉన్నట్లు, ఇంద్రియములు పనిచేయుటకు సిద్ధంగా ఉంటాయి. **సమాధిలో తల క్రిందికి వంగదు. ఇంద్రియములు క్రియాశీలముగా ఉండకపోయినా, అక్కడ ఉన్నాయి. కాని సుషుప్తిలో తల క్రిందికి వంగుతుంది. అక్కడ ఇంద్రియములు తమస్సులో విలీనమైనాయి.** కేవల సమాధిలో ప్రాణ వ్యాపారములు, మనోవ్యాపారములు, జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు విలీనమై, సమాధి నుండి బయటకు వచ్చిన తరువాత మరల పైకి వచ్చేందుకు సిద్ధంగా ఉంటాయి. సహజసమాధిలో నైతే, ప్రాణ మనోవ్యాపారములు, అవస్థాత్రయము నశించిపోయి, తిరిగి మరల పైకి రావు. అయినా జ్ఞాని వ్యవహారమగ్నుడై ఉన్నట్లు ఇతరులకు గోచరిస్తాడు. అంటే, తినుట, మాట్లాడుట, కదలుట ఇత్యాదిగా గల అతని చర్యలను ఇతరులు చూస్తారు. జ్ఞాని స్వయంగా ఈ వ్యాపారములను ఎఱుగడు. అవి అన్నీ జ్ఞాని యొక్క దేహమునకు సంబంధించినట్టివి, ఆయన యొక్క సత్యాత్మకు, స్వరూపమునకు సంబంధించినట్టివి కావు. జ్ఞాని, తన మట్టుకు తాను, బండిలో నిద్రించే యాత్రికుని మాదిరిగా, లేక నిద్రనుండి మేల్కొల్పబడి భుజించిన పసిబిడ్డమాదిరిగా, ఏమీ ఎరుగక ఉంటాడు. పసిబిడ్డ తాను పాలుత్రాగనే లేదనీ, పాలు త్రాగకుండానే నిద్రబోయినానని మర్నాడు చెబుతాడు. ఒక వేళ

...చేసినా, ఆ పసిబిడ్డ నమ్మడు. సహజసమాధి గతుడయిన వాని సంగతి కూడా అంతే. 'సుషుమ్నా పరే లీనా', ఇక్కడ సుషుమ్న తపోమార్గమును సూచిస్తుంది, పరానాడి జ్ఞానమార్గమును సూచిస్తుంది.

## వాసనలు ఉన్నచో జ్ఞానము నిశ్చలముగా వుండజాలదు (స.141)

**s.49** ఒకరు కైవల్యము నుంచి ఒకపద్యాన్ని చదివి ఇట్లా ఆడిగారు: జ్ఞానము ఒకసారి పొందబడి తరువాత కోల్పోవ సాధ్యమా?

మ: ఒకసారి వ్యక్తమయిన జ్ఞానము, తాను స్థిరపడటానికి సమయము పడతుంది. ఆత్మ నిశ్చయముగా ప్రతి వ్యక్తి అనుభవంలోనూ వున్నదే, కాని అతను ఊహించుకున్నట్లు వుండదు. అది యథాతథముగానే ఉన్నది. ఆ అనుభవమే సమాధి. మంత్రోచ్చాటన లేదా యితర ఉపాయాల వలన అగ్ని దహించకుండా వున్నా, అవి లేనప్పుడు దహిస్తుంది. అదేవిధంగా ఆత్మ వాసనలతో కప్పబడి ఉండి, అవి లేనపుడు స్వయంగా వ్యక్తమవుతుంది. వాసనలతో నిలకడ లేకపోవడం వలన జ్ఞానము స్థిరపడటానికి కొంత సమయం పడుతుంది. అస్థిరమైన జ్ఞానము పునర్జన్మలను నిరోధింపజాలదు. అగ్ని ఇతర ఉపాయాలవలన ఏవిధంగా దహించదో, అదే విధంగా పరమగురుని సమక్షంలో వాసనలు క్రియాశీలత కోల్పోయి, మనస్సు నిశ్చలమై సమాధి సిద్ధిస్తుంది. ఈ విధంగా శిష్యుడు గురుని సమక్షంలో యథార్థజ్ఞానాన్ని, సరి అయిన అనుభవాన్ని పొందుతాడు. దానిలో నిశ్చలమై ఉండటానికి మరింత ప్రయత్నం అవసరమౌతుంది. అది తన నిజమైన 'సత్'అని తెలుసుకుని అతడు జీవించి వుండగానే ముక్తుడవుతాడు. కళ్ళు మూసుకుని ఉన్న సమాధి స్థితి నిశ్చయముగా మంచిదే. కాని క్రియా రాహిత్యము, క్రియ పరస్పర విరుద్ధాలు కావని అనుభవసిద్ధమయ్యేదాకా పురోగమించాలి. వ్యక్తి క్రియాశీలుడై వున్నపుడు సమాధిస్థితి కోల్పోతానన్న భయం అజ్ఞాన లక్షణము. సమాధి ప్రతి వ్యక్తి యొక్క సహజ జీవితముగా ఉండాలి. మన ప్రయత్నానికి, ప్రయత్న రాహిత్యానికి అతీతమైన ఒక స్థితి వుంది. అది

సిద్ధించేదాకా ప్రయత్నం అవసరము. ఒక్కసారైనా ఆ ఆనందాన్ని రుచిచూచినవాడు దానిని తిరిగి సాధించడానికి మరల మరల ప్రయత్నిస్తాడు. శాంతియుత ఆనందాన్ని ఒకసారి అనుభవించిన వారెవరైనా, ఆ స్థితికి వెలుపల ఉండటము, లేదా, ఇతరములైన వాటిలో నిమగ్నులవటానికి ఇష్టపడరు. అజ్ఞానికి ఆలోచనా రహితుడవ్వడం ఎంత కష్టమో, జ్ఞానికి ఆలోచన చేయటం అంతే కష్టం.

సామాన్య మానవుడు తనను తాను ఎరుగనని అంటాడు. అతను ఎన్నో ఆలోచనలను చేస్తూ, ఆలోచనా రహితంగా ఉండలేడు. ఏ విధమైన కర్మా జ్ఞానిని బాధించదు. ఆయన మనస్సు ఎప్పుడూ శాశ్వత శాంతియుతమై వుంటుంది.

## 3.50 వాసనలు నిరంతర ధ్యానాన్ని సాగనీయవు (స.80)

భ: ధ్యానము అవసరమా?

మ: భూమికూడా నిరంతర ధ్యానములో వున్నదని ఉపనిషత్తులు చెబుతున్నాయి.

భ: దానికి కర్మ ఎలా సహకరిస్తుంది? ఇప్పటికే దింపుకోవలసిఉన్న భారవంతమైన బరువుకు కర్మ మరింత బరువును జతచేయదా?

మ: నిస్వార్థముగా చేసే కర్మ మనస్సుని నిర్మలంచేసి, దానిని ధ్యానంలో స్థిరపడేందుకు సాయపడుతుంది.

భ: కర్మ చేయకుండా వ్యక్తి నిరంతరమూ ధ్యానము చేసినట్లయితే?

మ: ప్రయత్నించి చూడు. వాసనలు నిన్ను అట్లా చేయనీయవు. గురువు అనుగ్రహము వలన వాసనలు బలహీనపడి, ధ్యానము క్రమ క్రమంగా కుదురుతుంది.

## 5.51 జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, తురీయము, తురీయాతీతము - ఈ అయిదు అవస్థలను గురించిన అవగాహన (స.617)

మనిషికి అయిదు అవస్థలున్నాయి : అవి 1. జాగ్రత్తు, 2. స్వప్నము 3. సుషుప్తి, 4. తురీయము, 5. తుర్యాతీతము.

వీనిలో జాగ్రత్తు మేల్కొన్న స్థితి. ఈ జాగ్రదవస్థలో జీవుడు విశ్వదశలోను, ఈశ్వరుడు విరాట్ దశలోను, హృదయ పద్మములోని అష్టదళములయందు కలిసి నెలకొని ఉంటూ, నేత్రముల ద్వారా పని చేస్తూ, జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల ద్వారా, మిగిలిన అవయవముల ద్వారా వివిధ విషయముల నుండి నిత్యనూతన సుఖములను అనుభవిస్తుంటారు. బహుదూరము వ్యాపించియున్న స్థూలములగు పంచభూతములు, దశేంద్రియములు, పంచప్రాణములు, నాలుగు అంతః కరణములు, ఇరువది నాలుగు తత్త్వములు - ఇవి అన్నీ కలిసి స్థూలశరీరముగా ఏర్పడతాయి. జాగ్రదవస్థ యొక్క లక్షణము సత్త్వగుణము. 'అ' అను అక్షరము దీనిని సూచిస్తుంది. దీనికి అధిష్ఠాన దేవత విష్ణువు. స్వప్నము కలలతో కూడియున్న స్థితి. ఈ స్వప్నావస్థలో జీవుడు తైజస దశలోను, ఈశ్వరుడు హిరణ్యగర్భ దశలోను హృదయపద్మములోని కర్ణిక యందు కలిసి నెలకొని ఉంటూ, కంఠము నందు పని చేస్తూ, జాగ్రదవస్థలో ప్రోగుచేసుకున్న సంస్కార ఫలములను మనస్సు ద్వారా అనుభవిస్తుంటారు. సకల తత్త్వములు, స్థూలపంచభూతములు, మనస్సు, బుద్ధి, మొత్తము పదునేడు కలిసి స్వప్న దేహముగా ఏర్పడతాయి. స్వప్నావస్థ యొక్క లక్షణము రజోగుణము. 'ఉ' అనే అక్షరము దీనిని సూచిస్తుంది. దీనికి అదిష్ఠానదేవత బ్రహ్మ. ఇట్లు జ్ఞానులు చెబుతున్నారు.

సుషుప్తి గాఢ నిద్రాస్థితి. ఈ సుషుప్తిలో జీవుడు ప్రాజ్ఞ దశలోను, ఈశ్వరుడు 'ఈశ్వర' దశలోను, హృదయ పద్మములో కేసరముల యందు కలిసి నెలకొని ఉంటూ, సూక్ష్మమగు అవిద్య యొక్క సాయముతో బ్రహ్మానందాన్ని అనుభవిస్తుంటారు. కోడిపెట్ట పగటిపూట అంతటా తిరిగి, తిరిగి, రాత్రి కాగానే, తన పిల్లలను పిలిచి,

తన రెక్కలతో కప్పి, నిద్రించుమాదిరిగానే సూక్ష్మజీవుడు అప్పటి జాగ్రత్ స్వప్నముల యొక్క అనుభవములను పూర్తి చేసుకొని, పిదప ఆ రెండు దశలలో ప్రోగుచేసుకొన్న సంస్కారములతో కారణశరీరములోనికి ప్రవేశిస్తాడు. ఆ కారణశరీరము అవిద్యానిర్మితమైనట్టిది. దీని లక్షణము తమోగుణము. దీనిని 'మ' అను అక్షరము సూచిస్తుంది. దీనికి అధిష్ఠాన దేవత రుద్రుడు.

**సుషుప్తి శుద్ధ సత్‌స్థితి యొక్క అనుభవమే కాని మరేదీ కాదు.** ఈ మూడు అవస్థలకు త్రిలోకములు, త్రిదుర్గములు, త్రిమూర్తులు ఇత్యాదిగా గల విభిన్న నామములు ఉన్నాయి. స్వరూపము ఎప్పుడూ, పైన పేర్కొన్నవిధంగా హృదయంలో ఉంటుంది. **జాగ్రదవస్థలో హృదయమును వీడకుండా మనోవ్యాపారము లన్నింటినీ నిశ్చలము కావించి, కేవలముగా బ్రహ్మమును ధ్యానిస్తే, అట్టి స్థితిని తురీయము అంటారు. జీవుడు బ్రహ్మమునందు విలీనమైపోయినప్పుడు ఆ స్థితిని 'తురీయాతీతము' అంటారు.** వృక్షలతాది వర్గము ఎప్పుడూ సుషుప్తిలో ఉంటుంది. జంతువులకు స్వప్నసుషుప్తులు రెండూ ఉంటాయి. దేవతలు సర్వదా జాగ్రద్దశలో ఉంటారు. మనుష్యులకు మూడు అవస్థలూ ఉన్నాయి. జ్ఞానదృష్టిగల యోగి 'తురీయము'లోనే ఉంటాడు. అత్యుత్తమ యోగి తుర్యాతీతములో ఉంటారు. **అవస్థాత్రయము సాధారణ వ్యక్తులకు ఒకదాని తరువాత ఒకటి వస్తూ పోతూ ఉంటుంది.** తురీయము, తుర్యాతీతము - ఈ రెండూ అభ్యాసము వల్ల సిద్ధించి, మోక్ష ప్రాప్తికి సహాయకములుగా ఉంటాయి. జాగ్రత్ స్వప్నసుషుప్తులలో ప్రతి ఒకటి మిగిలిన రెండు అవస్థలనూ పరిహరించి, దేశగత కాలనియమాలకు పరిమితమవుతాయి. కనుక అవి అసత్యములు.

**మన జాగ్రత్ స్వప్నావస్థల అనుభవమే, చైతన్యము ఆత్మగా ఐదు అవస్థలకు ఆధారమనీ, అది ఎప్పుడూ అఖండంగా ఉండి, వాని అన్నింటినీ సాక్షిగా చూస్తున్నదనీ నిరూపిస్తున్నది.** కాని సుషుప్తిలో ఉండే ఆ చైతన్య విషయంలో, ప్రతి మనిషి, "నాకేమీ తెలియదు, నేను బాగా హాయిగా నిద్ర పోయాను" అని

మెళ్లుటం మనకు తెలిసిన విషయమే. ఈ వాక్యము వలన మనకు రెండు వాస్తవాలు తెలుస్తున్నాయి. ఏమీ తెలియక పోవటం మొట్టమొదటిది. గాఢ నిద్ర వలన కలుగు సుఖము రెండవది. ఇవి నిద్రలో ఉన్నాయి, అనుభవంలోనికి వచ్చాయి. లేకపోతే అదే మనిషి జాగ్రదవస్థలో ఆ మాటలను చెప్పలేడు. అనుమానము అంటే అనుభవాలనుండి మనం చేరగలిగే అభిప్రాయము కూడా ఇదే విషయాన్ని రూఢిపరుస్తున్నది. సమస్త విషయములను కప్పివేసే చీకటిని కన్ను చూడగలిగినట్లే, ఆత్మ కూడా దృశ్యప్రపంచాన్ని కప్పివేసిన అజ్ఞానాంధకారాన్ని చూస్తున్నది. ఊగుతున్న ఆకుల గుబురుల నుండి తొంగి చూచే చంద్రకిరణకాంతుల మాదిరిగా, అవిద్యాంధకారము, అత్యంత సూక్ష్మముగా క్షణకాలము మెరసి వేగముగా పోయే బ్రహ్మానందరస బిందువుల రూపములో ఆత్మబయటకు వచ్చినప్పుడు, ఏమీ తెలియలేదు అనే చీకటి అనుభవగోచరమయింది. అయినప్పటికీ ఆ ఆనందానుభవము ఇంద్రియములు, మనస్సు వంటి ఏ సాధనముల ద్వారానో కలిగినట్టిది కాదు. కాని అది సుషుప్తిలో చైతన్యము ఉండనే ఉన్నదన్న సత్యాన్ని రూఢిపరుస్తోంది. సుషుప్తిలో అజ్ఞానము ఉండటానికి గల కారణం ఏమిటంటే, అక్కడ సాపేక్షజ్ఞానము లేకపోవటమే. అలాగే సుషుప్తిలో ఆనందం ఎందుకు అనుభవగోచరమయింది అంటే, కలతకు కారణమైన తలపులు లేక పోవటం వల్లనే.

సుషుప్తిలోని ఆనందానుభవము నిజమే అయినట్లయితే, మనుషుల్లో ఏ ఒక్కరూ దానిని ఆ సమయంలో గుర్తించలేరే, ఎందుచేత? నీటిలో మునిగి, తనకు కావలసిన వస్తువును నీటి అడుగున కనుగొన్న వ్యక్తి, తాను నీటిలో నుండి బయటకు వచ్చే వరకూ, గట్టుమీద తన కోసం ఎదురు చూస్తున్నవారితో, తనకా వస్తువు దొరకినదన్న సంగతి చెప్పలేడు. అదే విధంగా, నిద్రబోతున్న వ్యక్తి, తాను వాసనల వలన తగిన సమయంలో మేల్కొల్పబడేంతవరకు, వాగింద్రియములతో సంపర్కము పెట్టుకోలేడు కాబట్టి, సుషుప్తిలో తనకు కలిగిన అనుభవాన్ని (సుషుప్తిలో ఉన్నప్పుడే) చెప్పలేడు. అందుచేత ఆత్మ సచ్చిదానంద ప్రకాశమని సారాంశము.

జాగ్రత్‌స్వప్న సుషుప్త్యవస్థలలోని అనుభవాలను పొందుతున్న వానికి క్రమంగా విశ్వ, తైజస, ప్రాజ్ఞులని నామములు. ఒకే వ్యక్తి ఆ ముగ్గురికీ ఆధారంగా ఉన్నాడు. అందుచేతనే వారు శుద్ధ ఆత్మ అని చెప్పబడే సచ్చిదానంద స్వరూపులుకారు. సుషుప్తిలోని అనుభవమును బ్రహ్మానందమని చెబుతున్నారు. తలపులు లేనందువలన కలిగిన అనుభవము కనుక, అది బ్రహ్మానందము యొక్క నిషేధ్య దశ మాత్రమే అని చెప్పవలసి ఉంటుంది. ఐనా అది తాత్కాలికమైనట్టిదే. ఆ ఆనందము ఆభాసానందము, బ్రహ్మానందము యొక్క కుహనారూపము. అది ఇంద్రియ విషయభోగముల వలన కలుగు ఆనందభావన కంటె వేరు అయినది కాదు. **సుషుప్తిలో ప్రాజ్ఞుడు ఆత్మతో ఏకమవుతున్నాడని చెబుతారు.** కాబట్టి సుషుప్తిలో జీవత్వము బీజరూపంలో ఉంటుందని చెప్పాలి. **అన్ని అనుభవములకు ఆత్మయే ఆధారంగా ఉన్నది. వాని అన్నింటికీ అది సాక్షిగానూ ఉంది, ఆశ్రయముగానూ ఉంది. ఈ విధముగా బ్రహ్మము జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి అవస్థాత్రయము కంటె భిన్నమైనట్టిది.**

## నాల్గవ భాగం

# కర్మ - క్రియ - కర్తృత్వం

...క ఉన్నత శక్తికి నిన్ను నీవు అర్పించుకుంటే సరి. ఆ శక్తే నీ వ్యవహారాలన్నిటినీ ...చుకుంటుంది. కర్తని నేనే అనుకుంటే ఫలితాలని కూడా నీవే అనుభవించాల్సి ...స్తుంది. అట్లా కాకుండా నిన్ను అర్పణ చేసుకొని, ఆ ఉన్నత శక్తి చేతుల్లో ఒక ...నిముట్టుగానే నిన్ను నీవు భావించుకుంటే ఆ శక్తే నీ వ్యవహారాలనూ, వాటి ...ఫలితాలనూ కూడా చూసుకుంటుంది. వాటి వల్ల నీవేవిధంగానూ ప్రభావితం కావు, ...పని మాత్రం సాగిపోతూంటుంది. నువ్వా ఉన్నత శక్తి ఉన్నట్టు గ్రహించినా, గ్రహింపకపోయినా, జరిగే పనుల క్రమం ఏమాత్రమూ మారదు. ఎటొచ్చీ, నీ దృక్పథమే మారుతుంది. రైలులో ప్రయాణం చేసేప్పుడు నీ సామాన్ల భారాన్ని నీ నెత్తిమీద పెట్టుకోవడమెందుకు? ఆ రైలే నిన్నూ, నీ సామాన్లనీ మోసుకొని వెళ్తుంది కదా– ఆ సామాను నీ తలమీద ఉన్నా, రైలు డబ్బా మీద ఉన్నా సరే. ఆ సామాన్లని నీ నెత్తిమీద ఉంచుకున్నంత మాత్రాన రైలు లాగే బరువేమీ తగ్గదు. నీవు మాత్రం అనవసరంగా శ్రమపడుతావు. లోకంలో వ్యక్తుల కర్తృత్వమనే భావం ఇటువంటిదే"

(స.503).

# ప్రవేశిక

కార్యనిమగ్నమైన దేహాన్నే నేను అని ప్రతివారూ భావిస్తారు. "నేను కాకపోతే ఈ పనిని ఎవరు చేస్తున్నారు?" అని తనని తానే ప్రశ్నించుకుంటాడు. దేహం పని చేస్తూన్నా అతడు కర్త కాడని చెప్తే విస్తుపోతాడు. కేవలం చైతన్యమే అయిన మనం దేహంతో తాదాత్మ్యం చెందడం వల్ల , దేహపు కదలికలన్నీ మనవే అనుకుంటామంటారు శ్రీభగవాన్.

మేల్కొనియున్న స్థితి ఆత్మ యొక్క పరివర్తిత కాంతి వల్లనే కలిగినా, ఎద్దుబండిలో నిద్రిస్తున్న ప్రయాణీకుని వలె, ఆత్మ ఎప్పుడూ ఎరుకగానే ఉంటుంది కాని, దేహపు కార్యాలతో సంబంధం కలిగి ఉండదు (3.07). నిత్యం ఉండే సూర్యుని వంటిది ఆత్మ. ఆ సూర్యకాంతి పడితే పగలవుతుంది. పడకపోతే రాత్రవుతుంది. సూర్యకాంతిలో మొక్కలు పెరుగుతాయి, నీరు ఆవిరైపోతుంది, వగైరా. భూమిపై తన సమక్షాన జరిగే ఈ కార్యకలాపాలని తనకి ఆపాదించుకోడు సూర్యుడు.

## కర్మ చేసేది మనమేనా?

ఆధ్యాత్మిక ప్రస్థానంలో మన ఉనికి గురించే మనం సందిగ్ధంలో పడతాం. ఆకలి, దాహం వంటి అనివార్యమైన భౌతిక అవసరాలు ఎంతవరకు నిజం? మనకెన్నో సంకల్పాలుంటాయి, వాటిననుసరించే మనం పనులు చేస్తున్నామనుకుంటాం. కాని కర్తలం మనం కామంటారు శ్రీభగవాన్. అందువల్ల మన దేహం చేసే కర్మల గురించిన ప్రశ్న యిది: కర్త ఎవరు? ప్రశ్న అడిగిన వాని ఆధ్యాత్మిక స్థాయిని బట్టి శ్రీభగవాన్ ఇటువంటి ప్రశ్నలకు సమాధానాలిచ్చేవారు. అంతేకాక, కేవల దృక్పథం నుంచి కూడా సమాధానాలిచ్చేవారు. జ్ఞానం దృష్ట్యా (లేక సద్వస్తువు దృష్ట్యా) ఆకలి వంటివన్నీ

స్వప్నతుల్యమే(4.04). జ్ఞాన నిష్ఠులై ఉండేవరకూ ఆకలి వంటి సమస్యలు నిజమే కనిపిస్తాయి, వాటి సంగతి చూసుకోవలసిందే.

మన అనుభవమే ఇందుకు దృష్టాంతమంటారు శ్రీభగవాన్. కడుపు నిండా భోజనం చేసి మనిషి నిద్రపోవచ్చు. కాని కలలో తాను రోజంతా మండుటెండలో కాయకష్టం చేసినట్టు చూస్తాడు. అలసిపోతాడు, బాగా తినాలనుకుంటాడు. మెలకువరాగానే మాత్రం కడుపు నిండుగా ఉన్నట్టూ, తన పక్కమీద నుంచి కదలనట్టూ తెలుసుకుంటాడు. కలలో ఉన్నంతసేపూ బాధ నిజమేననిపిస్తుంది. కలలోని ఆ ఆకలిని తీర్చేది, కలలో తీసుకున్న ఆహారమే- కలలోనే కనబడే ఆకలిగొన్న ఇతరులకు కూడా కలలోనే ఆహారం పెట్టాల్సి వస్తుంది. కలలోని స్థితినీ, మేల్కొని ఉన్న స్థితినీ కలిపేసి కలగాపులంగా చేయకూడదు. మేల్కొన్నప్పుడు కూడా ఆత్మ నిష్ఠుడయ్యేవరకూ, అంటే మాయ నుండి విముక్తమయ్యేవరకూ, సామాజిక సేవ చేసి ఇతరుల బాధని వారించడానికి ప్రయత్నించాలి. దానిని కూడా అహంకారం లేకుండా, అంటే కర్తృత్వ భావం లేకుండా చెయ్యాలి- 'నేను భగవంతుని పనిముట్టును' అనుకుంటూండాలి (4.04).

దేహపు కార్యకలాపాలు మనవే అనుకుంటాం. ఈ విషయమై శ్రీభగవాన్ ఒక భక్తుడు తిరువణ్ణామలైకి ప్రయాణమవడం గురించి చెప్పారు. శ్రీభగవాన్ ఇట్లా అంటారు: "మీ ఇంటి దగ్గర బండి ఎక్కి ఆ తరువాత రైలు ఎక్కి స్టేషన్‌లో దిగిన తర్వాత మరొక బండినెక్కి ఆశ్రమానికి వచ్చారు. ఎవరైనా అడిగితే, మీ ఊరు నుంచి ఇంత దూరమూ ప్రయాణం చేసానంటారు ఇది నిజమేనా? మీరు మీరుగానే ఉన్నారు. కదలికలన్నీ వాహనాలవే కదా! ఆ కదలికలన్నీ మీవే అని ఎట్లా తప్పుగా అనుకుంటున్నారో అదేవిధంగా మీ ఇతర చేతలన్నీ మీవే అనుకుంటారు- అవి మీవి కావు (4.14).

చైతన్యపు పరివర్తిత కాంతిలోనే మేల్కొన్న స్థితి ఉదయిస్తుంది. దానితోబాటు మనస్సూ, జ్ఞానేంద్రియాలూ, కర్మేంద్రియాలూ సచేతనమవుతాయి. మనం మాత్రం ఏమాత్రమూ మార్పు చెందని ఆత్మే. కదిలేదల్లా దేహంతోబాటు ఇంద్రియాలే- శ్రీ భగవాన్ ఇట్లా

అంటారు "దేహంతో తాదాత్మ్యం చెందడం వల్ల పనినంతా నేనే చేశాననుకుంటావు. కాని దేహంగాని, దాని కార్యకలాపాలు గాని ఆత్మకి భిన్నం కావు. ఏదైనా కార్యం చేస్తేనేం, చేయకపోతేనేం? ఒకచోటు నుంచి మరొక చోటుకి నడిచి వెళ్ళేప్పుడు ప్రతి అడుగునూ గమనించవు కదా. కొంతసేపటికి గమ్యాన్ని చేరినట్టు గ్రహిస్తావు. నడవటం అనే కార్యం దానిపై నీ అవధానం లేకపోయినా సాగిపోయింది. అట్లాగే, మిగిలిన కార్యాలు కూడా" (3.07)

శ్రీభగవాన్, అన్నిటికంటే ముఖ్యమైనది హృదయమేనంటారు. ఆ కేంద్రం నుంచే క్రియాశక్తీ, చిత్‌శక్తీ మెదడుకి ప్రసరిస్తాయి. అందువల్లే అది పని చేయగలుగుతుంది (ఉపదేశసారం శ్లో. 12). చిత్‌శక్తి వలన మనస్సు ప్రపంచాన్ని గ్రహించడం, శరీరపు వ్యాపారాలను తెలిసికోగలగడం జరుగుతుంది. క్రియాశక్తి వల్లే అంటే ప్రాణం వల్లనే దేహపు లోపలి కార్యకలాపాలూ, దేహంతో జరిగే కార్యకలాపాలూ సాగుతాయి.

ఆత్మ చైతన్యం వల్లనే మనస్సుకీ, ప్రాణానికీ చైతన్యం ఆపాదించబడి, శుద్ధ చైతన్యానికీ, జడమైన దేహానికీ సంబంధమేర్పడు తుంది. ఈ రెండూ కలసి (చిత్‌శక్తి, క్రియాశక్తి)మానవుడవుతాడు. అందువల్ల ఇంద్రియాల ద్వారా గ్రహింపులోగాని, కార్యకలాపాల నిర్వహణలోగాని ఒక వ్యక్తి అంటూ ఎవ్వరూ లేరు.

మన మెదడు పని చేస్తోందంటే అది కేవలం హృదయం నుండి ప్రసరించే క్రియాశక్తి, చిత్‌శక్తుల వల్లనే. శ్రీ భగవాన్, వాసనలని హృదయం తనకు అత్యంత సమీపంలోనే అతి సూక్ష్మ రూపంలో ఉంచుకుంటుందంటారు– ఒక లోభి తన సంపదనంతా తనకి దగ్గరగా, అందుబాటులో ఉంచుకున్నట్లే. వాసనలు హృదయంలో నుండి ఎగిసి మెదడుకి ప్రవహిస్తాయి. వాటినే పెద్దవిగా చేసి చూపుతుంది మెదడు సినిమాప్రదర్శనలోవలె. అందువల్లే లోకం సినిమా వంటిదేనంటారు. ఆ వాసనలు మనిషిని ఒక నిర్దిష్ట పద్ధతిలో పనిచేయ ప్రేరేపిస్తాయి. అవన్నీ మనమే చేస్తున్నామనుకుంటాం.

అంటే, అన్ని కార్యాలూ ఆత్మ నుండే, ఆత్మానుసారమే జరుగుతాయి. ఆత్మ నిష్ఠులమైతే ఆ మాటల సత్యం అర్థమవుతుంది. కేవల సమాధ్యవస్థలో తాత్కాలికంగా ఆత్మ

...పోతుంది. తిరిగి అహంకారస్థితి వస్తుంది. ఆ కేవల సమాధిలో తాత్కాలికంగా మెలకువ, కల, సుషుప్తులలోని వ్యాపారాలు (చిత్ క్రియాయుత) ఆత్మలో కలిసిపోతాయి. ...సమాధి స్థితి ముగియగానే తిరిగి వెలికి వస్తాయి.

సహజ సమాధిలో (అంటే నిరంతర సమాధ్యవస్థ) చిత్క్రియాయుత వ్యాపారాలూ, మూడు అవస్థలూ, అన్నీ మరల గోచరమవకుండా నాశనమయిపోతాయి. తిరిగి ఉదయించవు (3.48). సహజ సమాధిలోని జ్ఞానికి దేహపు కర్మలు తెలియవు, కాని సత్కర్మే జరుగుతుంది. ఇతరులు మాత్రం జ్ఞాని చర్యలు కూడా మనవంటివిగానే భావిస్తారు. తాను కర్త అనే భావం ఉండదు జ్ఞానికి.

మనిషి ఏదైనా పని చేయాలంటే, ఆ తలంపు ఉదయించకముందే, మనస్సు తగిన దేహసంబంధమైన సన్నాహాలను చేస్తుందని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ఒక ఆలోచన రాకముందే, ఆ సన్నాహాలు ఎవరు చేశారు అనే ప్రశ్న వస్తుంది. (మౌంటెన్ పాత్ జనవరి- మార్చి 2010లో గారివెబర్ రాసిన "అన్ని ముందే నిర్ణయింపబడ్డాయి" అనే వ్యాసాన్ని చూడండి). ఈ ఉదాహరణ చూడండి: గ్లాసుడు నీళ్లు తాగాలని మనిషి లేస్తాడు. అతని మనస్సులో నీళ్లు తాగాలి అనే భావం ఉదయించకముందే లేచి, నీటి వద్దకు వెళ్లే పనిని దేహం మొదలుపెట్టేస్తుంది. తాగాలన్న భావం ఆ తరువాత కలుగుతుంది.

## ఆత్మ సాక్షాత్కారానికి సన్యాసం అవసరమా?

లోకంలో మన వర్తనానికి సంబంధించి- ముఖ్యంగా కార్యమూ, కర్మల గురించి ఎన్నో ప్రశ్నలుదయిస్తాయి. ఆత్మజ్ఞానానికి లోకం ప్రతిబంధకమేమో, దానిని విడిచిపెట్టాలేమోననే సందేహం కూడా రావచ్చు.

ఈ సందర్భంగా శ్రీభగవాన్ ఇట్లా అంటారు "నీవు ఇంట్లో ఉన్నా, సన్యసించి అడవిలో ఉన్నా నీ మనస్సు నిన్ను వెంటాడుతూనే ఉంటుంది. ఆలోచనకి మూలం అహంభావమే. అదే నీ దేహాన్నీ, లోకాన్నీ కల్పించి నీవొక గృహస్థువి అనుకునేట్లు చేస్తుంది. నువ్వు

సన్యసిస్తే, సంసారాన్ని త్యజించానన్న భావమేర్పరుస్తుంది. అట్లాగే ఇంటి పరిసరానికి బదులు అడవి పరిసరాన్ని కల్పిస్తుంది. ఏమైనా మానసిక అడ్డంకులు నీకెప్పుడూ ఉంటూనే ఉంటాయి. పైగా, కొత్త పరిసరాలలో ఇంకా ఎక్కువే అవుతాయి. పరిసరాల మార్పిడి వల్ల పెద్ద ప్రయోజనం లేదు. ప్రధానమైన అడ్డంకి మనస్సే. ఇంట్లో ఉన్నా, వనంలో ఉన్నా దానినే అధిగమించాలి. అడవిలో ఏదైనా చేయగలిగితే, ఇంట్లో ఎందుకు చేయలేవు? పరిసరాన్ని మార్చడమెందుకు? ఏ వాతావరణంలోనైనా నీ కృషిని చేస్తూండవచ్చు" (స. 54) ఆత్మని అనాత్మతో తాదాత్మ్యం చెందనీయకపోవడమే సన్యాసమంటే. అవిద్యపోతే, అనాత్మ కూడా పోతుంది. అదే అసలు సన్యాసమంటే.

## మనిషికున్న స్వేచ్ఛ అంతా, దేహం యొక్క కర్మలతో తాదాత్మ్యం చెందకుండా ఉండటమే

శ్రీభగవాన్ ఇట్లా అంటారు "నీ నిజస్వరూపాన్ని గ్రహించి, ఏపనైనా చేసేది నీవు కాదని తెలుసుకుంటే శరీరం ద్వారా జరిగే ఆ కర్మఫలం నీకు అంటదు- దాన్ని గత జన్మల కర్మ వల్లనో లేక దైవ సంకల్పం వల్లనోనని- దాన్ని ఏ పేరుతో పిలిచినా సరే. నీవు సదా అపరిమితమైన స్వేచ్ఛాయుతుడవి" (4.01).

మనిషికి తన సంకల్పానుసారం వ్యవహరించడానికి స్వేచ్ఛవుంది అని అనుకునే వ్యక్తికి శ్రీభగవాన్ చెప్పేదిది: దేహం చేసే కర్మలను నీవి అనుకోకుండా ఉండటం వరకే స్వేచ్ఛ ఉంది నీకు.

మనిషి చేసే ప్రతిదీ పూర్వమే నిర్ణయింపబడిందంటారు శ్రీభగవాన్. ఈ మాట ముఖ్యమైన వాటికే, అంటే జీవిత భాగస్వామిని ఎంచుకోవడం, వృత్తి వంటివాటికే పరిమితం కాదు. స్వల్ప విషయాలకీ- అంటే గ్లాసుడు నీళ్ళు తాగడానికీ, గదిలో ఒక చోటు నుండి వేరొక చోటుకి వెళ్లడానికీ- కూడా వర్తిస్తుంది. "అన్నీ పూర్వమే నిర్ణయింపబడ్డాయి. జీవితంలో ఏయే పనులు దేహం చేయవలసి వున్నదో దాని కనుగుణంగా అది తయారు చేయబడింది. కార్యక్రమమంతా ముందే నిర్ణయింపబడింది

ఏదిచేయ నిర్ణయింపబడిందో దానికొరకే దేహం వస్తుంది అసలు. ఈశ్వరేచ్ఛతో తప్ప ఒక్క రేణువు కూడా కదలదు. ఇదే సత్యం. ఇక మనిషి స్వేచ్ఛ అంతా దేహపు ప్రవృత్తులతో తాదాత్మ్యం చెందకుండా ఉండటంలో, వాటి వల్ల కలిగే సుఖ దుఃఖాల వల్ల ప్రభావితం కాకపోవడంలోనే ఉంది" (4.02)

మనమేమి చేయాలో ఏమి చేయక్కర్లేదో అనే విషయం మనమేమీ అర్థం చేసుకోనక్కర్లేదంటారు శ్రీభగవాన్. మనకి నచ్చినా నచ్చక పోయినా మనచేత ఏదిచేయ రాసిపెట్టి ఉందో ఆ కార్యం జరగాల్సిందే.

శ్రీభగవాన్, ప్రశ్నించే వానికి, మనిషి కర్తకాదనీ, అతడు మనస్సూ- దేహమూ కాదనీ అతడు కేవలం ఆత్మేననీ చెప్తారు. ఆత్మ సమక్షంలోనే పని జరుగుతుంది. అతనికి తాను ఆత్మనని ఎరుక ఉన్నా లేకపోయినా తన దేహం చేసే కర్మల విషయంలో అతని ప్రమేయం లేదు. ఆత్మ సాక్షాత్కారమైనంత మాత్రాన జరిగేవి జరగకమానవు. ఎటొచ్చీ అతని దృక్పథంలోనే మార్పు వస్తుంది.

## చైతన్య హీనుడు కర్మ చేయగలడా?

ఆత్మ అంటే ఉనికి- చైతన్యమూను. చైతన్యం లేకపోతే కర్మ చేయలేడు. శ్రీభగవాన్ ఇట్లా అంటారు "అంతా ఆత్మమయమే. నీవు ఆత్మ కన్నా భిన్నమా? ఆత్మ లేకుండా కార్యం కొనసాగగలదా? లేక నీ దేహం ఆత్మ కన్నా వేరా? ఏదీ ఆత్మకి భిన్నం కాలేదు. ఆత్మ విశ్వమయం. అందుచేత అన్ని కర్మలూ, నీవు స్వచ్ఛందంగా చేసినా చేయకపోయినా, కొనసాగుతాయి. కార్యం దానంతట అదే సాగిపోతుంది. ఆత్మపై దృష్టి పెట్టడమంటే, కార్యంపైనా దృష్టిపెట్టడమే" (4.08)

దీని బట్టి మనకి అర్థమయ్యేది ఇది: ఎట్లా చేయాలో విశ్వమట్లాగే చేస్తుంది. ప్రపత్తిలో ముఖ్యమైన అంశమిదే. శ్రీభగవాన్ మనకి, మనమే కర్తలమని భావించవద్దని ఉపదేశిస్తారు.

తరువాతి విభాగంలో శ్రీభగవాన్ పై విషయాల గురించి ఇచ్చిన సంభాషణలుంటాయి.

# కర్మ - క్రియ - కర్తృత్వము

## కొన్ని సంభాషణలు

ఈ భాగంలో "కర్మ - క్రియ - కర్తృత్వము" అనే విషయం 'శ్రీ రమణ మహర్షితో సంభాషణములు' నుండి గ్రహించిన సంభాషణములతో విశదీకరింపబడింది.

**4.01 జీవితం స్వప్నతుల్యమని తెలుసుకొని దానినుండి బయటపడేందుకు ప్రయత్నం చేయవలసిన కర్తవ్యం నీకు నిర్దేశింపబడివున్నది (అ.ర. 3.1.46)**

"పరిణామ వాదము వాస్తవమేనా?" అనే ప్రశ్నకు భగవాన్ ఇలా సమాధానం ఇచ్చారు: మన అందరితో వచ్చిన చిక్కు ఏమిటంటే, మనము మన గతాన్ని గురించి తెలుసుకోవాలనుకుంటాము. గతంలో మనం ఎలా ఉన్నాము, భవిష్యత్తులో మనం ఎలా ఉండబోతున్నాము, అనే విషయాలను తెలుసు కోవాలనుకుంటాము. నిజానికి మనకు గతాన్ని గురించి గాని, భవిష్యత్తును గురించి కాని ఏమీ తెలియదు. మనకు వర్తమానము మాత్రము తెలుసు, అంటే మనము ఇప్పుడు ఉన్నాము అని తెలుసు. **నిన్న, రేపు అనేవి నేడును బట్టే ఉన్నాయి. నిన్న దాని సమయంలో నేడు అనే పిలువబడింది; రేపు కూడా దాని సమయంలో నేడు అనే పిలువబడుతుంది. నేడు అనేది నిత్య వర్తమానము, అనగా నిత్య సిద్ధము. అది ఎల్లప్పుడూ ఉంటుంది. నిత్యసిద్ధంగా ఉండేది శుద్ధ సత్‌స్థితి, దానికి భూత భవిష్యత్తులు లేవు. వర్తమానము** యొక్క సత్య స్వరూపమును కనుగొనుటకు ప్రయత్నించరాదా?

భ: వర్తమానము గత కర్మల ఫలమే అనిచెబుతారు. మన పురుష ప్రయత్నముతో ఇప్పుడు గత కర్మలను దాటగలమా?

... నేను చెప్పినట్లుగా వర్తమానము అన్నది ఏమిటో చూడు. అప్పుడు, ఏది ...ంపబడుతుందో, దేనికి భూత భవిష్యత్తులున్నాయో, ఏది నిత్యసిద్ధముగా, ...త్యముక్తముగా, గతముచేగాని, భవిష్యత్తుచేగాని, గత కర్మచేగాని బాధింపబడనిదిగా ...టుందో నీకు తెలుస్తుంది.

శ్రీ జోషి ఐదు ప్రశ్నలు వేశాడు. ఆ ప్రశ్నలూ వానికి భగవాన్ చెప్పిన సమాధానాలు క్రింద యిస్తున్నాను.

భ: "నేనెవడను?" అంటూ నిరంతరం ప్రశ్నించుకుంటూ ఉండాలా, సమాధానం చెప్పుకోకుండానే? ఎవరు ఎవరిని ప్రశ్నిస్తున్నారు? మనస్సులో విచారణ చేసే సమయంలో ఏ భావన ఉండాలి? (ప్రశ్నిస్తున్న)'నేను' ఆత్మయా, అహంతయా?

మ: 'నేనెవడను'? అన్న విచారణలో 'నేను' అన్నది అహంత. ఈ అహంత యొక్క మూలము ఏది అని ప్రశ్నకు అర్థము. మనస్సులో నీకు ఏ భావన ఉండనక్కరలేదు. చేయవలసినదల్లా ఒకటే. "నేను ఫలానా పేరు మొదలయినవి కలిగినట్టి, ఫలానా రూపు రేఖలు కలిసినట్టి ఈ దేహము మాత్రమే" అనే భావనను విడిచిపెట్టాలి. నీ స్వస్వరూపాన్ని గురించిన ఎట్టి భావన ఉండవలసిన అవసరంలేదు. అది ఎల్లప్పుడూ ఎలా ఉన్నదో అలాగే ఉంది; అది సత్యవస్తువు, భావనకాదు.

భ: నేను ఎల్లప్పుడూ ఈ విచారణ చేస్తూనే ఉండలేను. ఎందుకంటే నాకు ఇతరములైన పనులు ఎన్నో చేయవలసినవి ఉన్నాయి. ఆ పనులు చేస్తున్నప్పుడు, ఈ విచారణను మరచిపోతాను.

మ: నీవు ఇతరమయిన పనులు చేసేటప్పుడు నీవు లేకుండా పోయినావా? నీవు ఎప్పుడూ ఉన్నావు; ఉండలేదా?

భ: కర్తృత్వ భావన అంటే, 'నేను చేస్తున్నాను' అనే భావన - లేకుండా పనిచేయటం సాధ్యపడదు.

మ: చేయుటం సాధ్యమే. అనాసక్తితో పని చేయి. నీవు కర్తవు అనే భావనతో పని చేసినప్పటికంటె కూడా, పని అప్పుడు ఇంకా చక్కగా సాగిపోతుంది.

భ: నేను ఏ పని చేయాలో, ఏ పని చేయకూడదో నాకు తెలియటం లేదు.

మ: దానిని గురించి పట్టించుకోవద్దు. ఈ జీవితంలో నీవు ఏ పని చేయవలయునని నిర్దేశింపబడి ఉన్నదో ఆ పని నీ ద్వారా జరిగితీరుతుంది – నీకు అది యిష్టమైనా సరే, ఇష్టం కాకపోయినా సరే.

భ: సాక్షాత్కారము పొందటానికి నేను ఎందుకు ప్రయత్నం చెయ్యాలి? కల గాంచి మేల్కొన్న మాదిరిగా నేను ఈ స్థితి నుండి బయటకు వస్తాను. కలలోనుండి బయటకు వచ్చేందుకు మనము ప్రయత్నమేమీ చేయటం లేదు కదా!

మ: కలగంటున్నప్పుడు, అది ఒక కల మాత్రమే అన్న భావమే నీకు ఉండదు. అందుచేత ప్రయత్నము చేసి, దాని నుండి బయటపడాలన్న కర్తవ్యము నీకు ఉండదు. కాని, ఈ జీవితంలో నీకు ఒకానొక అంతరజ్ఞానము, (సహజస్ఫురణము) ఉన్నది. నీ నిద్రానుభవము వల్ల, గ్రంథపఠనము వల్ల, శ్రవణము వల్ల, ఈ జీవితం స్వప్నతుల్యమైనదనీ, అందుచేత దీని నుండి బయటపడేందుకు నీవు ప్రయత్నం చేయవలసి ఉన్నదనీ, ఆ కర్తవ్యము నీకు నిర్దేశింపబడి ఉన్నదనీ నీకు అనిపిస్తుంది. అయినా, ఆత్మసాక్షాత్కారం కోసం ప్రయత్నం చేయవలసిందని నీకు ఎవరు చెప్పారు? నీకు అది అక్కరలేకపోతే పోనీ? నీవు కలలోనే ఉండటం మేలు అనుకుంటే, అలాగే, ఇప్పుడు ఉన్నట్లుగానే ఉండు. దానికేముంది?

భ: భగవద్గీతను ఉదహరిస్తూ, భగవాన్‌ను ఇలా అడిగింది : (అర్జునుడికి చెప్పినట్లు) ప్రతివానికీ అతడు చేయవలసిన పని విధినిర్దిష్టమై ఉండి, మనం చేయరాదని ఎంతగా కోరుకున్నా, లేక చేయకుండా ఉండాలని ఎంతగా వ్యతిరేకించినా, దానిని చివరకు ఏదో విధంగా చేసి తీరతామని చెబితే, ఇక పురుషకారము (పురుషప్రయత్నము) అనేది అసలు ఉన్నదా?

మ: మనచే చేయబడవలసి ఉన్న పనిని మనము చేస్తామన్న మాట నిజమే. అయితే మనకు ఒక స్వేచ్ఛ ఉన్నది. మనము చేసే పని యొక్క సత్ఫలితాల నుండి, దుష్ఫలితాల నుండి ఆ పనివల్ల కలిగే సుఖదుఃఖముల నుండి మనము విడివడవచ్చు; అందుకోసం మనము మన శరీరముతోను లేదా ఆ పనిని చేసే తత్త్వముతోను తాదాత్మ్యం చెందకుండా ఉండవచ్చు. నీవు నీ స్వరూపమును సాక్షాత్కరింపజేసుకొని, పని చేస్తున్నది నీవు కాదని తెలుసుకుంటే విధి నిర్ణయం ప్రకారం, లేదా ప్రారబ్ధకర్మానుసారం, లేదా దైవగతి ననుసరించి - దానిని నీవు ఎలా పిలిచినా సరే - శరీరము ఏ పని చేయటంలో నిమగ్నమయి ఉన్నా, ఆ పని యొక్క ఫలితాల వల్ల నీవు ఏ మాత్రమూ బాధింపబడవు. నీకు ఆ స్వేచ్ఛ ఎప్పుడూ ఉంది, ఆ స్వేచ్ఛకు పరిమితి అంటూ లేనేలేదు.

## 4.02 వ్యక్తి జీవితంలోని అన్ని సంఘటనలు ముందే నిర్ణయింపబడి వున్నాయి (అ. ర. 4.1.46 మధ్యాహ్నం)

భ: పై 401లో భగవాన్ చెప్పిన జవాబు విషయంలో మరలా యిలా అడిగారు: "మనిషి జీవితంలో, వాని వృత్తి ఉద్యోగాల వంటి ముఖ్యమయిన సంఘటనలు మాత్రమే విధి నిర్దిష్టములై ఉంటాయా లేక అతని జీవితంలోని అల్పాల్పములయిన విషయాలు సైతం అంటే ఒక గ్లాసెడు నీళ్ల త్రాగటం, గదిలో ఒక చోటి నుండి ఇంకొక చోటికి కదలివెళ్లటం ఇత్యాదులు కూడా - పూర్వ నిర్దిష్టములై ఉంటాయా?

మ : అవును. ప్రతి అంశమూ పూర్వ నిర్దిష్టమే.

భ : అటువంటప్పుడు, మనిషికి బాధ్యత అంటూ ఏమున్నది? అతనికి పురుషకారము అంటూ ఏమున్నది?

మ : ఈ దేహము లోకములోకి ఎందుకు వచ్చిన దనుకుంటున్నావు మరి? ఈ జీవితంలో నిర్వర్తించవలసినవిగా ఏయే పనులు నిర్ణయింపబడి ఉన్నాయో వాని అన్నింటినీ చేయటానికే ఇది నిర్మితమైంది. కార్యక్రమం అంతా ముందే (తయారు

చేయబడి) నిర్ధారించబడి ఉంది. శివుడి ఆజ్ఞలేనిది చీమ అయినా కుట్టదు అనే మాట ఈ సత్యమునే వెల్లడిస్తున్నది. ఈశ్వరేచ్ఛ లేకపోతే ఏదీ కదలదు అని చెప్పు. లేదా ప్రారబ్ధంలో లేకపోతే ఏదీ జరుగదు అని చెప్పు, ఎలా చెప్పినా సరే! ఇక మనిషికి ఉన్న స్వేచ్ఛ విషయానికి వస్తే – దేహంతో తాదాత్మ్యం చెందకుండా ఉండేందుకూ, దేహవ్యాపార పర్యవసానములయిన సుఖదుఃఖముల చేత బాధింపబడకుండా ఉండేందుకూ మనిషికి ఎప్పుడూ స్వేచ్ఛ ఉండనే ఉంది.

## 4.03 కర్తృత్వభావాన్ని త్యజించు, కర్మదానంటతట అదే సాగిపోతుంది (స.41)

భ: తనకున్న జ్ఞానము అఱకొఱయే అయినా దానిని మనిషి ఇతరులకు బోధించవలయునా?

మ: అతని ప్రారబ్ధము అలా కనుక ఉంటే (అలాగే చేస్తాడు). భగవద్గీత సప్తమాధ్యాయములో అర్జునుడు అడుగుతాడు. కర్మ ఒక సాధన అవుతుందా? కృష్ణుడు జవాబు చెబుతాడు : కర్తృత్వ భావన లేకుండా చేస్తే కర్మ ఒక సాధనయే అవుతుంది. కర్మలను నిషేధించినట్టి శాస్త్రములు ఆమోదించిన కర్మలు కూడా అట్టివే. శాస్త్రములు నిషేధించిన కర్మ ఏది? కర్తృత్వభావనతో చేసే కర్మనే అవి నిషేధించాయి. కర్మాచరణమును వదలి పెట్టవద్దు. నీవు అలా చేయలేవు కూడా. **కర్తృత్వభావమును త్యజించు. కర్మదానంతట అది కొనసాగిపోతుంది. లేదా కర్మ నిన్ను విడిచిపోతుంది. ప్రారబ్ధానుసారము నీవు కర్మ చేయవలసియే ఉంటే, అది తప్పక నీవు చేసి తీరతావు నీవు కోరుకున్నా, కోరుకొనకపోయినా. నీవు కర్మ చేయకుండా ఉండాలని వ్రాసి పెట్టబడి ఉంటే, నీవు ఎంత తీవ్రంగా దానిని చేయాలని సంకల్పించుకున్నా, నీవు ది చేయలేవు.** జనకుడు, శుకుడు మొదలయిన వారు కూడా నిరహంకార భావంతో కర్మలు చేశారు. కర్మలు కీర్తిప్రతిష్ఠల కొరకు చేయవచ్చు, లేదా నిస్వార్థబుద్ధితో, లోకసంగ్రహ దృష్టితో చేయవచ్చు – ఎలా చేసినప్పటికీ, వారు ప్రశంసింపబడాలని కోరుకొంటారు. అందుచేత నిజానికి అందులో స్వార్థబుద్ధే ఉంటుంది.

## 104 జ్ఞాన దృష్ట్యా క్షుద్బాధ నిశ్చయముగా కలయే (అ.ర. 5.1.46)

ప్ర: మనం ప్రపంచంలో బాధలు చూస్తున్నాం. ఒక మనిషి ఆకలితో వున్నాడు. ఇది ...క సత్యం. వానికి అది పచ్చి నిజం. మనము దానిని కలగా భావించి బాధని ...ంచు కోకుండా వుండవచ్చా?

జ: జ్ఞాన దృష్ట్యా నువ్వు బాధ అంటున్నది, ప్రపంచము, దానిలో అణుమాత్రమైన బాధవలే, నిశ్చయముగా కలే. కలలో కూడా నీకు ఆకలి వేస్తుంది. ఇతరుల ఆకలి బాధని చూస్తావు. నువ్వుతిని, జాలితో ఆకలితో బాధపడుతున్న వారికి పెడతావు. ప్రస్తుతం నీవు ప్రపంచంలో చూస్తున్న బాధలు ఎంతనిజమో, కలగంటున్నంత సేపూ ఆ బాధలు అంతేనిజము. నీవు మేల్కొన్న తరువాతే కలలోని బాధ నిజంకాదని తెలుస్తుంది. నువ్వు కడుపు నిండాతిని నిద్రపోయివుండవచ్చు. కష్టపడి, ఎంతోసేపు మండుటెండలో పనిచేసి, అలసిపోయి, బాగా ఆకలి వేసి, ఎంతో తినాలని కలగంటావు. మెలకువ వచ్చి చూస్తే యింకా పొట్ట నిండుగా వుందనీ, పక్క లోనించి కదలనే లేదనీ గమనిస్తావు. ఇంతకీ చెప్పేది ఏమిటంటే, ఇలా చెప్పినంత మాత్రాన నువ్వు కలలో వున్నప్పుడు నీకుతోస్తున్న బాధ నిజంకాదన్నటు ప్రవర్తించలేవు. కలలోని ఆకలిని కలలోని భోజనంతోనే తీర్చాలి. కలలో నీకు ఆకలితో కనిపించిన వారికి కలలోనే భోజనము పెట్టాలి. నువ్వు ఎప్పుడూ కల, మెలకువ అన్న రెండు స్థితులను ఒకటన్నట్లు చూడలేవు. నీవు జ్ఞాన స్థితిని చేరి, ఈమాయ నుంచి మేల్కొనేదాకా, దు:ఖాన్ని చూసినప్పుడల్లా దాని నివృత్తి కోసం సంఘసేవ చేయవలసిందే. అప్పుడుకూడా మనకి బోధింపబడ్డట్లు, అ హంకారం లేకుండా, అంటే 'నేను చేస్తున్నాను' అనే కర్తృత్వ భావం లేకుండా, ఆపరమాత్ముని ఉపకరణాన్ని అన్నభావంతో చెయ్యాలి. అదేవిధంగా, నాకన్న తక్కువ స్థితిలోని వానికి సహాయం చేస్తున్నాను, అతనికి సహాయం అవసరం, నేను సహాయం చేయగల స్థితిలో వున్నాను, నేను వున్నతుణ్ణి, అతడు తక్కువ వాడు అన్న మనో ప్రలోభానికి లోనుకాకూడదు. అతనికి, అతనిలోని భగవంతుణ్ణి పూజిస్తున్నట్లు సహాయం చేయాలి. అలాటి సేవలన్నీ మరెవరికో కాదు

ఆత్మకే. నీవు నీకే తప్ప మరెవరికీ సహాయపడటం లేదు.

భ: దీనికి శ్రేష్ఠమైన వుదాహరణ అబ్రహాం లింకన్. అతను బురదగుంటలో నుంచి బయట పడేందుకు ఒక పందికి సహాయం చేస్తూ తన బట్టలు మురికి చేసుకున్నాడు. ఎందుకయ్యా అంత కష్టపడ్డారని అని అడిగితే "నేను చేసింది దాన్ని ఇబ్బంది నుంచి తప్పించడంకన్న అది గుంటలోనించి బయటపడటానికి పడుతున్న యాతన చూస్తూ నాకు కలిగిన బాధను అంతమొందించుకోవడానికి" అన్నాడు.

## 4.05 నిన్ను నీవుతెలుసుకో, కర్మను దానిఅంతట దానిని పూర్తికానీ (స.39)

మ : ఆత్మజ్ఞాని మాత్రమే నిజమయిన కర్మ యోగి కాగల్గుతాడు. కర్తృత్వభావన నశించిన తరువాత ఏమి జరుగుతుందో చూడండి. శ్రీ శంకరులు నైష్కర్మ్యమును బోధించారు. కాని ఆయన భాష్యములు వ్రాయలేదా, తర్కవాదములు చేయలేదా? కర్మాచరణమును గురించి, కర్మపరిత్యాగమును గురించీ ఊరక కలత చెందవద్దు. నిన్ను నీవు తెలుసుకో. అప్పుడు అది ఎవరి కర్మ అవుతుందో చూడవచ్చు. అది ఇంతకూ ఎవరి కర్మ? కర్మ దాని అంతట అది పూర్తి కానీ. కర్తగా ఉన్నంతవరకూ, ఆ కర్మఫలములను అనుభవింపవలసియే ఉంటుంది. తనను తాను అతడు కర్తగా భావించకపోతే, అతనికి ఇక కర్మయే లేదు. అతడు ప్రాపంచిక జీవితమును త్యజించిన సన్న్యాసియే.

## 4.06 కర్తృత్వ భావం తొలగిపోయేదాకా నీవు పని చేయటానికి బద్ధుడవు (స.58)

భ: గీత కర్మానుష్ఠానము కొరకు బోధింపబడింది.

మ: గీత ఏమి చెప్పింది? అర్జునుడు యుద్ధము చేయుటకు నిరాకరించాడు. కృష్ణుడు అప్పుడు ఇలా చెప్పాడు : నీవు యుద్ధము చేయను అని నిరాకరించినంత కాలమూ, నీకు కర్తృత్వ బుద్ధి ఉన్నట్లే. కర్మ చేయుటకు గాని, కర్మ చేయకుండా ఉండటానికి

...ని నీవు ఎవడవు? కర్తృత్వభావనను వదలిపెట్టు. ఆ కర్తృత్వభావన నీలోనుండి ...పోయేంతవరకు నీవు పని చేయక తప్పదు. ఒక **మహాశక్తి నిన్ను నడిపిస్తోంది.** ...దానికి నేను లొంగను" అని నీవు చెప్పుట ద్వారానే అది ఉన్నట్లు నీవు అంగీకరిస్తున్నావు. దానికి బదులుగా ఆ శక్తిని గుర్తించు, దానికి ఒక ఉపకరణముగా ఉండి, లొంగిపో. (మరో విధంగా చెప్పాలంటే) నీవు (యుద్ధము చేయనని భీష్మించుకొని) నిరాకరించావంటే, నీవు బలవంతంగా (యుద్ధరంగంలోనికి) ఈడ్చుకొనిపోబడతావు. అయిష్టంగా పని చేయటం ఎందుకు? ఇష్టంగానే (మనః పూర్వకంగానే, స్వేచ్ఛాయుతంగానే) పని చేయి. అనగా, ఆత్మనిష్ఠుడవై ఉండు. కర్తృత్వభావన లేకుండా, స్వభావానుసారము కర్మ ఆచరించు. అప్పుడు కర్మ ఫలములు నిన్ను బాధించవు. మగతనం అంటే అది, శౌర్యము అంటే అది. ఆ విధంగా, ఆత్మ నిష్ఠయే గీతోపదేశము యొక్క సారసర్వస్వం. చివరకు మహర్షి యిలా చెప్పారు : "మనిషి ఆత్మనిష్ఠారతుడై ఉంటే ఈ సంశయములు ఏవీ రావు. అతడు ఆత్మరతుడై యుండేదాకానే యివన్నీ తలెత్తుతుంటాయి."

భ: మనస్సు ఇంద్రియాలద్వారా ప్రపంచాన్ని తెలిసికొంటుంది. ఇంద్రియాలు క్రియాశీలాలు గా వున్నప్పుడు ప్రపంచం వున్నదన్న భావన లేకుండా వుండలేము. శుద్ధమైన ఎరుకకు కర్మయోగము ఎట్లా ఉపయోగపడగలదు?

మ: మనస్సు ప్రపంచాన్ని ఇంద్రియాల ద్వారా గ్రహిస్తోంది. అది మనోగతమైనది. ద్రష్ట మనస్సునీ, ఇంద్రియాలనీ, ఆత్మలోని వానిగానేగాని, ఆత్మకంటే వేరుగా చూడడు. కర్మల ప్రభావానికి లోనుగాకుండా కర్త ఆత్మను అనుభవగోచరం చేసుకొనేంతవరకూ, మరింత శుద్ధుడౌతాడు. **(స.444)**

## 4.07 కర్మ ఎవరిదో చూడు, నీవు కర్తవు కాదని తెలుసుకుంటావు, (స.116)

భ: జీవుడు కర్మ(పాశ) బద్ధుడు అంటారు. అది నిజమేనా?

మ: కర్మ తన ఫలమును తాను అనుభవించనీ, నీవు కర్తగా ఉన్నంత కాలము, (కర్మఫల) భోక్తవు కూడా అవుతావు.

భ: కర్మ నుండి విముక్తిపొందటం ఎలా?

మ: **ఆ కర్మ ఎవరిదో చూడు. నీవు కర్తవు కాదు అని తెలుసుకుంటావు. అప్పుడు నీవు ముక్తుడవు అవుతావు. ఇందుకు నీకు దైవానుగ్రహము అవసరమవుతుంది. దానికోసమై నీవు దైవాన్ని ప్రార్థించాలి, పూజించాలి, ధ్యానించాలి.** అప్రయత్నంగా జరిగే పని, అనగా అసంకల్పిత కర్మ బంధకారకము కాదు. జ్ఞాని సైతము పనులు చేస్తుంటాడు. అతని దేహవ్యాపారములనుబట్టి ఇది తెలుస్తున్నది. అయితే ప్రయత్నము లేకుండా లేక సంకల్పము లేకుండా కర్మ అనేది ఉండదు. కాబట్టే అందరికీ సంకల్పములు ఉంటున్నాయి. సంకల్పములు రెండు రకములు : 1. బంధహేతువులు, 2. ముక్తిహేతువులు. మొదటి వానిని త్యజించాలి. రెండవ వానిని అలవరచుకోవాలి. పూర్వ (కృత) కర్మలేనిదే (కర్మ) ఫలము ఉండదు. పూర్వ సంకల్పము లేనిదే కర్మ ఉండదు. కర్తృత్వ భావన నిలిచి ఉన్నంత కాలమూ, ముక్తి కూడా ప్రయత్న (సాధనా) ఫలమనియే భావించవలసి ఉంటుంది.

భ: అయితే మనిషి కర్మాచరణశీలియై, తృష్ణారహితుడై, ఏకాంతవాసియై ఉండాలి. అంతే కదా? **(స.20)**

మ: అవును. కామ్యకర్మయే బంధము. నిష్కామకర్మ కర్తను బాధించదు. కర్మరతుడై ఉన్నా కూడా, అట్టి వాడు ఏకాంతంలో ఉన్నట్లే.

## 4.08 నీవు ప్రయత్నపూర్వకంగా చేసినా, చేయకపోయినా, పనులన్నీ సాగిపోతుంటాయి (స.313)

భ : "అంతరంలోని ఈశ్వరుణ్ణి" అన్వేషించటంలో మనిషి నిమగ్నుడై ఉన్నా కూడా

...మయిన క్రియాకలాపములన్నీ వాటి అంతట అవి కొనసాగుతుంటాయని ...న్ నిన్న చెప్పారు. శ్రీ చైతన్యుల జీవితంలో ఒక ఘట్టం ఉంది. ఆయన కృష్ణుని (ఆత్మ) అన్వేషణలో ఉండి, విద్యార్థులనుద్దేశించి ఉపన్యసిస్తున్నప్పుడు, తన ...ం ఎక్కడ ఉన్నదో మరచిపోయి, కృష్ణుని గురించే మాట్లాడసాగారు. దీని వల్ల ...క సందేహం ఉత్పన్నమవుతున్నది. పని దానంతట అది జరుగగలదని ఊరక వదలి వేయవచ్చునా? భౌతికమయిన క్రియాకలాపములపై కొంత అయినా దృష్టి నిలుపవలసి ఉంటుందా?

మ: అన్నీ ఆత్మయే. ఇప్పుడు నేను నిన్ను ఒకమాట అడుగుతున్నాను : నీవు ఆత్మ కంటె వేరుగా ఉన్నావా? ఆత్మకంటె వేరుగా పని కొనసాగగలదా? లేక దేహము ఆత్మకంటె వేరుగా ఉన్నదా? అవి ఏవీ ఆత్మ భిన్నముగా లేవు. ఆత్మ సర్వతోముఖమైనట్టిది. కాబట్టి సర్వకర్మలూ నీవు ప్రయత్నపూర్వకముగా చేసినా, చేయకపోయినా – కొనసాగిపోతాయి. పని దాని అంతట అది కొనసాగిపోతుంది. ఆత్మనిష్ఠలో కర్మనిష్ఠ కూడా ఇమిడి ఉంది.

## 4.09 ప్రపంచము కేవలము ఒక చలన చిత్రము వంటిదే (స.402)

సూర్యకాంతి చంద్రుని మీద ప్రతిఫలించడం వలన భూమి ప్రకాశించింది. అట్లాగే హృదయంనుంచి ప్రసరించిన చైతన్యంతో మెదడు పనిచేయడం, తద్వారా శరీరము రక్షించబడటం జరుగుతోంది. భగవాన్ యొక్క ఈ భోధ రమణగీతలో గూడా కనిపిస్తుంది. హదయము అత్యంత ప్రధానకేంద్రము. దానినుంచి ప్రాణశక్తి, వెలుగు, మెదడుకు ప్రసరించి దాన్ని క్రియాశీలము గావిస్తాయి. వాసనలు మిక్కిలి సూక్ష్మరూపంలో హృదయంలో దాచబడి వుంటాయి. తరువాత మెదడులోకి ప్రవహిస్తాయి. మెదడు వాటిని ప్రతిదశలోనూ, చలన చిత్ర ప్రదర్శనలో వలే ఎన్నో రెట్లు పెంచి ప్రతిఫలింపచేస్తుంది. ఇందువలన ప్రపంచము ఒక చలన చిత్ర ప్రదర్శన కన్న మిన్నకాదని చెప్పడమౌతుంది. శ్రీ భగవాన్ తదుపరి ఇల్లా చెప్పారు. వాసనలు హృదయములో కాక మెదడులో వుంటే, తలను నరికితే వాసనలు నశించడము

వలన పునర్జన్మలు అంతమొందాలి. కానీ అది అట్లా వుండదు. ఒక లోభి తన పెన్నిధి ఎప్పుడూ దూరంకాకుండా, తనలోనే వుంచుకుంటాడో, అదేవిధంగా ఆత్మ వాసనలను తనకు అతి దగ్గరలో, అంటే తనలోనే, హృదయంలో పదిలపరుస్తుంది. కనుక వాసనలు వుండే స్థలము ఆత్మ, అంటే, హృదయము, కానీ మెదడు కాదు. (మెదడు, హృదయమనే నేపథ్య గృహం నుంచి వచ్చే వాసనల నాటక ప్రదర్శనకి రంగస్థలము మాత్రమే)

"వాసనలు హృదయంనుంచి ప్రసరింప చేయబడినప్పుడు, అవి ఆత్మకాంతితో కూడివుండి, వ్యక్తి ఆలోచిస్తున్నాడని అంటారు. అణురూపంలో పాతుకుని వున్న వాసనల పరిమాణము హృదయం నుంచి మెదడికి వెళ్ళే దారిలో పెరుగుతుంది. వాసనల బొమ్మలు తెర అయిన మెదడుమీద పడతాయి. మెదడు వాసనల కార్యవిభజన స్థలము. మనస్సుకి స్థానము మెదడు, అది మెదడు ద్వారా పనిచేస్తుంది." **(స.614)**

## 4.10 శరీరం పని లేకుండావున్నా, మనస్సు వాసనలతో నిండిఉంటే, పనిచేస్తున్నట్లే లెక్క (అ.ర. 2.1.1946 మధ్యాహ్నం)

శ్రీ భగవాన్, మనస్సులేకుండా జ్ఞాని చేసే పనుల గురించిన ప్రశ్నకు సమాధానమిచ్చారు: మనస్సు నశించిపోతే ఏపనీ చేయలేవని నీ వూహ. పని చేయించేది కేవలము మనస్సేనని నీ వెల్లా అనుకుంటున్నావు? పనులను వుత్పత్తి చేసే కారణాలు ఎన్నో వుండవచ్చు.

ఉదాహరణకు, ఈ గడియారాన్ని చూడు. ఏ మనస్సూ లేకుండానే ఇది పనిచేస్తోంది. జ్ఞానికి మనస్సు వుందనే అనుకుందాం. అది సామాన్యుడి మనస్సుకన్న చాలా వేరైనది. ఎక్కడో దూరపు వస్తువు మీద మనస్సుంచి ఇక్కడ ఒక కథను వింటున్నవాని వంటిది అతని మనస్సు. వాసనారహితమైన మనస్సు పని చేస్తున్నా, చేయటంలేదు. అలాకాక, వాసనాభరితమైన మనస్సు, శరీరము కదలకున్నా, కర్మ చేయకుండా వున్నా, పనిచేస్తున్నట్లే.

### 4.11 వాసనలు మనస్సుని బహిర్ముఖం చేసి, దాన్ని విషయాల మీదకు మరలుస్తాయి (అ.ర.11.1.46 మధ్యాహ్నం)

ప్ర: జె.కృష్ణమూర్తి గారు ప్రయత్నంతో చేసే ధ్యానానికి విరుద్ధంగా, ప్రయత్నరహితమైన, అష్టాయిష్టాలతో ప్రమేయంలేని ఎరుకను సాధించే పద్ధతిని ఉపదేసిస్తారు. ధ్యానాన్ని ఏ విధంగా చేస్తే మేలో, ధ్యేయ వస్తువు ఏ రూపంలో వుండాలో శ్రీ భగవాన్ దయచేసి వివరిస్తారా?

మ: ప్రయత్నరహితమైన, కేవలమైన ఎరుకే మన స్వభావము. దాన్ని మనం పొందగలిగినా లేక ఆస్థితిలోనే వుండగలిగినా మంచిదే. ఆస్థితిని ప్రయత్నం చేయకుండా చేరలేము. ప్రయత్నం అంటే కోరి చేసే ధ్యానం. అనాదిగా వస్తున్న వాసనలన్నీ మనస్సుని బహిర్ముఖంచేసి, దానిని విషయాల మీదకు మళ్ళిస్తాయి. అల్లాటి ఆలోచనలను వదలివేసి, మనస్సుని అంతర్ముఖం చెయ్యాలి. దానికి చాలా మందికి ప్రయత్నం అవసరం.

### 4.12 లోపల దాగివుండి ఆలోచనల రూపంలో వస్తున్న వాసనల ఒత్తిడికి మనస్సు బహిర్గతమవుతుంది (స. 326)

మ: "ప్రతి ఒక్కరూ మనస్సు యొక్క చంచలత గురించి ఫిర్యాదు చేస్తారు. మనస్సుని కనుక్కుంటే, వారికి తెలిసివస్తుంది. ఒక మనిషి ధ్యానానికి కూర్చున్నప్పుడు ఎన్నో ఆలోచనలు ఉబికి వస్తాయి. మనస్సు కేవలం ఆలోచనల మూటయే, ఆలోచనల ప్రవాహాన్ని తోసుకుని ముందుకు వెళ్లటం విజయవంతంకాదు. వ్యక్తి ఏదోవిధంగా ఆత్మనిష్టలో వుండగలిగితే మంచిదే. అట్లా చేయలేని వారికి జపమో, లేక, ధ్యానమో నిర్దేశింపబడింది. అది ఒక ఏనుగు తొండముతో పట్టుకోవడానికి ఇవ్వబడ్డ గొలుసు లాంటిది. మామూలుగా ఏనుగు తొండము చంచలంగా వుంటుంది. దాన్ని వీధులలోనికి తీసుకు వెళ్ళినప్పుడు తొండాన్ని అన్ని వైపులకు తిప్పుతూ వుంటుంది. పట్టుకోవడానికి ఒక గొలుసునివ్వగానే ఆ చంచల్యం ఆగుతుంది. మనో చాంచల్యం

గూడా అటువంటిదే. జపంలోనో ధ్యానంలోనో నిమగ్నమయితే, ఇతర ఆలోచనలు తొలుగుతాయి. మనస్సు ఒకే ఆలోచనమీద కేంద్రీకృతమవుతుంది. ఆవిధంగా ప్రశాంతమౌతుంది. దీర్ఘ ప్రయాసలేకుండా శాంతి సిద్ధిస్తుందని దాని అర్థము కాదు. ఇతర ఆలోచనతో పోరాడి తీరవలసిందే.

మరొక ఉదాహరణ: ఒక ఆవు తిరుగుబోతై, పక్కవాని పొలంలో మేస్తోందనుకో. దాని దొంగ అలవాటు నుంచి మరల్చటం అంత తేలికకాదు. దాన్ని కొట్టంలో వుంచడం ఎట్లాగో ఆలోచించు. దాన్ని బలవంతంగా కొట్టంలో కట్టేస్తే దొంగతనంగా పారిపోయేందుకు తగిన సమయంకోసం ఎదురుచూస్తుంది. దాన్ని కొట్టంలో లేతగడ్డితో ప్రలోభపరిస్తే మొదటిరోజు కొంచెం మేసి, మళ్ళీ పారిపోవడానికి అవకాశం కోసం చూస్తుంటుంది. రెండో రోజు రెండుసార్లు మేయడం, రానురాను రోజుకి మరిన్ని ఎక్కువసార్లు మెయ్యడం అలవాటు అవుతుంది. చివరకు దాని దురలవాటు నుంచి బయట పడుతుంది. దాని దురలవాటు నుంచి పూర్తిగా విముక్తి అయినప్పుడు, దాన్ని స్వేచ్ఛగా వదలివేసినా, అది పక్కవాని పొలంలో మేతకు వెళ్ళదు. దాన్ని కొట్టంలో కట్టివేయకపోయినా ఆపైన అది కొట్టంవదలి వెళ్ళదు.

మనస్సు గూడా అటువంటిదే. ఆలోచనల రూపంలో తోసుకువస్తున్న గుప్తవాసనల బలంవల్ల అది బహిర్గతమౌతుంది. లోపల వాసనలు దాగివున్నంత వరకూ అవి బయటకు వచ్చి క్షయము కావలసిందే. మనస్సు ఆలోచనల సముదాయము. మనస్సు ఏమిటని శోధిస్తే ఆలోచనలు వెనక్కిమళ్ళుతాయి. అప్పుడు సాధకుడికి అవి ఆత్మనుంచి ఉదయిస్తున్నట్లు తెలుస్తుంది. ఆలోచనల సముదాయాన్నే మనము మనస్సంటున్నాము. ఆలోచనలు ఆత్మ నుండి ఉద్భవిస్తున్నాయని తెలుసుకొని, వాటి ఆమూలమైన ఆత్మలో నిష్ఠతోవుంటే, మనస్సు అదృశ్యమవుతుంది. మనస్సు నశించి శాంతియుత ఆనందము అనుభవగోచరమైనప్పుడు, ఇప్పుడు ఆలోచనలని తొలగించు కోవడం ఎంత కష్టమో, అప్పుడు ఆలోచన కలిగించడం గూడా అంతే కష్టమని తెలుస్తుంది. ఇక్కడ మనస్సే తిరుగుబోతు ఆవు. ఆలోచనలు పక్కవాని పచ్చిక పొలము. ఆలోచనారహితమైన మనిషి యొక్క ప్రథమ స్థితియే కొట్టము.

[illegible]గుత ఆనందము భంగపరచగోరని ఉత్కృష్టస్థితి. గాఢ నిద్రలో వున్న వ్యక్తిని [illegible] మేల్కొలిపి, నీ పని చేయవలసిందని అంటే, అతను అసహ్యపడతాడు. నిద్రలోని ప్రశాంతత ఎంత ఆనందదాయిని అంటే, అది ఆలోచనలవలన [illegible]గే పనికోసం వదలుకోలేనిది. ఆలోచనారహిత స్థితి వ్యక్తి యొక్క ఆనందభరితమైన [illegible]స్థితి. చింతాభరితమైన స్థితి కోసం ఆలోచనారహిత స్థితిని వదలుకోవడం సుఖదాయకము కాదా.

## 4.13 ఆత్మనిష్ఠలో కర్మనిష్ఠకూడా వుంది (స.313)

భ: నేను పనిపై దృష్టి ఉంచకపోతే, ఆ పని దెబ్బ తినవచ్చును.

మ: నీవు నీ దేహముతో తాదాత్మ్యము చెంది ఉన్నావు కనుక, "నేను పని చేస్తున్నాను" అని నీవు భావిస్తున్నావు. కాని దేహము, దాని క్రియాకలాపములు, చేసే పనితో సహా - అన్నీ ఆత్మ కంటె వేరుగా లేవు. నీవు పని మీద దృష్టి పెడితే నేమి, పెట్టకపోతే నేమి? దానివల్ల ఏమి అయింది? ఉదాహరణకు, నీవు ఒకచోటి నుండి ఇంకొక చోటికి నడుస్తున్నావు. నీవు వేసే ప్రతి అడుగుపైన నీవు నీ దృష్టిని నిలుపుతున్నావా? కాసేపు అయిన తరువాత, ఎలాగూ, నీవు పోవలసిన చోటికి నీవు చేరుకొని వుంటావు. అంటే నీవు చేసే పని, అనగా నీ నడక - నీ దృష్టి దానిపై నిలిపి ఉండకపోయినా, ఎలా కొనసాగిపోతున్నదో గమనించి చూడు. ఇతరములయిన పనుల విషయమూ అంతే.

భ: అప్పుడు అది నిద్రలో నడుస్తున్నట్లు ఉంటుంది.

మ: సరిగా అంతే. పసిబిడ్డ నిద్రిస్తూ ఉంటుంది. అది నిద్రిస్తుండగానే, తల్లి అన్నం తినిపిస్తుంది. బిడ్డ అన్నం తింటుంది. మెలకువతో ఉన్నప్పుడు ఎలా తింటుందో అలా బాగానే తింటుంది. కాని మర్నాడు ఉదయం లేవగానే బిడ్డ తల్లితో, "అమ్మా! నిన్న రాత్రి నేను అన్నం తినలేదు" అని చెబుతుంది. తల్లీ, మిగిలిన వాళ్లూ బిడ్డ అన్నం తిన్నట్లు చూశారు. కాని ఆ బిడ్డ తాను అన్నం తినలేదనే చెబుతుంది. ఆ

బిడ్డకు తెలియకుండానే అన్నం తినటం జరిగింది. నిద్రలో నడక నిజంగానే చక్కని ఉపమానము. ఈ విధముగా పని చేయటాన్ని అది చక్కగా వివరిస్తుంది.

మరొక దృష్టాంతమును చూడు. ఒక ప్రయాణీకుడు బండిలో నిద్రపోయినాడు. ప్రయాణ సమయంలో ఎద్దులు నడుస్తుంటాయి, లేక ఎక్కడైనా నిలిచి ఉంటాయి, లేదా బండి నుండి విప్పబడతాయి. ప్రయాణీకునికి ఈ సంఘటనలలో ఏ ఒక్కటి తెలియదు. కాని అతడు మేల్కొన్న తరువాత చూస్తే, తన ప్రయాణం పూర్తి అయిందని తెలుస్తుంది. అదే రీతిగా మనిషి యొక్క ఆత్మ విషయం కూడా ఉంటుంది. అతడు దేహంలో నిద్రించాడు. అతని జాగ్రదవస్థ ఎద్దుల నడక. అతని సమాధి ఎద్దులు నిలిచి ఉండటం. (ఎందుకంటే సమాధి = జాగ్రత్ సుషుప్తి). అంటే అతనికి ఎరుక ఉన్నది కాని పనుల పట్ల అతడు అనాసక్తితో ఉంటాడు. ఎద్దులు బండికి కట్టబడే ఉంటాయి. కాని కదలకుండా నిల్చి ఉంటాయి. అతని సుషుప్త్యవస్థ ఎద్దులను బండి నుండి విప్పటం. ఎందుకంటే, కాడి నుండి ఎద్దులను విప్పినట్లుగానే క్రియాకలాపములన్నీ నిద్రా సమయంలో ఆగిపోతాయి.

ఇది కాక మరొక దృష్టాంతం ఉన్నది. సినిమాలో తెరమీద చిత్రములు ప్రదర్శింపబడతాయి. తెరమీద ఆడుతున్న చిత్రములు తెరను ఏ మాత్రమూ బాధించవు, అవి తెరలో ఏ మార్పును తీసికొనిరావు. సినిమా చూచే ప్రేక్షకుడు చిత్రములను చూస్తాడు, తెరను ఉపేక్షిస్తాడు. అయితే చిత్రములు తెరను విడిచి ఉండజాలవు. అయినా గాని, తెరయొక్క ఉనికి ఉపేక్షింపబడుతుంది. అదే విధంగా, ఆత్మ ఒక తెర. దాని మీద చిత్రములు, అనగా అనేక క్రియాకలాపములు సాగిపోతుంటాయి. మనిషికి ఈ క్రియాకలాపములు తెలుస్తాయి, ఆత్మ తెలియదు, దానిని అతడు ఉపేక్షిస్తాడు. అయినప్పటికీ అతడు ఆత్మకంటె వేరుగా లేనేలేడు. తెలిసినా, తెలియకపోయినా, పనులన్నీ జరిగిపోతూనే ఉంటాయి.

భ: సినిమాలో ఆపరేటర్ ఉంటాడు.

మ: సినిమా ప్రదర్శన యావత్తూ జడపదార్థాలతో చేయబడింది. తెర, తెరపై ఆడే చిత్రములు, దీపము ఇత్యాదులన్నీ జడవస్తువులు. వానిని నడిపించేందుకు, చేతనుడైన ఒక కర్త, ఒక ఆపరేటర్ ఉండాలి. ఆత్మ విషయంలో అలా కాదు. అదే స్వయముగా చైతన్యము, అందువలన స్వయంపూర్ణము. దానికి వేరుగా చాలకుడు ఎవడూ అక్కరలేదు.

భ: పై జవాబులో తనకాభావము ఉన్నట్లు చెప్పబడినదనీ, అయితే తాను దేహమును చాలకునిగా భ్రమించుట లేదనీ అతడు చెప్పాడు.

మ: దేహవ్యాపారములు మనస్సులో ఉన్నాయి. వానికి ఒక ఆపరేటర్ అవసరము కదా! దేహము ఉన్నది. అది జడ పదార్థము. దానిని నడిపించేందుకు చేతనుడైన ఒక కర్త, ఒక చాలకుడు ఉండాలి. జనులు తాము జీవులమని భావిస్తున్నారు కనుక జీవులను నడిపించేందుకు హృదయంలో చాలకునిగా భగవంతుడు ఉన్నాడని కృష్ణుడు చెప్పాడు. నిజానికి జీవుడూ లేడు, చాలకుడూ లేడు. ఆత్మలోనే అన్నీ ఉన్నాయి. తెర, చిత్రములు, ప్రేక్షకుడు, నటుడు, చాలకుడు, దీపము, ఇతరములన్నీ ఆత్మయే. ఆత్మను దేహముగా భ్రమించటం, నిన్ను నీవు ఒక నటునిగా ఊహించుకోవటం – సినిమాలో ప్రేక్షకుణ్ణి నటునిగా నిరూపించటం వలె ఉంటుంది. తెర లేకుండా తాను ఒక దృశ్యములో నటించవచ్చునా అని అడిగే నటుణ్ణి ఊహించుకో. ఆత్మ కంటే వేరుగా తాను పని చేస్తున్నట్లు భావించే మనిషి సంగతికూడా అలాగే ఉంటుంది.

భ: సినిమాలో నటించవలసిందిగా ప్రేక్షకుని కోరినట్లు ఇది ఉన్నది. నిద్రలో నడక కోరదగినది అన్నట్లు తోస్తున్నది.

మ: కాకి ఒకే కనుగ్రుడ్డును ఏ కంటిలోనికైనా త్రిప్పి వస్తువులను చూస్తుందనే నమ్మకం ఒకటి ఉంది. దానికి కనుగ్రుడ్డు ఒక్కటే, నేత్రగోళములు రెండు. అది కోరిన విధంగా చూచేందుకు దృష్టిని మార్చుకొంటుంది. అలాగే ఏనుగుకు తొండం

ఉన్నది. దానితో అది శ్వాస పీలుస్తుంది, నీళ్లను త్రాగటం మొదలయిన పనులు చేస్తుంది. అదే రీతిగా పాములు చూచేందుకు, వినేందుకు ఒకే అవయవమును ఉపయోగిస్తాయని చెబుతారు. ఆ విధంగానే చర్యలు, స్థితులు మనిషి యొక్క దృక్పథాన్ని బట్టి ఉంటాయి. నిద్రలో మెలకువ, మెలకువలో నిద్ర, కల తోటి నిద్ర, కల తోటి మెలకువ - ఇవి అన్నీ ఒక దానిని గురించే చెప్పబడ్డాయి.

భ: మనము మెలకువలో ఉన్న భౌతిక ప్రపంచంలో ఒక భౌతిక దేహంతో వ్యవహరింపవలసి ఉంది. పనిచేసేటప్పుడు నిద్రబోయినా లేక నిద్రముంచుకొని వచ్చేటప్పుడు పని చేసినా, చేసే పని దెబ్బ తింటుంది.

మ: **నిద్ర అజ్ఞాన దశ కాదు. అది నీ శుద్ధ స్థితి. మెలకువ జ్ఞానము కాదు. అది అజ్ఞానము. నిద్రలో పూర్తి ఎరుక ఉన్నది. మెలకువలో ఉన్నదంతా అజ్ఞానమే. నీ స్వరూపము ఈ రెంటినీ ఆవరించి యుండి, వానిని అధిగమించి కూడా వ్యాపించి ఉంది.** ఆత్మ జ్ఞానమునకు, అజ్ఞానమునకు అవ్వలిది. నిద్ర, కల, మెలకువ - ఇవి ఆత్మ సమక్షమున సాగిపోతున్న వృత్తులు మాత్రమే. నీవు వానిని ఎరిగినా, ఎరుగక పోయినా, అవి సాగిపోతూనే ఉంటాయి. జ్ఞాని యొక్క స్థితి అది; అతనిలో జాగ్రత్తు, సమాధి, సుషుప్తి, స్వప్నము అనే దశలు, ప్రయాణీకుడు నిద్రిస్తుండగా ఎద్దులు నడుస్తుండటం, నిలిచి ఉండటం, కాడి నుండి విప్పబడటం, మొదలయిన దశల వలె సాగిపోతుంటాయి. అజ్ఞాని యొక్క దృక్పథము ననుసరించి ఇప్పుడు ఈ ప్రశ్నలన్నీ తలెత్తాయి. లేకపోతే ఈ ప్రశ్నలకు తావులేదు.

## 4.14 చర్యలు అన్నీ నీవి కానేకావు, అవి భగవంతుని చర్యలు (స.78)

భ: వ్యావహారికమైన దైనందిన జీవితం అట్టి ప్రయత్నములకు అనుకూలము కాదు.

మ: నీవు పనులు చేస్తున్నావని ఎందుకు అనుకోవటం? ఇక్కడికి నీవు రావటాన్నే ఉదాహరణగా తీసుకో. ఒక బండిలో నీవు ఇంటి నుండి బయలు దేరావు. రైలెక్కావు.

...స్టేషనులో దిగావు. ఒక బండి తీసుకొని ఇక్కడికి వచ్చావు. ఆశ్రమానికి చేరావు. ఎవరయినా అడిగితే, "నేను మా పట్టణం నుండి ఇంత దూరము ప్రయాణం చేసి వచ్చాను," అని చెబుతావు. అది నిజమా? వాస్తవం ఏమిటి? నీవు ఉన్నవాడవు ఉన్నట్లు ఉన్నావు. వాహనములు కదలివచ్చాయి. దారిలో అంతటా ఇదే జరిగింది. ఆ వాహనముల కదలికలను, నీ కదలికలుగా భ్రాంతి చెందినట్లుగానే, ఇతరములైన పనుల విషయంలో కూడా నీవు భ్రాంతికి గురి అవుతున్నావు. నీవు చేసినట్లు భావించే పనులు అన్నీ నీవు చేసినవికావు. అవి అన్నీ భగవంతుడు చేసిన పనులు.

భ: అట్టి భావము వల్ల మనస్సు శూన్యమైపోయి, చేసే పని ముందుకు సాగదు.

మ: ఆ శూన్యస్థితిని చేరుకొని, అప్పుడు నాతో చెప్పు.

### 4.15 నీ పుట్టుక యొక్క ప్రయోజనము నెరవేరుతుంది – నీవు కోరుకొన్నా, కోరుకొనక పోయినా (స.189)

భ: సాధకుడు సాధారణంగా పనులు ఎలా చేయాలి?

మ: కర్తతో తాను తాదాత్మ్యము చెందకుండా చేయాలి. ఉదాహరణకు పారిస్‌లో ఉండగా, నీవు ఇక్కడికి వద్దామని అనుకున్నావా?

భ: లేదు.

మ: ఇలా చేయాలన్న ఉద్దేశ్యం నీకు లేకుండానే నీవు ఏ విధంగా పనులు చేస్తున్నావో చూడు. మనిషి కర్మలు చేయకుండా (క్షణమైనా) ఉండలేడని కదా గీతచెబుతోంది: నీవు కోరుకున్నా, కోరుకొనకపోయినా, నీవు పుట్టినందుకు, ఆ పుట్టుక యొక్క ప్రయోజనం నెరవేరి తీరుతుంది. ఆ ప్రయోజనం దాని అంతట అది నెరవేరనీ.

భ: దానివలన మా పనిలో ఆసక్తి తగ్గుతుంది. మేము మా విధిని నిర్వర్తించ

వలయునా, లేదా? (స. 463)

మ: అవును. నీ పనిని నీవు తప్పకుండా చేయవలసిందే. ఒక వేళ నీవు చేయవలసిన పనిని చేయకుండా ఉండేందుకు ప్రయత్నించినప్పటికీ, బలవంతంగానైనా దానిని నీవు చేయవలసి వస్తుంది. ఈ దేహము దేని కోసం వచ్చిందో, ఆ పనిని అది పూర్తి చేయవలసి ఉంది. కృష్ణుడు గీతలో చెప్పాడు : అర్జునా, నీకు ఇష్టము ఉన్నా లేకపోయినా, నీవు బలవంతముగానైనా యుద్ధము చేయవలసివస్తుంది. నీవు చేయవలసిన పని ఉంటే, దాని నుండి నీవు తప్పించుకోలేవు. నీవు పని చేయ నవసరంలేకపోతే దానిని నీవు చేయాలన్నా చేయలేవు. అంటే, నీకు నిర్దేశింపబడియున్న కార్యము జరిగి తీరుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే, పని ఎలాగూ సాగిపోతుంది. అయితే నీ పాత్రను నీవు నిర్వహించాలి. తప్పదు.

భ: అది చేయటం ఎలా?

మ: నాటకరంగంలో ఒక నటుడు తన పాత్రను పోషించిన రీతిగా - రాగద్వేషములు లేకుండా.

## 4.16 జ్ఞానిని మహాకర్త అని అంటారు (స. 467)

భ: పురుష ప్రయత్నం లేకుండా పనులు వాటంతట అవి జరుగుతాయా? భోజనం చేయాలంటే మనం అన్నం వండుకోవాలి కదా?

మ: **ఆత్మ అహంత ద్వారా పని చేస్తుంది.** పనులన్నీ ప్రయత్నసాధ్యములే. నిద్రిస్తున్న బిడ్డకు తల్లి అన్నం పెడుతుంది. బిడ్డ అన్నంతింటుంది. తినేటప్పుడు పూర్తి మెలకువలో ఉండదు. ఆ తరువాత "నేను అన్నం తినలేదు," అంటుంది. కాని ఏమి జరిగిందో తల్లికి తెలుసు. అలాగే జ్ఞాని తెలియకుండానే పనులు చేస్తాడు. కాని తాను పని చేస్తున్నట్లు జ్ఞానికి తెలియదు. అతని భయము వలన వాయువు వీచుట మొదలయినవి జరుగుతున్నాయి. జగత్తు యొక్క తీరు అది. **సమస్తమును ఆయన శాసిస్తున్నాడు; జగత్తు ఆ ప్రకారంగానే నడుస్తున్నది. అయినా ఆయనకు**

[illegible] అందుకే ఆయన మహాకర్త అని పిలువబడుతున్నాడు. దేహధారి [illegible] అయిన ప్రతివాడూ విధి నియమబద్ధుడై ఉన్నాడు. బ్రహ్మ కూడా [illegible] ఉల్లంఘింపజాలడు. (ఈ భిక్షుడు తరువాత తన ప్రశ్నలోని అంతరార్థాన్ని [illegible] జగత్తు సాగిపోతున్నదనీ, అందులో మనిషి యొక్క అవసరములన్నీ [illegible] తీరుతుంటాయని శ్రీ భగవాన్ చెప్పగా అతడు విన్నాడు. కాని శ్రీ భగవాన్ ప్రతిదినము ఆనాటి కూరలను తరుగుట కోసం ఆశ్రమవాసులను తెల్లవారు జామున 4.00 గం॥ల ప్రాంతములో మేల్కొల్పుతుండటాన్ని అతడు చూచాడు. అతడు తనకు కలిగిన సందేహాన్ని తీర్చుకొనగోరాడు. అది తన ప్రయోజనము నిమిత్తమే. అందువలన ఆ ప్రశ్న చర్చ కోసం ఉద్దేశింపబడింది కాదు.)

**4.17 "పని చేసేది ఎవరు? అని విచారించు, "నేనెవడను?" ఇది గుర్తుంచుకో, పని నిన్ను బంధించదు, అది దానంతట అది జరిగిపోతుంది (స.268)**

మ: విషయ పరిత్యాగమునకై గల కోరికయే ఆటంకము. ఆత్మ అంటే కేవలము త్యాగమే. ఆత్మ సమస్తమును పరిత్యజించి యున్నట్టిది.

భ: భగవాన్ యొక్క దృక్పథమును బట్టి అది నిజమే. కాని మాకు - నా విధి నిర్వహణకొరకే నాకున్న సమయంలో ఎక్కువ భాగం నా యావచ్ఛక్తి వ్యయము చేయవలసి వస్తోంది. ఆత్మ చింతనము చేయాలన్నా కూడా నేను తరచు బాగా అలసిపోయి ఉంటున్నాను.

మ: 'నేను పనిచేస్తున్నాను' అనే భావనయే ఆటంకము. 'పని చేస్తున్నది ఎవరు?' అని విచారించు. 'నేనెవడను?' అనే విషయాన్ని గుర్తులో ఉంచుకో. చేస్తున్నపని నిన్ను బంధించదు. అది అప్రయత్నంగా సాగిపోతుంది. పని చేసేందుకు గాని, పనిని మానివేసేందుకు గాని ప్రయత్నించవద్దు. నీ ప్రయత్నమే బంధము. జరుగవలసినది జరిగే తీరుతుంది. నీవు పని చేయరాదని వ్రాసిపెట్టి ఉంటే, దాని

కోసం ఎంతగా వెంపరలాడినా, చేయటానికి నీకు ఆ పని లభించదు. నీవు పనిచేయవలసి ఉన్నదని వ్రాసిపెట్టి ఉంటే, బలవంతముగానైనా నీవు ఆ పని చేసే తీరుతావు. కాబట్టి అంతటినీ ఆ మహాశక్తికి వదలిపెట్టు. నీవు ఎంచుకొన్న విధంగా, దేనినీ పట్టుకోనూలేవు, పరిత్యజించనూ లేవు!

భ: ఆత్మ సాక్షాత్కారానికి కర్మచేయటం అవరోధము అవుతుందా? (స. **17**)

మ: లేదు. జ్ఞానసిద్ధునకు ఆత్మ మాత్రమే సత్యము, కర్మలు దృశ్య విషయములు. అవి ఆత్మను బాధించవు. అతడు ఏదైనా కర్మను చేసినప్పటికీ, తాను కర్తను అనే భావన అతనికి ఉండదు. అతడు చేసే పనులన్నీ అసంకల్పితములు. వానికి అతడు సాక్షి మాత్రుడై, వాని పట్ల అనాసక్తితో ఉంటాడు. అతని చర్యలకు ఏ ఉద్దేశ్యమూ ఉండదు. జ్ఞాన మార్గగామి అయిన సాధకుడు కూడా పనులు చేస్తున్నప్పుడు ఇదే దృష్టిని కలిగి ఉండేందుకు అభ్యాసము చేయవచ్చు. ముక్తినికోరు వానికి ప్రారంభదశలలో ఇది కష్టంగానే ఉండవచ్చు. కాని కొంత అభ్యాసం అయిన తరువాత, అచిరకాలంలోనే అది ఫలవంతమౌతుంది. అప్పుడు కర్మాచరణము ధ్యానాభ్యాసమునకు ఆటంకము కాదని తెలుస్తుంది.

భ: నాకు వృత్తి పరమయిన పనులు ఉన్నాయి. అయినా నేను నిరంతర ధ్యానంలో ఉండాలని కోరుకుంటున్నాను. ఈ రెంటికీ పరస్పర వైరుధ్యం ఉన్నదా? (స. **30**)

మ: విరోధము లేదు. నీవు రెంటినీ అభ్యాసం చేస్తూ, నీ శక్తి సామర్థ్యాలను పెంపొందింపజేసుకొంటున్న కొద్దీ, ఆ రెంటినీ చక్కగా చేయగల్గుతావు. నీ వృత్తి వ్యాపారాదులను నీవు స్వప్నతుల్యములుగా చూడటం మొదలుపెడతావు.

భగవద్గీతలో ఇలా చెప్పబడింది :

"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ (గీత 2 - 69)

"సర్వజీవులకు ఏది రాత్రిగా ఉంటుందో, అది యోగికి మెలకువతో ఉన్న సమయముగా ఉండును. జీవులకు ఏది మెలకువగా ఉంటుందో అది ముని అయిన వానికి రాత్రిగా ఉండును."

ఆమె : కర్మకూ ధ్యానమునకు సమన్వయము ఎలా? (స.68)

మ: కర్మ చేసేవాడు ఎవడు? కర్మ ఎవడు చేస్తున్నాడో వాడే ఈ ప్రశ్నను అడుగవలసి ఉంటుంది. నీవు ఎప్పుడూ ఆత్మవే. నీవు మనస్సువు కావు. ఈ ప్రశ్నలన్నింటినీ లేవనెత్తేది మనస్సే. ఆత్మ సాన్నిధ్యములోనే ఎప్పుడూ కర్మ కొనసాగుతుంది. సాక్షాత్కారమునకు కర్మ అవరోధము కానేకాదు. కర్త యొక్క మిథ్యా తాదాత్మ్యమే మనఃక్లేశమునకు కారణమవుతున్నది. ఈ మిథ్యా తాదాత్మ్యాన్ని వదలిపెట్టు.

## 4.18 వ్యక్తిత్వం పోయేదాకా విచారణను కొనసాగించవలసి ఉంటుంది (స. 454)

భ : మనిషి బహిర్వ్యాపారములలో నిమగ్నుడయి ఉన్నప్పుడు కూడా ఆత్మ విచారణను అభ్యసింపవలయుని శ్రీ భగవాన్ సూచించియున్నారు. ఆత్మ విచారణ గమ్యం ఆత్మ సాక్షాత్కారము. అప్పుడు శ్వాస ఆగిపోవాలి. శ్వాస నిలిచిపోతే, కర్మ ఎలా సాగుతుంది? మరో మాటలో చెప్పాలంటే, పని చేసేటప్పుడు శ్వాస ఎలా నిలుస్తుంది?

మ: ఈ మాటలలో సాధ్యసాధనముల విషయములో అస్పష్టత కనిపిస్తోంది. విచారణ చేసే వాడు ఎవడు? అతడు సాధకుడే గాని, సిద్ధుడు కాడు. విచారణ చేయటం అనే మాటలో విచారణ వేరు, విచారించే వాడు వేరు అనే భావం ఇమిడి ఉన్నది. ఈ ద్వైతభావన ఉన్నంతకాలమూ విచారణ కొనసాగించవలసిందే; అంటే జీవత్వము నశించి (విచారణ, ఆ విచారణ చేసేవాడు అనే ద్వైతము నశించి) ఆత్మ ఒక్కటే శాశ్వతమయిన 'సత్' తత్త్వము అనే అనుభవము కలిగేవరకూ విచారణ చేయవలసిందే. 'సత్య'మేమిటంటే – ఆత్మ నిశ్చలము, అవిచ్ఛిన్నము

అయిన ఎరుక. ఆత్మ స్వరూపము ఎరుకయే అని కనుగొనుటయే విచారణోద్దేశము. భేదభావన గోచరించుచున్నంత వరకు సాధకుడు విచారణాభ్యాసము చేయవలసి ఉంటుంది. ఒక్కసారి సాక్షాత్కారము కలిగిందా, ఇక విచారణ చేయవలసిన అగత్యము లేదు. ఈ ప్రశ్న కూడా అప్పుడు తలెత్తదు. **ఎరుక, ఎరుక కలిగినయున్నది ఎవరు అని, తనను తాను ఎప్పుడైనా ప్రశ్నించుకొనే సందర్భము ఏర్పడుతుందా?** ఎరుక శుద్ధముగా సరళముగా ఉంటుంది. **విచారణ చేసే వానికి తన వ్యక్తిత్వము యొక్క ఎరుక ఉంటుంది. జీవపరమయిన అతని ఎరుకకు విచారణ అడ్డుగా నిలువదు.** బహిర్వ్యాపారములు కూడా అట్టి ఎరుకను అడ్డగింపవు. బాహ్యమని తోచే కర్మ వ్యక్తి యొక్క ఎరుకను అడ్డగించనప్పుడు ఇక ఆత్మ భిన్నముకాదని తెలిసికొన్న కర్మ అఖండమయిన ఆత్మ యొక్క ఎరుకను అడ్డగిస్తుందా? ఆత్మ అనునది అద్వితీయము; అది కర్మ కంటె వేరు అయిన వ్యష్టితత్త్వము కాదు కదా!

**4.19 ఆ మహాశక్తిని నీవు గుర్తించినా గుర్తించకపోయినా, విధి నిర్ణీతమయి ఉన్న వ్యవస్థ మాత్రము మారదు, నీ దృక్పథములో మాత్రమే మార్పు వస్తుంది (స.503)**

ఆ మహాశక్తికి నిన్ను నీవు అర్పించుకొన్నట్లయితే, అంతా చక్కగానే ఉంటుంది. ఆ శక్తే నీ వ్యవహారము లన్నింటినీ చక్కదిద్దుతుంది. నీవు కర్తవు అని భావించినంతకాలమూ నీ కర్మ ఫలములను నీవే అనుభవించవలసి ఉంటుంది. అలా కాకుండా, నీవు శరణాగతి చెంది, నీ వ్యష్ట్యాత్మ ఆ మహాశక్తి చేతిలోని ఉపకరణము మాత్రమే అని గుర్తిస్తే, ఆ శక్తియే నీ వ్యవహారము లన్నింటినీ, కర్మఫలములతో సహా, తనపై వేసుకొంటుంది. అవి నిన్ను ఇక యేమాత్రము బాధించవు – పని మాత్రము నిరాటంకముగా సాగిపోతుంది. ఆ శక్తిని నీవు గుర్తించినా, గుర్తించకపోయినా, విధి నిర్ణీతమై ఉన్న వ్యవస్థమాత్రము మారదు. నీ దృక్పథములోమాత్రమే మార్పు వస్తుంది. రైలు బండిలో ప్రయాణం చేస్తున్నప్పుడు నీ మూటను నీ నెత్తిపై ఎందుకు మోయటం? మూట రైలుబండిలో క్రింద ఉన్నా,

నీ నెత్తిపై పెట్టుకొన్నా రైలు బండి మోసే బరువును నీవేమీ తగ్గించటం లేదు. కాకపోతే అనవసరంగా నిన్ను నీవు కష్టపెట్టుకుంటున్నావు; అంతకంటె ఏమీ లేదు. మనుషులకు ప్రపంచంలో ఉండే కర్తృత్వభావన కూడా ఇలాంటిదే.

# చివరిమాట : సింహగర్జన

సింహపుపిల్ల ఎలాగో తల్లినుంచి విడిచిపోయి, ఒక గొఱ్ఱెలమందలో ఉండిపోయింది. చిన్నదే కదా అని ఆ గొఱ్ఱెల కాపరి దానిని కూడ తన మందలో ఉండనిచ్చాడు. ఆ చిన్నది గొఱ్ఱెల వలె పెరిగి, గొఱ్ఱెపాలు తాగి, గొఱ్ఱె గొంతుతోనే అరిచేది. కొంతకాలం గడిచి ఒకనాడు అది సింహగర్జనని ఆలకించింది. అదేదో కొత్తగా ఉందని, తాను కూడా గర్జించడానికి ప్రయత్నించింది. నిజంగానే గర్జించింది. ఆ గర్జనని విని మిగిలిన గొఱ్ఱెలన్నీ భయంతో పారిపోయాయి. తన కొత్తస్థాయిని గ్రహించి మళ్ళీమళ్ళీ గర్జించడం మొదలు పెట్టింది. తాను గొఱ్ఱెను కాననీ, నిజంగా సింహాన్నేననీ గ్రహించింది. జూలును ఎగరేసుకుంటూ రాజఠీవితో అడవిలోకి వెళ్లిపోయింది.

శ్రీ భగవాన్ చెప్పేది ఇది: సాక్షాత్కారం ఉండనే ఉంది. ఆలోచనా రహితమైన స్థితే అసలు స్థితి. సాక్షాత్కారమనే క్రియ ఏదీ లేదు. ఆత్మని ఎరుగని వారంటూ ఎవరైనా ఉన్నారా అసలు? తన ఉనికిని ఎవరైనా కాదనగలరా? మనమున్నట్టు గ్రహించినప్పుడు ఆత్మని తెలియకపోవడమేమిటి?

"ఆత్మ ఏకం. పరిమితమైతే అదే అహంభావం. అపరిమితమైతే అది అమేయం, అదే సత్యం. బుడగలు ఒక దాని నుండి ఒకటి వేరు, అవి అనేకం కూడా. కాని సముద్రమొక్కటే కదా. అట్లాగే అహంభావాలనేకం ఆత్మ మాత్రమేకం. నీవు అహంభావానివి కావు అని చెప్పినప్పుడు నీవు ఆత్మవే అని గ్రహించు. ఇంకా అహంభావంతో తాదాత్మ్యం చెందడమెందుకు? అహంభావరాహిత్యమే సద్వస్తువంటే. అహంభావపు అస్తిత్వమేమిటో అన్వేషించి, దానిని నాశనమొనర్చు. అసలు దానికి అస్తిత్వమే లేనందువల్ల అది మాయమవుతుంది, ఆత్మ స్వయంప్రకాశమవుతుంది. ఇదే సూటి అయిన మార్గం.

"మనమే సత్యమై ఉండి ఆ సత్యంకోసమే వెదుక్కుంటాం. ఇంతకన్నా విడ్డూరమేమిటి!

ఆ సత్యాన్ని కనుమరుగు చేసేది ఏదో ఉందనీ, దానిని నాశనం చేయకపోతే, సత్యం మనకి తెలియరాదనీ అనుకుంటాం. ఇది హాస్యాస్పదం కాదా! నీవు చేసిన ప్రయత్నాలని తలచుకొని నవ్వుకునే రోజువస్తుంది. నువ్వు నవ్వుకునే రోజు ఇప్పుడే, ఇక్కడే ఉంది" **(న.146)**

ఆ సింహపు గర్జన మనం వినగలమా?

సర్వం శ్రీ రమణార్పణమస్తు

ఓం నమో భగవతే శ్రీరమణాయ